# వర్కింగ్

# హోలికా

కధలసంపుటి



రచన :

**అవలోకిత**



ప్రచురణ ;

**కాంతికుంజ**

తెనాలి

# ఇందులో



వున్నాయి.

కాంతి కుంజ

సాంస్కృతిక సంస్థ

తెనాలి - 1

సాంస్కృతిక పరమైన విషయాలపై
గోష్ఠి కార్యక్రమములను నిర్వహించుట

ఉత్తమ విలువలు గలిగిన
సాహిత్యమును ప్రచురించుట

ఈ సదాశయాలతో మా సంస్థ
ఏర్పాటయింది.

ఇట్లు

డాక్టరు. కె. రవీంద్రబాబు, అధ్యక్షులు

యం. వి. యస్. ప్రసాదరావు, "హితశ్రీ" ఉపాధ్యక్షులు

డాక్టరు. పి. దక్షిణామూర్తి, కోశాధికారి

రావెల సోమయ్య, కార్యదర్శి

యడ్లపల్లి వెంకటేశ్వరరావు, సహాయ కార్యదర్శి

ప్రాంతీయ భాషల్లో మాదిరే కథానికారచన తెలుగులోకూడ పూర్తిగా విస్తరించింది. నేటి తెలుగు కథానిక ఏ ఇతర ప్రాంతీయ భాషలోని కథానికకంటే తక్కువగాలేదు.

అవలోకిత రచించిన ఈ "వర్కోహాలిక్" తన కథానికల సంకలనం, విశేష మేమంటే ఈ రచయిత రచించినవి ఇవే మొదటి కథానికలు. కథానికలు కొందరివి ఎక్కువ వాస్తవాన్ని తక్కువ కల్పనను కలిగుంటే మరికొందరివి తక్కువ వాస్తవాన్ని ఎక్కువకల్పనను కలిగుంటాయి. ఈ కథానికల్లో మనకు ఎక్కువ వాస్తవం తక్కువ కల్పనా కనిపిస్తుంది. రచయిత మనుషుల నిత్యజీవితాన్ని, వ్యావహారిక దశను, మానసిక దశనుకూడ, పరిశీలించి గ్రహించి వుండటం ఆయన కథానికల్లో విశదం అవుతుంది. అందువల్ల వాస్తవ జీవనచిత్రణ, సక్రమ పాత్రపోషణ, వ్యక్తిలోని మానస ప్రతిక్రియలు (Psychical reactions) మొదలైనవి ఈ కథానికల్లో రూపందాల్చినాయి. అవసరం అయినచోట కొంత కల్పనకూడ చేర్చబడి కనిపిస్తుంది. శుద్ధకల్పన ఎంత అసమగ్రంగా గోచరిస్తుందో కల్పనా సాహిత్యంలో శుద్ధవాస్తవం కూడ అంతే. రెంటి సమ్మేళనమే రసాత్మక అను మేళనాన్ని సృష్టిస్తుంది. నవలలో కాని, కథానికలోకాని, ఈ సత్యాన్ని ఈ రచయిత గుర్తించకపోలేదు.

రచనలో ప్రయోగించే భాషకూడ విషయాన్నిబట్టీ, ప్రక్రియనుబట్టీ రూపొందించబడాలి. కావ్యభాష కథానికకూ, కథానికాభాష కావ్యానికీ ఉపయోగిస్తే కావ్యం కావ్యంకాకుండా పోతుంది, కథానికా కాకుండాపోతుంది. కథానికకూడ అంతే. అటు కథానికాకాదు, ఇటు కావ్యమూకాదు : ఈ కథానికల్లో అటువంటి ప్రమాదం ప్రవేశించకుండా రచయిత జాగ్రత్తపడినారు. ఈ సరళమైన కథానికలకు తగిన సరళమైన భాషనే వాడేరు.

నిత్యజీవితంలో, మన జీవితంలోను, ఇతర్ల జీవితంలోకూడ ఎన్నెన్నో అల్పమైనట్టీ, విచిత్రమైనట్టీ సంఘటనలు జరిగిపోతుంటాయి. కాని వాటికిమనం ప్రాముఖ్యం ఇవ్వం. అవి మన దృష్టికీ మనసుకూ తగలకుండానే సాగిపోతుంటాయి. కాని కల్పనా సాహిత్యకారుడు అటువంటి సంఘటన లన్నిటినీ బాహ్యదృష్టితోను, అంతర్ దృష్టితోను పరిశీలించి మానసంలో పదిలపరచుకొని తన నవలల్లోను, కథానికల్లోను వాటికి రూపకల్పన ప్రసాదిస్తాడు. ఆ రూపకల్పనకు కేవలం వస్తుగత వాస్తవాన్ని (Objective realism) మాత్రమేకాక వ్యక్తిగతకల్పనను (Subjective imagination) కూడ కొంత జోడిస్తాడు. అప్పుడు ఆ వాస్తవ సంఘటన రసమయ కథానికగా ప్రత్యక్షమవుతుంది.

దానికొక కాంతి లభిస్తుంది. యధాతధా చిత్రణ ఒక రిపోర్టుమాత్రమే అవుతుందికాని కథానిక కాజాలదు. అందులో కొంత అవాస్తవికత కలిసినప్పుడే అదికథానిక అయేది.

ఇటువంటి వాస్తవం కల్పనా మిశ్రమాలు ఈ కథల్లో బాగా కనిపిస్తాయి. (Anticlimax) లాంటి వాతావరణం కూడ వీటిల్లో అపుడపుడు గోచరిస్తుంది. వీటిలోని "త్రివేణి" అనే కథానికలో ముగ్గురు మెడికల్ విద్యార్థులు గాఢస్నేహితులుగా వుంటారు. త్రివేణి అనే మెడికల్ విద్యార్థినిని ఆ ముగ్గురులోని ఇద్దరు స్నేహితులు అమితంగా ప్రేమిస్తారు. తమనుకూడ త్రివేణి అమితంగా ప్రేమిస్తున్నదని ఆ ఇద్దరు మిత్రులు ఎవరికివారు నమ్ముతారు. ఒకరికి తెలియకుండా మరొకరు తమ ప్రేమాయణాన్ని గురించి మూడవమిత్రునికి రహస్యంగా తెలుపుకొని సంతృప్తిచెందుతుంటారు, ఇంతలో మూడవ మిత్రుడు కొంతకాలం అమెరికాలో వుండటం తటస్థించి అక్కడనుండి భారతదేశానికి తిరిగివచ్చి ఆ ఇద్దరు మిత్రులను కలుసుకొన్న తరువాత త్రివేణినికూడ కలుసుకొని వాళ్ళ ప్రేమాయణం ఏమైందని ఆమెను ప్రశ్నిస్తాడు. అందుకామె అంటుంది తాను ఆ ఇద్దరితో స్నేహం చేయటంలోని ఉద్దేశ్యం ఈ మూడవ వ్యక్తిని గురించి తెలుసుకోటానికే అని. ఇటువంటి విచిత్ర ఘట్టాలు పాఠకునిలో ఎంతగానో విస్మయానందాలను కలిగిస్తాయి !

"పరిమళ" అనే కథానికలో పరిమళ, సుగుణ అనే ఇద్దరు అమ్మాయిలుంటారు. మామూలు అందంలో సుగుణ ఎక్కువ సొంపుగా కనిపించినా తెలివితేటలలోను, మాటల్లోను , నడవడిలోను పరిమళ ఎక్కువ ఆకర్షణీయంగా కనిపిస్తుంది. రవికాంత్ అనే ఒక యువకునికి సుగుణనిచ్చి పెళ్లిచేయాలని ఇంటివారందరి ఇష్టం, పట్టుదలకూడ. అయితే, ఆ రవి మొగ్గుమాత్రం సుగుణమీద కాక పరిమళమీద మాత్రమే వుండేది. పరిమళకుమాత్రం సుగుణకూ రవికీ వివాహం జరగాలని అభిలాష వుండేది. దినదినం రవికి తనమీద గాఢప్రేమ ఎక్కువవుతుందని తెలుసుకొని తనకుగర్వం ఏర్పడినట్లు రవితో బొంకుతుంది. అందువల్ల రవికి తనమీద విరక్తి జనిస్తుందని ఆమె నమ్మకం. రవికి ఆ విషయం తెలిపి ఆమె అమెరికా వెళ్ళిపోతుంది. చిత్రమైన మనస్తత్వం పరిమళది. సుగుణ క్షేమం నిమిత్తం తనస్వార్థాన్ని త్యాగంచేస్తుంది. ఇటువంటి స్వభావాలను కల్పనా సాహిత్యంలో కధకులు అపుడపుడు చూపెడుతుంటారు. కథానికల్లోను, నవలల్లోమాత్రమేకాక వాస్తవ జగత్తులోకూడ ఇటువంటి స్వభావాలు విరళంగా అయినా కనిపిస్తూనే వుంటాయి. రచయిత తన

కల్పనా సాహిత్యంలో ఎటువంటి వింతస్వభావాలను సృష్టించినాకూడ వాస్తవజగత్తులో అటువంటి స్వభావాలు ఏ మారుమూలనో అరుదుగానైనా వుంటూనే వుంటాయి.

ఈ పుస్తకంలోని కథల్లోకల్లా ఒక విశిష్టమైన కథానిక "వర్కోహాలిక్" దీనిపేరే ఒక ప్రత్యేకంగా వున్నది. పేరు ప్రత్యేకంగా వున్నట్లే అందులోనివిషయం కూడ ఒక ప్రత్యేకంగావున్నది. ఇది ఒక పల్లెటూరి రైతుకుటుంబపు చిత్రణ. ఇందులో రామయ్య పాత్రపోషణ రమ్యంగా వున్నది. రామయ్య ఇరవైనాలుగు గంటలూ పొలంలోనో, ఇంటిలోనో ఏదో ఒక పని చేస్తూ వుండవలసిందే. ఆయన నిత్యజీవితంలో పనిలేనిక్షణమంటూ వుండేదికాదు. తీరిక అంటే అయన అర్థం పని అనే. పనిచేయటమే తీరిక ఆయన దృష్టిలో! ఆయన పనిని గురించి మన కథానికా శిల్పి ఇచ్చిన వివరణ ఎంతబాగున్నదో!

"సాధారణంగా పల్లెటూళ్లల్లో కొన్నినెలలు రైతులు ఖాళీగావుంటారు ఏపనీ లేకుండా. రామయ్యమటుకు పనిలేకుండా వుండేవాడు కాదు. వేసవికాలం పొలంలో గట్లు గెనేలుసరిచేసి చేలు చదరంచేసేవాడు. గొడ్లకు తాళ్ళువేసేవాడు. సావిళ్ళు బాగు చేసేవాడు, మెట్టపొలం వూరికే వుంచక కూరగాయ పాదులు వేసి పండించేవాడు. ఒక్కడే నీరుతోడి కూరగాయమళ్ళు తడిపేవాడు. పనిపాటలు చేయటం కాకుండా బహుపొదుపుగా వుండేవాడు. బజారులో కనపడ్డ పేడ పోగేసుకొచ్చేవాడు. చేలలో రాలిన తాటిమట్టలూ కొబ్బరిమట్టలూ ఏరి ఇంటికి తెచ్చేవాడు.... కొంతమంది కుర్రకారు అయనకు పెట్టిన ముద్దుపేరు "వర్కోహాలిక్".

ఒక పల్లెటూరి రైతు పనిని ఇంత వివరంగా వర్ణించటం ఈ రచయితకొక ప్రత్యేకతను ప్రసాదించింది. ఆల్కోహాలిక్‌లు మనకు నిత్యం ఎందరో కనిపిస్తారు కాని వర్కోహాలిక్‌లు చాల అరుదుగా మాత్రమే రామయ్యలాంటి వాళ్లు కనిపిస్తారు. ఈ రచయిత ఇటువంటి రామయ్యను సృష్టించటం నిజంగా ఒక ఘనకార్యమే!

సాహిత్యంలోకాని, మరో కళలోకాని వైవిధ్యం ఎంతగానో అవసరం. విషయంలో వైవిధ్యం, ప్రక్రియలో వైవిధ్యం మొదలైనవి వున్నపుడుకాని పాఠకుని మనస్సుకు విసుగు కలిగించకుండా వుండదు. అటువంటి వైవిధ్యం ఈ కథానికల్లో ఎంతైనా గోచరిస్తుంది. ప్రత్యేకించి విషయవైవిధ్యం ఇందులో ఎంతైనా వున్నది. ఈ పుస్తకంలో పంథొమ్మిది కథానికలున్నాయి. వీటిలోలేని విషయంలేదు.

నేనేమి చేసేది ? ఇంటికి వచ్చినవాళ్లకు భోజనం పెట్టకుండా వుండటం నాకు చేత కాదమ్మా'' అనేది.

సీతమ్మగారిలాంటి స్త్రీలను మంచివాళ్లనాలో, చెడ్డవాళ్ళనాలో తెలియటంలేదు. అటువంటి గృహిణులు నేటి సమాజంలోకూడ కోటికి ఒక్కరైనా లేకపోరు. అయితే ఇదే పరిస్థితి పురుషుల్లో భిన్నంగా వుంటుంది. సీతమ్మగారిలాంటి స్త్రీలు సమాజంలో కోటికి ఒకరుంటే అటువంటి పురుషులు అసలువుండరని అనలేంకాని ఏ పదికోట్లకో ఒకరుంటారు. ఎందుకో ఇంత పెద్ద తారతమ్యం ? స్త్రీల శరీరనిర్మాణంలో పురుషుల శరీర నిర్మాణంలో, స్త్రీల మానస వ్యవస్థలో పురుషుల మానసవ్యవస్థలో వున్న మౌలిక ప్రభేదాలే ఇటువంటి పెద్ద తారతమ్యానికి కారణం

ఇటువంటి విచిత్ర మనస్తత్వాలను కల్పనా సాహిత్యకారులు తమ రచనా శిల్పంలో మరీ ఎక్కువగా కాకుండా తగినంత పరిమితంగా ఉపయోగించుకొని చేసిన రచనలు ఆకర్షకంగా వుంటాయి. వాస్తవ జీవితంలోని వ్యక్తులకూ నవలల్లో, కథానికల్లో సృష్టించబడిన పాత్రలకూ ఆకర్షణలో వ్యత్యాసం వుంటుంది ప్రత్యేకంగా. వాస్తవజీవితంలోని వ్యక్తుల మనస్తత్వంలో విచిత్రవైఖరి వున్నాకూడ అది వారి ఇతర స్వభావాలతో మిళితమై వున్నందున అది వారి మిగతా స్వభావాలనుండి విడబడి వంటరిగా ప్రత్యేక రూపంలో ప్రత్యక్షమయే అవకాశం వుండదు. అందుకు భిన్నంగా కల్పనా సాహిత్యంలోని పాత్రలు తమ మిగతా స్వభావాలనుండి వేరుచేయబడి కేవలం వారిలోని వింత స్వభావాలతో మాత్రమే ప్రత్యక్షపరచ బడతాయి. అందువల్ల అవి ఎక్కువ రక్తి కడతాయి.

ఆధునిక కల్పనా సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలు ప్రవేశించినాయి. వాక్య నిర్మాణంలో నూతన రీతులు, సామాజిక వ్యవస్థలో నూతననీతులు వ్యాప్తిలో వున్నాయి. ప్రతి రచనలోను సామాజిక స్పృహ వుండాలనే నినాదం ఎటుచూచినా పెద్దగా వినిపిస్తుంది. సంప్రదాయాల సంకెళ్ళనుండి స్వేచ్ఛా, స్వతంత్రచింతనా మొదలైన వెన్నో నవ్యతలు నేటి జీవితంలోను సాహిత్యంలోకూడ విరివిగా కనిపిస్తున్నాయి. కాని మన రచయిత వీటికికూడ కట్టుబడినట్లు కనిపించక తన స్వీయ పంథలో ముక్కుకు సూటిగా పోయినట్లు తెలుస్తుంది; ఈ ముక్కుకు సూటిగా పోవటంలో ఒక విధమైన సరళత, సూక్ష్మ సౌకుమార్యం, స్థూల ప్రాబల్యం, ఒక నిరలంకార సౌష్టవం, ఒక మనోవైజ్ఞానిక అనుభూతి మొదలైనవి రూపొందు

తాయి. అందుకని ఈ ముక్కుకు సూటిగాపోయే మార్గం మాత్రమే ఉత్తమమైంది అని అనను. మిగతా అన్నివిధాల మార్గాల్లో ఇదికూడా ఒక మార్గం.

ఏ నిపుణ రచయిత రచించిన రచనలన్నీకూడ ఒకే నైపుణ్యం కలిగి వుండవు, ఒకరు కన్న సంతానమంతా సమాన మేధావులు కానట్లు ఒకొక విధానిత ఎక్కువ నైపుణ్యం కలిగి వుంటే మరొకటి తక్కువ నైపుణ్యం కలిగివుంటుంది. ఇంకొకటి ఎక్కువ తక్కువలకు మధ్యవున్న మాధ్యమిక నైపుణ్యం కలిగివుంటుంది.

ఈ రచయిత ఇవే మొదటి ప్రయత్నాలు కల్పనా సాహిత్యంలో అని పైన చెప్పుకొన్నాం. మొదటి రచనలకూ మొదటివికాని రచనలకూ నైపుణ్యంలో ఎంత ప్రభేదం ప్రత్యక్షమవుతుందో వేచి చూడాలి. మొదటివి కాని రచనలు రూపొందితేనే కాని మొదటి రచనల అసలురూపం అర్థంకాదు. అందుకే ఈ రచయిత కలంనుండి వెలువడే మొదటివి కాని రచనలందుకొనే నిరీక్షణలో నిలుద్దాం.

— సంజీవదేవ్

# ఓ మా ట

ఒకమాట. ఒక క్షణం ఆగండి. చదువబోతున్నది ఒకటి తక్కువ యిరువై కథల సంపుటి — రచయిత పేరు అవలోకిత అంటే—పెట్టుకున్న Pen name పేరు. ఆడో, మొగో తెలియదు. కథలు చదివితే కొన్ని ఆడవ్రాసినట్లు, మరికొన్ని మొగవ్రాసినట్లు కనబడుచున్నవి. కనుక ఆడవారి మనస్తత్వం తెలిసిన మొగ రచయితైనా అయివుండాలి లేక మగవారి తత్త్వం తెలిసిన స్త్రీ రచయిత్రయినా అయివుండాలి. ఎవరైతే నేమి అని అనుకుంటున్నారేమో. ప్రతిక్షణము ఆడ మొగ విభిన్న ప్రకృతులు పరిశీలించుటకు అలవాటైన Feminist mind యిదేముందు ఆలోచిస్తుంది. ఈ రోజుల్లో రచయిత్రి పేరు బెట్టుకొని వ్రాసే రచయితలు, రచయితల పేరు బెట్టుకొని వ్రాసే రచయిత్రులు ఎవరు ఎవరాని కనుగొనే Guessing Game లో వీరు చాలాకాలం ముసుగుక్రింద దాగుకొనలేరు. ఈ రచయిత రచయిత్రి ప్రత్యేకత యిందులోనేవున్నది. బయట పడకుండా చాలా కాలము ఈవ్యక్తి అజ్ఞాతవాసములో వుండుటకు అవకాశమున్నది. కారణం పురుషుల మనస్తత్వం ఎవరైనా యిట్టే కనుగొనగలరు. కాని స్త్రీ హృదయంలోని అఘాధమైన లోతుపాతులు బ్రహ్మదేవునికే తప్ప ఎవరికీ తరముగాదని విశ్వసించు నేను కొందరు స్త్రీ హృదయాన్ని కూడా అర్థముచేసుకోగల వ్యక్తులున్నారని ఈ కథలు చదివిన తరువాత తృప్తి పొందాను. ఆశ్చర్య పడకుపోలేదు కూడాను.

ముఖ్యంగా అన్ని కథలలోని సారాంశము వ్యక్తులు ఈ సంఘ జీవితములో ఏక్షణములో ఏపరిస్థితులలో ఎలా ప్రవర్తించగలరో వూహించుకొని వివరించుతూ కదానికల చిత్రరూపణ స్పష్టముగా ప్రదర్శించుటే. అంటే ఈ రచయితకు Psycho analyssis - మానసిక అవలోకన తన సహజ ప్రకృతిలో అలవాటున్నదన్నమాట. ప్రతివ్యక్తిని, ప్రతి సంఘటననీ యిలా పరీక్షించే వ్యక్తులు సాధారణంగా మానవ క్షేమ, సంక్షోభములు బాగా అర్థము చేసుకొనగలరు. యిది వృత్తి ధర్మము వలన గాని వంశపారం పర్యంగా సంక్రమించే genes గుణముల వలనగాని, అలవరచుకున్న దృక్పదము వలనగాని లభించును. ఈ రచయిత ఏకారణమునైతే నేమి ఈ విశేష జ్ఞానగుణ సముపార్జనతో రచించిన కథలన్నిటిలోను ప్రతిబింబింపచేస్తు వాటిని జీవకథలుగా సృష్టించగలిగారు.

నన్ను గురించే వ్రాశావుకదూ అని ఎవరైన రచయితపై దాడికివస్తే నేనాశ్చర్యపడను.

ఈ పందొనిమిది కథలలో నాకు బాగా నచ్చినకథ 'మమత' యిందులోని కథా వస్తువేగాక కథ చెప్పినతీరు ఎంతమనోజ్ఞముగానున్నది. ఎంతమందికో అతి దుఃఖములోకూడ కండ్ల వెంబడి నీరురావు. మరికొందరికి పంపు త్రిప్పినట్లు వరదలుగా వచ్చి పడతవి. యివి సాధారణంగా దివ్యాస్త్రముగా పనిచేస్తవి. కాని 'మమత' లోని కండ్లనీరు రానివ్యక్తే అందరి సానుభూతిని పొందేటట్లు రచయిత చక్కగా చిత్రించినారు. ఈ తరగతికి చెందిన వారి హృదయములు ఐస్ వంటివి. సుత్తితో కొట్టితే కాని పగలవు. కాని నిశబ్దంగా కరిగి జాలిగాంచగలరు. ఇటువంటి వ్యక్తులను రచయిత పాఠకులకు పరిచయము చేయుట చాల ప్రశంశనీయము.

"చిన్నప్పుడు నేను చేసిన మంచి అంతా ఈనాటికి నాకు కలసి వచ్చిందని మనస్సులో అనుకొన్నా" చేసుకున్న వారికి చేసుకున్నంత. స్వర్గనరకములు ఎక్కడో లేవు. యిక్కడే ఈ జీవితంలోనే మనం సృష్టించుకుంటాము.

## నాగస్వరం

ఆ తరువాత నాకు నచ్చినకథ 'మమత' ఎంత నచ్చిందో, ఎంత హృదయ స్పందన కలిగించిందో అంతే నాగస్వరము కలిగించింది. అది ఆరవ కథ, యిది పదమూడవ కథ అవటం వలన 'మమత' తర్వాతదిగా వ్రాయవలసివచ్చింది.

నిజంగా చూస్తే నాగస్వరములో కథ లేదు. అది ఒక Sketch మాత్రమే. ఏ క్షేత్రములోనైనా వూపిరాడకుండా శ్రమించేవ్యక్తి హఠాత్తుగా పనిలేకుండా వుండవలసివస్తే వాళ్ళకు ఏదో బలవత్తరమైన వ్యాధో. మరణమో తథ్యము. పెన్షను తీసుకున్న వుద్యోగులు సాధారణముగా నూటికి తొంబై మంది రిటైరు అయిన కొద్ది రోజులకే ప్రభుత్వము వారిని ఋణ విముక్తులను చేస్తారు. 55 సంవత్సరములకే రిటైరు అవవలసిన ఆచారము పూర్వము బ్రిటీష్ ప్రభుత్వము అప్పటి జీవిత పరిమాణాన్నిబట్టి నిర్ణయించింది. యిప్పుడు భారత దేశంలో జీవిత పరిమాణముబాగా పెరిగినది. యిప్పుడు ఈ దేశంలో 60 ఏళ్ళ వారి నెవరనీ వృద్ధులక్రింద పరిగణింపబడుటలేదు. ఏడెబ్బది ఏడోవచ్చిన తరువాతనే వృద్ధుల పట్టిలో చేరుతారు. ఆశ్చర్యం దేశములో అనేక రకములైన క్లబ్బులున్నవి గాని యిచ్చట వృద్ధులకు క్లబ్బులులేవు. 1982 వృద్ధుల Year of the aged సంవత్సరముగా uno ప్రకటించింది.

రాజకీయ వేత్తలు, సంఘసేవకులు, నట, నటీమణులు, రచయితలు, వివిధ కళాకారులు, డాక్టర్లు, Law arehitect, Engineer, consultants వగైరా వృత్తులలో నున్నవారు ఐచ్చికముగా రిటైరు కావచ్చు. ఒక గృహిణీతప్పమిగిలిన వారందరు బాగా ఆలోచించుకొని, సమయము నిర్ణయించుకొని, భవిష్యత్తు Plan చేసుకొని రిటైరు కావచ్చు. మనువు ధర్మమని స్త్రీ కూడా మూడవ ఆశ్రమము వాన ప్రస్తంలో రిటైరు కావచ్చునేమో. కాని ఎంతమంది అలా చేయగలరు!. ఏదో అదృశ్యశక్తి వారిని వారి స్థానములకు బంధించి వేస్తుంది. కళ్ళు కనబడని రాజకీయ వేత్తలు, అడుగువేసి అడుగుపెట్టలేని సంఘసేవకులు వయోవృద్ధులైనా గంతులేస్తూ శృంగార చేష్టలు అశహ్యంగా ప్రదర్శించే నటీ నటకులు, చెవులు వినబడిన డాక్టర్లు, Arthritisతో వంగలేని వాల లేని పెక్కు కళాకారులు, రచయితలు, కవులు కవయిత్రులు, కోడలు రాగానే చర్నాకోలు బట్టుకొని అధికారము చెలాయించే అత్తలు (మొన్నటిదాకా కృష్ణా రామా అనుకుంటామని బెదరించిన వారు సైతము) వారి వారి అధికార స్థానములనుండి పైనుంచి విమానము వచ్చేవరకు వారి స్థానములు వీడరు. సూదంటు రాయి యినుముకు అతుక్కుపోయినట్లు అతుక్కునే వుంటారు. కారణము ?

ధన సముపార్జనతీపి తీరకపోవుటా ? గతి లేకనా ? లేక
గాను గెద్దులవలే అలవాటైన పని మానలేకనో ?

మన మందరము మన పెద్దలవద్ద చిన్నపుడే ఒక రహస్యము నేర్చుకున్నా సమయము వచ్చినప్పుడు ఏశాపమువలననో మరచుదుము. యింకా తినాలి అని బుద్ధి వుండగనే తినటము మానవలయునని వుండమని యితరులు అడుగుతున్నప్పుడే అచ్చటనుండి నిష్క్రమించ వలయునని మనము నేర్చుకొన్నవి Golden rules. "మకుటంలేని మహారాజుగా ఏలిన రాజకీయవేత్త నారాయణరావుగారుకూడా సమయానికి రాజకీయములనుండి తప్పుకున్నారు. అందుకనే ఆయన సుఖపడ్డారు.

హాయిగా మనుమలతో చీట్లపేక ఆడుతూ కాలక్షేపం చేయగలిగారు. విరామ సమయములలో కాలక్షేపము చేయటం వుత్తమోత్తమైనదా కాదా అనే అంశము వేరే విషయము. కాని ఎంతమంది యిలా ఐచ్చికముగా రిటైరు కాగలరు. వారి వారి జీవిత విధానములలో Fullstop, cama లు లేకుండా జోరుగా ముందుకు సాగిపోతూ వుంటారు. ఎక్కడో వారు పల్టీకొట్టడం తథ్యము. Semicolan అయినా పెట్టి

భవిష్యత్తు ఆలోచించుకోవాలి. వీరిలో చాలా మందికి Hobbies అంటే ఏమిటో తెలియదు. village reconstruction చేస్తామనే వారు ప్రతి గ్రామములోనూ ఒక Hobby centre పెట్టటం చాలా అవసరము. Hobbies లేని వ్యక్తి జీవితము ఎప్పుడో ఒకప్పుడు భారమై ఆత్మ హత్యకు దారితీయటమో, లేక వేరే ఏదో మానసిక దౌర్బల్యములకు లొంగిపోవటమో జరుగుతుంది. అందుకనే బ్రిటిష్‌వారు ప్రతి Civil Servant రిటైరు అయేముందు — ఒక ఏడాదికిముందే ఆయనకు, ఆయన కుటుంబము సహితము తప్పనిసరిగా ఒక Training course తీసుకునే ఏర్పాట్లు యిండియాలో చేశారు. యిప్పటికీ బ్రిటనులో ఈ ఆనవాయితే వున్నది.

సమయానికి తప్పుకొనవలసిన అవసరము సూచించుతూ రచయిత ఈ నాగస్వరంలో సూచించటమే కాగుండా యింకో ముఖ్యమైన విషయముకూడా బహు చక్కగా Natural గా చిత్రీకరించారు. ఈ Sketch లో వాడిన వుపమానము సమయోచితముగానున్నది. పేరు చక్కగా యిమిడినది. బెల్లమునకు చేరు చీమలు, చెరువుకు చేరు కప్పల కన్న రాజకీయ వేత్తలు అధికారములో నుండగా చేరు వారు నాగుబాములంటి వారన్నది లోకవిదితమే. వారిని ఆశ్రయించిన వారు ముమ్మాటికి పాములవంటి వారేనని నేనుకూడా గట్టిగా చెప్పగలను. Exceptions ఎప్పుడూ వుండక తప్పదు.

"అధికారం అనేది నాగస్వరం దాని కాకర్షితులై నాగుపాములనేకము చుట్టూ చేరి పడగవిప్పి ఆడుతూ వుంటాయని అధికారాంతమందు నాగస్వరం మానేస్తే (మూతబెడితే—నాది) నాగులుకాటు వేయటానికి సిద్ధముగా వుండాయనుకున్నా'' రంటారు నారాయణరావుగారు. యిది ఒక చక్కని వుపమానము చక్కని చిత్రీకరణ యింతవరకూ ఏ Cartoonist కు తగలని అభిప్రాయమేమో ;

డబ్బు సంపాదించలేనివాడు, బ్రతక నేర్చనివాడు కర్మయోగియా లేక వైసివర్సా Vicc versa ? ఏమో రచయితకే తెలియాలి. ఏమైన రూపకల్పన చక్కగా నున్నది. యింకా అవలోకిత కలముతో సృష్టించబడే కర్మయోగులను చూచే భాగ్యము మనకు లేకపోలేదు.

## ఆఖరుమాట

రచయిత Public relations of Management ఏ కళాశాలలోను విద్య నభ్యసించిన వ్యక్తి కాకపోవచ్చు. కాని జీవితములో నేర్చుకున్న మహావిద్య — కథ నంబరు 11 Blotting paper లోను, కథనంబరు 10 పిట్టపోరులోను మరికొన్ని కథలలోని సంఘటనలలోను, రచయితకు క్షుణ్ణంగా Public relations అవగాహన చేసుకున్న వ్యక్తని విశదమవుతుంది. అది తన Profession లో బాగా సహాయ పడవచ్చు.

అవలోకిత కలము మరెన్నో కథలు, నవలలు, Realistic గా వ్రాసి పాఠకులకు మనోరంజకమగు రచనలను భవిష్యత్తులో అందించ గలరని ఆశిస్తున్నాను.

నా ఆశీస్సులతో

లక్ష్మి రఘురామ్.

30—9—81

# స మీ క్ష

శ్రీ బూరుగుల గోపాలకృష్ణమూర్తి
కవిశేఖర, భాషాప్రవీణ
సాహిత్య విద్యాప్రవీణ

"విశ్వశ్రేయః కావ్యమ్" అనికావ్య ప్రయోజనము నుద్ఘాటించినాఁడు చింతామణి కర్త — అనగా సంఘమును జాగృతముచేసి ప్రయోజనవంతముగా చేయునదే కావ్యమని భావము.

ఈ కాలపరిణతిలో రచనా వైవిధ్యము అంజసాచి అడుగులు వైచినది — నడచినది — పరువులెత్తినది — వీనిలోఁ గొన్ని నేలవిడిచిన సాములు — కొన్ని నేలమీఁది సాములు — రచన యేరూపమైనను విశ్వశ్రేయ స్సాధకమైనది, ఆదరణీయము సంభావనీయముకూడ.

మన ప్రాచీన కథాసాహిత్యము రూపాంతరములెత్తి నేడు కథానికా రూపముతోఁ బ్రవహించుచున్నది. అట్టి ప్రవాహములో రూపులు సంతరించుకొన్న రసతరంగములే ఈ "వర్కో-హాలిక్" కథానికలు. అవలోకిత ఈ రచయిత నామాంతరము.

అవలోకిత లేఖినీ సాహితీ క్షేత్రములో పండిన తొలిపంట ఈ "వర్కో-హాలిక్" కథానికల సంకలనం. ఈ క్షేత్రము సహజముగా పాటినేల దానికి తగినట్లు యెరువు పడినది, ఇక పంట మంచిదికాక ఎట్లుండును.

ఈ "వర్కో-హాలిక్" రచయిత తన రచనలలో నెక్కడను జాతి మత కులములకు సంబంధించిన పాత్రల సృష్టింపలేదు. పాత్రలకు పేర్లను పెట్టలేదు. శుష్కవాదములకెక్కడను తావీయలేదు. ఆయాకథానికలలో సృష్టించిన పాత్రలు సజీవములు పెట్టినపేర్లు విచిత్రములు, చమత్కార జనకములు.

"అవలోకిత" పరిశీలనాత్మక దృష్టికలవాడు. తాను వర్ణింప దలచుకొన్న సన్నివేశములను ఆమూలాగ్రము కుంచెతో చిత్రించినట్లు వర్ణింప గలడు.

రచనకు వ్యంగ్యమే జీవనము. మహాకవులు తమ కావ్యములలో వ్యంగ్యమునకు పట్టము కట్టినారు. కావ్యానుభవము గల ఈ రచయితకూడ ఆమర్యాదను పాటించినాడు.

పిన్ని "కథానికలో" ఒకచోట "కారణం లేకుండ పనిమనిషిని మాన్పించావేమి అని మా వారన్నపుడు నాగుండె ఝల్లు మన్నది. కొంపదీసి ఏదైనా గ్రంథం జరుగ లేదు గదా" ఈ వాక్యములో ఆమెకు భర్త పైగల అనుమానము వ్యంగ్య మర్యాదా ధీనము - ఇట్టివి వీరచనలో పెక్కులు.

ఈ రచయిత ఉపమానములు నవీన ప్రాచీన భావ బంధురములు నిరీక్షణలో.

ఆమె నడుస్తూంటే నాగుబాము భారంగా కదలుతున్నట్లుంటుంది.

ఆమె నీలిరంగు కనుపాపలు అగాధ సముద్రాలను గుర్తుకు తెస్తున్నాయి.

ఆమె కనుబొమ్మలు ఎక్కుపెట్టిన మదనుని ధనుస్సుల్లా వున్నాయి.

ఆమె పెదవులు దొండపండ్లలా వున్నాయి.

వీనిలో మొదటి రెండు నవీనములు, చివరి రెండు ప్రాచీనములు.

ఈ కథానికా గుచ్ఛములో వివిధ వర్ణముల పుష్పములు వికసించి నానావిధ పరిమళములను గుబాళింప జేయుచున్నవి.

ఈ రచయిత నాకు చిరపరిచితుడు. నాదగ్గర కొన్ని ఆంధ్ర కావ్యములను చదివినాడు. సంవత్సరముల తరబడి చేసిన విద్యా వ్యాసంగము పండి యొక్కసారిగ వెల్లుబికినదాయను నట్లున్నది. ఈ రచన ప్రథమ ప్రయత్నములోనే యింతటి సుసం ఘటిత కథాసృష్టి చేసిన ఈ రచయితకు మంచి భవిష్యత్తు కలదు.

# మేలి పల్కు

చిరంజీవి అవలోకిత కథానికలకు సమకాలిక సమాజ మనుభవించుచున్న కష్టసుఖములగాథలే వస్తువులగుటచే ఇవి పాఠకులను లెస్సగా నలరింపఁగలవు.

ఈ రచన వ్యావహారిక భాషలో సాగుటచే ఇందు తెల్లునోరు చెక్కు-చెదరని రీతిలో కుదురుకున్నది.

అవలోకిత సాహితీకృషి నిరంతరమై సర్వ సౌందర్య సంపన్నమై మిక్కిల్లుఁగాక !

తుమ్మల సీతారామమూర్తి

22-9-1981

AVULA SAMBASIVA RAO
VICE-CHANCELLOR

ANDHRA UNIVERSITY
WALTAIR
VISAKHAPATNAM 530 003 (A.P.)
Dt. 1-10-81

# అవలోకనం

'వర్కోహాలిక్' రచయిత అవలోకిత. అది ఆయన అసలు పేరుకాదు, కలం పేరు. దీన్ని ఎందుకు ఎన్నుకున్నారా అని ఆలోచించాను. అవలోకితేశ్వరుడు ఆయన గారికి ఇష్టమేమో అనుకున్నాను. కానీ ఇందులోని కథల నన్నిటినీ చదివాక తెలిసింది అది సార్థకనామమనీ, రచయితకు అవలోకనం చెయ్యటం ఇష్టమనీను.

ఈ కథాకదంబంలో నాకు అన్నిటికంటె మిన్నగా అగుపించింది జీవిత పరిశీలన, మానవనైజ ఆవిష్కరణ. ఈ కదంబంలో, కుసుమాల్లాంటి జీవిత సన్నివేశాలు ఎన్నోవున్నాయి. ఆ కుసుమాలు మొగ్గలుగావున్నవి, వికసించినవి, పరిమళిస్తున్నవి. ఎండిపోయినవి, వాడిపోయినవి — అన్నిరకాలవీవున్నాయి. జీవితమే అటువంటిది గనక అన్నిరకాల అనుభూతులను రచయిత అవలోకించాడు. వాటిని గురించి ఆలోచించాడు. మనల్ని ఆలోచింపజేస్తున్నాడు.

జీవితానికి అద్దంపట్టడం వాస్తవిక రచన. ఉన్నది ఉన్నట్లు రాయడం ఒకరీతి. కాని ఉన్నదాన్ని, నిజాన్ని బయలుపరుస్తూ, అందులోనుంచి ఒక అనుభూతిని, ఒక ఆలోచనను, రేకెత్తించడం సృజనాత్మకమైన రచన. చూడ్డం చాలా మంది చూస్తారు. చూచినదాంట్లోనుంచి జీవితానుభవాన్ని, మనుషుల్లోని బహుముఖమైన స్పందనలన్నీ పరికించడం, వాటిని రచనలో పదిలపరచడం ఒకప్రజ్ఞ. ఆప్రజ్ఞ ఈ రచయితకు నిండుగావుంది.

ఈ కథల్లోని సన్నివేశాలు ఊహించినవి కావచ్చు. మక్కికి మక్కీ యథార్థ గాధలు కాకపోవచ్చు. కాని వీటన్నిటిలోను వాస్తవికతవుంది. సమాజంలో రోజూ కనిపించే దృశ్యాలే మనకి వీటిలో అగుపిస్తాయి. అయితే ప్రతి కథలోను ఒక కొత్తదనం ఉన్నది. వర్ణించబడిన సంఘటన వెనకవున్న, దానికి సంబంధించిన మానవ ప్రవృత్తి వివరించబడ్డది. అందుచేత కథనంలో నిండుతనం వచ్చింది.

ఎన్నిరకాల మనుషులు కనిపిస్తారు మనకు ఈ కథల్లో! కొంతమంది మంచి, కొంతమంది చెడు అనికాదు. రచయిత భావం. అట్టి విభజనలోకి ఆయనగారు వెళ్ళలేదు. అటువంటి వర్గీకరణ కూడా అసహజం. అవన్నీ నాటకీయతకోసం చేసే పనులు. అయితే ఒకమనిషి మరోమనిషిలాగా ఉండడు. ఎవరివ్యక్తిత్వం వారిది.

ప్రతి వ్యక్తిలోను ఒక విశిష్టత ఉంటుంది. అది ఒక సంగతి. మరొకటి, ఒకే మనిషి వేరు వేరు అనుభవాల్లో ఒకేరీతిగా ప్రవర్తిస్తాడని అనలేము. ఏమనిషీ రబ్బరుస్టాంపు నడవడిక కాదు. మార్పు ప్రకృతిలోవున్న ప్రబలమైన స్వభావం. అటువంటి మార్పు మనిషి దృక్పథంలోను, ప్రవర్తనలోను ఉండదని అనుకోవడం అసంగతం. ఒక్కో అనుభూతికి ఒకో పద్ధతిలో వ్యక్తిలో స్పందన, కంపనం కలుగుతుంది. అందుకనే అన్ని పరిశోధనలకన్నా, మానవుణ్ణి తెలుసుకోవడం క్లిష్టమైన పనిగా మన శాస్త్రజ్ఞులు అనుకొంటున్నారు. "అవలోకిత" మనిషిలోని ఈ భిన్నత్వాన్ని, వైవిధ్యాన్ని చూపించడానికి ప్రయత్నించాడు ఈ కథల్లో. కృతకృత్యుడైనాడు.

ఇందులో ఇంకో ముఖ్యమైన సంగతి మరొకటివుంది. అనుభవం అనుభూతి సన్నివేశాన్ని చూచేవారి పరిశీలనా శక్తిమీద సంస్కారంమీద ఆధారపడి వుంటుంది. రంగు కలిగిన అద్దాలజోడుతో చూస్తే, అంతా ఆరంగులోనే కనిపిస్తుంది. చూచేవారి దృష్టి, తీరు ఏవిధంగావుంటే, చూచిన సన్నివేశంలోనుండి, పొందే అనుభవం కూడా అలాగే వుంటుంది. ఎంత విషయ ప్రధానంగా (objective) గమనించినా, చూచినవారి సంస్కారం ప్రబలమైన ప్రభావంతో పనిచేస్తుంది. ఈ రచయిత మంచి సంస్కారవంతుడై వుండాలి. తాను మనకు చూపెట్టిన కథనం పద్ధతి చూస్తే మనుషుల్ని సన్నిహితంగా, ఆప్తుడుగా చూడగలడు అవలోకిత. మనిషి అంటే ఆయనగారిలోవున్న ఆప్యాయత ప్రతిగాథలోను కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది.

శైలి, అంటేభాష, వాక్యనిర్మాణం—ప్రయోగాత్మకంగా వున్నాయి. చదివేవారి హృదయానికి హత్తుకుపోవాలి అనే ప్రయత్నం స్పష్టంగా అగుపిస్తోంది. రచనలో ఆశైలి, నాకుబాగా నచ్చింది.

అన్నిటికీమించి సమాజాన్ని, మనిషిని, అవగాహనచేసుకోవాలి, తన అవగాహన్ని అందరికీ తెలియజెప్పాలి అనే రచయిత ఆరాటం ప్రతికథలోనూ వుంది. అవలోకితకు రచనావస్తువు - మనిషి మనిషిని ఈ రీతిగా మన్నించినన్నాళ్ళూ, గుర్తించినంతకాలం, వారి రచన బహుజనుల ఆదరాభిమానాలు పొందుతూనే వుంటుంది.

ఆవుల సాంబశివరావు

# గులాబి ముళ్ళు

భోంచేసి అరుగుమీద పడుకొని చుట్ట ముట్టించాను. తెల్లవారి లేచి మాగాణి వద్దకు వెళ్ళి పాలేర్లను పురమాయించి దగ్గరుండి నారు మడికి నీరు పెట్టించాను. మాడిపోతున్న నారు కొంచెం జీవంపోసుకుంది. ముదురు నారుపోసి ముందు నాటినందువల్ల ఎన్నో లాభాలు !

బలం పెట్టనక్కర్లేదు.
తెగుళ్ళు తక్కువ.
రెండో పంటకు టైము సరిపోతుంది.
నాటుకు ఇతర పనులకు కూలి తక్కువ.

అందుకే ఇంజనుతో తడిపి విత్తులు చల్లాను. దగ్గర లేకపోతే సరిగా నీరందక నారు ఎక్కరాదు.

చస్తూ బతుకుతా నీరు పెట్టించి వచ్చానా మళ్ళా ఇప్పుడే పరిగెత్తుకుపోవాలి.

అరటి గెలలు నరకుతున్నారు. అక్కడ అదేమెట్ట చేనుదగ్గరకు వెళ్ళాలి.

వెళ్ళకపోతే ఎవడికందింది వాడు దోచేస్తాడు.

నాపని దుక్కిటెద్దులా వుంది. ఒకే విధంగా ఏకబిగిన హైరానా పడటం మాత్రమే నాకు మిగిలిన మెప్పు మెహర్బాని.

నిజంగా నేను ఎవరూ లేని ఒంటరిగాడ్నా !

కాదు. అందరూ వున్నారు.

తల్లి, తండ్రి, అన్నా దమ్ములు, బిడ్డలు అక్క చెల్లెళ్ళు అందరూవున్నారు.

మరి నేనొక్కడ్నే ఎందుకు తాపత్రయపడాలి.

అది నాజన్మ విశేషం !

నాన్న నిన్న మొన్నటివరకు పొలం వచ్చేవాడే ! తుంటి ఎముక విరిగి మంచం ఎక్కాడు.

అన్నయ్య వున్నాడంటే మొదటినుండి అర్భకుడు. ఆయన పొలం వచ్చి పనులు చేయించేకంటే రాకుండావుంటేనే లాభం ! ఒకవేళ వచ్చి పనిచేసినా చేయించినా పనికుదరదూ, కలసిరాదు.

సరే తమ్ముడున్నాడు. తెలివిగలవాడే. వాడిని తనే ప్రోద్బలం చేసి చదువుకు పంపాడు చదువులో దిగినదగ్గరనుండి వాడు పనిముట్టు కోటంలేదు.

తోబుట్టువులంతా తన వంకచూస్తారు. హెచ్చు తగ్గులన్నీ తను సవరించి రావలసిందే !

ఎవరికే కష్టం వచ్చినా తనువెళ్ళి అక్కడ తీర్చిరావాలి.

ఇక పిల్లలున్నారు. పసిగుడ్లు ఇంకా పూర్తిగా కండ్లు తెరచిన వాళ్ళు కాదు. ఇంతమంది పెద్దవాళ్ళు ఏమీసాయము చేయనప్పుడు వాళ్ళు ఏమిచేయ గలరు !

ఇవాళెందుకో తగని విసుగుగావుంది. ఇంతహైరానాపడి తనే పరిగెత్తుకువెళ్ళాలా అరటితోట వద్దకు.

అన్న పొద్దుట్నించి సాయంత్రం వరకు పేకాట ఆడుతూ కూరోచ్చకపోతే వెళ్ళి తోటదగ్గరుండకూడదా !

ఒక్కమారుగా కోపం పెల్లుబికింది అన్నమీద.

వరండాలో పేకాట ఆడుతున్న అన్నతో చెప్పాడు అరటితోట వద్దకు వెళ్ళమని.

'వెళ్తాను లేరా' అన్నాడు అన్న.

ఇంతలో పాలేరు పరుగెత్తుకువచ్చాడు. మాళీ గేదె ఈనలేక కష్టపడుతుందని.

వ్యవసాయం రైతుల పాలిటికి ఒక ప్రశ్నార్థకంలా తయారయిన దగ్గరనుండి ప్రతి యింట్లోను ఇంకా అన్నం తింటున్నారంటే పాడిగేదెల వల్లే కదా !

మాళీ గేదె రెండు మూడు వేలు ఖరీదు చేస్తుంది. పూటకు నాలుగైదు శేర్లు పాలుయిస్తుంది. ఇంటిల్లిపాదీ తాగగా మిగిలిన పాలు అమ్మితేనే పైఖర్చు సగం జరిగిపోతుంది !

ఇప్పుడు పక్కటవున్లోని పశువుల డాక్టరుని అర్జంటుగా పిలుచుకు రావాలి. గేదె కేమైనా అయితే అంతా నష్టమే ?

గదిలో కూర్చొని పుస్తకం చదువుతున్న తమ్ముడ్ని కేకేసి "ఒరేయి వెంటనే టవునికి వెళ్ళి అర్జంటుగా పశువుల డాక్టరుగార్ని టాక్సీలో తీసుకురా" అన్నాను.

గేదెను జాగ్రత్తగా చూడమని అమ్మతోనూ పాలేరుతోనూ చెప్పి సపోటా తోటవద్దకు బయల్దేరాను.

సపోటాతోట తనకంటి వెలుగు ! ఇంకా కొద్ది సంవత్సరాలు కాపాడితే కష్టం తీరినట్లే. ఏమీ కష్టపడకుండా సంసారం దొర్లుకు పొయ్యేంత ఆదాయం వస్తుంది తోటపెరిగితే. కాని పెంచేటప్పుడే చిక్కులూ, బాధలూ !

పశువులు తినకుండా కాపాడాలి. నీళ్ళు పెట్టించుతూ వుండాలి. ఎరువూ వెంపలీ వేస్తుండాలి. కంటికి రెప్పలా కాపాడాలి. అప్పుడే రెండు మూడేళ్ళయింది. ఇంకా నాలుగేళ్ళోపికపడ్తే తన కష్టాలు ఈడేరినట్లే ! పిల్లలు కాలేజీలో చదివినా తను యిప్పట్లా డబ్బుకు వెతుక్కోనవసరంలేదు. పక్కవీధి కామయ్య నాలుగెకరాల సపోటా తోట చూచుకొనేకదా విర్రవీగుతున్నాడు. తోట కౌలుకిచ్చాడు, ఇస్త్రీమడత తప్పకట్టడు ! చుట్టమానేసి సిగరెట్ కాలుస్తున్నాడు ! ఊళ్ళోపేకాట మానేసి టవునులో క్లబ్బుకు వెడుతున్నాడు.

కాని అంత మిడిసిపాటు పనికిరాదు. షావుకారు రంగయ్యే ఇలాంటి పోకడపోయి ఆరిపోయాడు.

తాను ఇంతకీ సపోటాతోటను ప్రాణంగా చూసుకొంటున్నాడు. ఇవాళ ఎరువు చిమ్మించాలి. పెంటపోగు చెట్టు మొదళ్ళకు కొ

దూరంలో వేయించాలి. దగ్గరలేకపోతే పొరపాటున చెట్టు వేళ్ళదగ్గర వేశారో చెట్టు దెబ్బతింటుంది. అందుకనే తను బయల్దేరింది.

అనుకున్నంతా అయింది. కొత్తగా పనిలోకి వచ్చినవాడు ఎరువు మొదళ్ళలో వేస్తున్నాడు. వాడిచేత మళ్ళీ సరిగా వేయించి తోటంతా తిరిగిచూసి ఇంటికి బయల్దేరాను. కంచె సరిగా లేక మేకలు జొరపడు తున్నాయి దక్షిణపువేపునుండి. కంచె బందోబస్తు సరిచేశాను మేకలను తోలాక.

ఏమిటో ఇవ్వాళ తగని విసుగుగావుంది. ఒంటరిగా నేనెందుకు ఇంత హైరానాపడి తాపత్రయపడాలి ? ఎవరకూ పట్టనిదుగ్ధనాకేల ?

అసలు ఆలోచించిచూస్తే ప్రతి కుటుంబంలోనూ ఎవరో ఒకరు గాడిద చాకిరి చేయటానికి ఏర్పడివుంటారు.

మా కుటుంబంలో మొన్నటిదాకా మాతాతయ్య తల్లి సుబ్బమ్మ గారు చక్రం తిప్పేది. దాదాపు వంద సంవత్సరాలు బ్రతికిన ఆమె చని పోయే రోజువరకు బరువు బాధ్యతలు మోసింది. అసలు యీ రోజు నోట్లోకి అయిదు వేళ్ళు పోనిస్తున్నామంటే ఆమె చలవే.

నిజానికి ఆమె మా తాతను కన్నతల్లి కాదు. ఆమెకు పిల్లలు లేరు. ఆకాలంలో ఆచారప్రకారం మరది కొడుకైన మా తాతను దత్తుతీసి కొంది. ఆమె పుట్టింటినుండి తెచ్చిన రెండువేల రూపాయలూ చౌక రోజులలో పెద్ద ఆస్థిని సంపాదించిపెట్టాయి.

కాని ఒకటి మాత్రం నిజం ! ఏకన్న తల్లికూడా తన బిడ్డను అంత ప్రేమగాచూచి వుండలేదేమో ! మా తాతను అంత అల్లారు ముద్దుగా పెంచింది. మా తాత నడివయస్సులో నంజువ్యాధితో పోయే వరకు తానుతీసిన వెన్నపూస కలపి అన్నం ముద్దలుచేసి చేతిలో పెట్టేది మా తాత ఏదైనా పనివుండి వూరెళ్ళితే ఏరాత్రప్పుడు వస్తాడోనని జాగారంచేసేది. బిడ్డ ఎక్కడ శ్రమపడతాడోనని తాను ముందుగలేచి ఇల్లూ, వాకిలీ, గొడ్డు గోదా సవరించుకొని తెల్లారేసరికి పొలం వెళ్ళి పోయేది.

ఎక్కడకు వెళ్ళినా భోజనం వేళకు ఇంటికివచ్చి తన చేతులతో కొడుకుకు అన్నం తినిపిస్తే కాని ఆమె మనసుకు తృప్తి వుండేదికాదు.

కోడలు వచ్చినా కోడలుకు కోడలు వచ్చినా ఆమె దినచర్యలో మార్పేమిరాలేదు. అందరూ ఆమెమాట వినేవారు. ఇంట్లో చీమ చిటుక్కుమన్నా పట్టించుకొనేది.

కొడుకు నడివయసులో పోయిన తర్వాత బాగా పాతిక ముప్పై సంవత్సరాలు బతికింది. బతికినన్నాళ్ళు కొడుకును తలచుకొని కన్నీళ్ళు పెట్టేది. ఆమె దినచర్యలో మాత్రం ఏమీ మార్పురాలేదు. దిగులును దిగమింగుకుని ఇల్లూ వాకిలీ, పొలం పుట్రా అన్నీ వెనకటివలెనే సమర్థించుకొని రాసాగింది.

దాదాపు కాడి నానెత్తిన పడేవరకు ఆమె జీవించేవుంది. "నా వరాల తండ్రివి, నా యింటి దీపానివి" అనేది నన్ను.

అక్కడనుంచి నేటివరకూ బరవూ బాధ్యతా మోస్తున్నాను. ఒక్కొక్కప్పుడు విసుగుపుడుతుంది, ఎంతకాలం ఇలాగా అని. కాని తాతమ్మ గుర్తుకు వస్తేమాత్రం వెంటనే మనసు నిశ్చలమయి పోతుంది. ఎవరో రక్తసంబంధం లేనివాడ్ని తీసికొనివచ్చి, పెంచి పెద్దవాణ్ణిచేసి వాణ్ణి వాడి సంతానాన్ని, మనమల్ని, మునిమనమల్ని అంత ఓర్పుగా చూచిన ఆమె నిజంగా మా ఇంటిదేవత.

ఇంటిదారి పట్టాను. ఎదురుగా మా తమ్ముడు సైకిల్ మీద వస్తూనన్ను చూసిదిగి

"నీకోసమే వస్తున్నానన్నయ్యా! పట్నంలో పశువుల డాక్టరు గారు దొరకలేదు" అంటూ నీళ్ళు నమలసాగాడు.

నేనైతే ఎలాగోలాగా డాక్టరు గారెక్కడవున్నా వెతకి పట్టుకు వచ్చేవాడ్ని. వాడిని పంపటంవలన కాలయాపన తప్ప పనేంజరగలేదు.

కోపంతో మండిపోతుంది మనసు. కాని సమయం కాదని వివేకం హెచ్చరించటంతో తమాయించుకొని "పోయి చప్పున రాఘవయ్యను కేకేసుకురా" అన్నాను.

రాఘువయ్యది నాటు వైద్యం. అనుభవ పూర్వకంగా నేర్చుకొన్నది. ఒకోసారి ఇంగ్లీషు వైద్యంకూడా కుదరనప్పుడు రాఘువయ్య చేతి చలవన పశువు బాగుపడటం కూడావుంది ? ఏదో వొకటి చేయకుండా వదిలేయటం ఎలాగా ?

ఇంకొంచెం దూరం వెళ్ళగానే పడమటివైపున సాంబయ్య కొట్టు దగ్గర తచ్చాడుతూ నన్ను చూడగానే గబుక్కున పరిగెత్తేడు వీరయ్య. ఎదురుగా సాంబయ్య షాపులో పెద్ద అమృతపాణి గెలలు రెండు నన్ను వెక్కిరిస్తూ కనబడ్డాయి. మావూరిలో అమృతపాణి వేసింది నేనే ! అంటే అవిమావే నన్నమాట. కోపం పట్టలేకుండావున్న నన్నుచూసి సాంబయ్య ముందు బిత్తరపోయాడు. తర్వాత తెప్పరిల్లుకొని "వీరయ్య గెలలుతెస్తే నేను మందలిస్తున్నాను తప్పురా అలా తేకూడదు అంటూ. మీ యింటికి పంపిస్తాలెండి మామనిషిచేత" అంటూ నసుగుకొట్టాడు.

అయితే మా అన్నయ్య అరటితోట వద్దకు వెళ్ళలేదన్నమాట ! ఇంకా పేక ముక్కలు కలుపుతూనే వున్నాడు కాబోలు !

అసలే చిరాకుగావున్న నా మనసు తాటాకుమంటలా భగ భగమన సాగింది.

ఆరోజే నాన్నతో గట్టిగా మాట్లాడి భాగాలు పంచుకుందాం అని నిర్ణయానికి వచ్చాను. ఏమాత్రం బాధ్యత పట్టించుకోని వారి కోసం నేనెందుకు తాపత్రయపడాలి ?

ఇంటి వాకిట్లో అడుగుపెట్టాను. ఎదురుగా అన్నయ్య కొడుకు రవి పరిగెత్తుకుంటూ వచ్చాడు. "నాన్నా గేదె యీనింది పెయ్య దూడ" అంటూ. వాడు ఎప్పుడూ నన్ను 'నాన్నా' అనే పిలుస్తాడు.

తాటాకు మంటమీద నీళ్ళు చల్లినట్లయింది. సంతోషంతో సావిట్లోకి పరిగెత్తబోయి గులాబీచెట్టును చూడలేదు. వళ్ళంతా చీరుకుపోయింది గులాబి ముళ్ళతో !

చేతిలోవున్న కొడవలితో గులాబిచెట్టును నరుకబోయాను. వెక్కిరిస్తున్నట్టు చక్కగా విచ్చిన గులాబిపువ్వు చూచి నవ్వినట్లనిపించింది.

పక్కనే నిలబడ్డ రవి నావంట్లో దిగబడ్డ ముళ్ళను తన చిన్న చేతులతో తీయటానికి ప్రయత్నిస్తున్నాడు. మగ సంతానంలేని నాకు తల కొరివిపెట్టె వంశాంకురం వాడే అనిపించింది. చిన్నవయసులోనే వాడు అన్ని విషయాలు పట్టించుకోటంచూసి నాబాధ్యతలను ఎప్పటికైనా మోసేదివాడేనని పించింది.

భాగాలు పంచమని అడుగుదామన్న మాట మర్చిపోయి రవిని ఎత్తుకుని గాఢంగా గుండెలకు హత్తుకున్నాను.

హాలులో ఫోటోలోంచి తాతమ్మకూడ తన చల్లటిచూపులు ప్రసరింపచేసి నన్ను దీవించినట్లనిపించింది.

గులాబి పువ్వులాటి రవి కోసం యీ గులాబి ముళ్ళను భరించవలసిందే !

---



# పరిమళ

అందం, ఆకర్షణ సమపాళ్ళలో కలిగివున్న పరిమళ, ఆకర్షణ ఎరుగని అందం మాత్రమే కల సుగుణ మా క్లాసులో విడదీయరాని జంట. పైపెచ్చు వాళ్ళిద్దరూ కజిన్సు. చిన్నప్పటినుండి ఇద్దరూ తాత వెంకటరత్నంగారి దగ్గరే పెరిగారు. వెంకటరత్నంగారు గుంటూరులో పేరుపొందిన లాయరు. ఆయన సీనియర్ లాయర్సు జాబితాలో చేరి నాలుగు దశాబ్దాలు దాటుతున్నా ఇప్పటికీ ఆయన ఆఫీసు పార్టీలతో కిట కిట లాడుతూనే వుంటుంది. అందువల్లే దాదాపు రాష్ట్రంలోవున్న అన్ని పట్టణాలలోనూ మేడలూ, చాలా వూర్లలో పొలాలు, అనేక బ్యాంకులలో డిపాజిట్‌లువున్నా క్షణం ఇంట్లో గడపటానికి వెసులు బాటులేకుండా ప్రాక్టీసులో మునిగి తేలుతుండే వాడు. సుగుణ, వెంకట రత్నంగారి కొడుకు బిడ్డ అయితే పరిమళ ఆయన చెల్లి మనుమరాలు చెల్లెలు సీతమ్మ భర్త చిన్నప్పుడే పోవటం, అల్లుడు ఆస్తిని మాయం చేసి దేశాంతరాలకు వెళ్ళటంతో ఒక్కగా నొక్క మనుమరాలు పరిమళను చదువుకోసమై అన్న వెంకటరత్నంగారి ఇంట్లో వుంచాల్సి వచ్చింది. పరిమళ భరితమైన పుష్పం త్వరగా ఆకర్షించినట్లూ పరిమళ చూసేవాళ్ళను ఇట్టే Impress చేసేది. పైగా ఎదుటవారి మనసులో ఏముందో కనిపెట్టగల పరేంగిత జ్ఞానం ఆమెకు స్వభావ సిద్ధంగా వచ్చింది. నొప్పింపక తానొవ్వక అందరను మెప్పించి తలలో నాలుకలా మసలుకొనేది వెంకటరత్నంగారి ఇంట్లో.

నిజానికి పరీక్షగా చూసిన వారికి సుగుణకంటే పరిమళ అందమైనది కాదని తెలిసిపోతుంది. కాని చలాకీతనం, కలుపుగోలు తనం, ఎదుటవారిని ముగ్ధులనుచేసే మాటకారి తనం పరిమళకు సహజమైన ఆకర్షణలు. సుగుణ నెమ్మదిగావుండే సరస్సు అయితే పరమళ వురవళ్ళు పరవళ్ళు తొక్కి ఎగిసిపడుతుండే జలపాతం వంటిది. చిన్నప్పటినుండీ కలసి వుండటం వలన వారిది విడదీయరాని అనుబంధం. ఇద్దరూ నా బెస్టుఫ్రెండ్సు.

వెంకటరత్నంగారి ఇంట్లో ఆయన భార్య కొడుకు, కోడలూ, నౌకర్లూ చాకర్లూ పార్టీలు అందరూకూడా ప్రతిదానికి పరిమళను సంప్రదించటం సలహాతీసికోటం పరిపాటి అయింది. ఎవరికి వెంకటరత్నంగారి వద్ద ఏమి మెహార్బానీ కావాలన్నా పరిమళ సిఫార్సు కావాల్సిందే, సుగుణకు పాకెట్ మనీ కావాలన్నా పరిమళ తాతను అడిగి తెచ్చి యివ్వాల్సిందే. ఇంట్లో అందరకూ అంత తలలో నాలుకగావుండీ పరిమళ కాలేజీలో ఒక Livewire లావుండేది. అన్ని ఫంక్షన్సులోనూ ఆమె వుండితీరాలి. ఆమె ఆడని ఆటలు లేవు. వేయని నాటకంలేదు. పాల్గొనని డిబేటూ లేవు క్విజ్ లూలేవు. పరిమళవంతమైన పుష్పంచుట్టూ తుమ్మెదలు చేరినట్లూ బాయ్ ఫ్రెండ్స్ ఆమె చుట్టూ మూగేవారు. అన్నిటా ఆమెకు ఫస్టుప్రయిజులు వచ్చినా ఎవరికీ ఆమెఅంటే అసూయ కల్గేదికాదు. ఎంతమంది కుర్రవాళ్ళతో కలిసి తిరిగినా ఆమెకు ఎవరూ అసభ్యత అంటగట్టలేక పోయేవారు. లెక్చరర్సుకు పెట్, గర్ల్ స్టూడెంట్సుకు Inspirat on, బాయ్ స్టూడెంట్సుకు Happy companion అయిన ఆమె ఖర్మం చాలక ఒక గంట కాలేజీకి రాకపోతే కాలేజీ మూసివేసి ఆమెవద్దకు పరిగెత్తి పోవాలనిపించేది అందరకూ !

వెంకటరత్నంగారి చిన్ననాటి స్నేహితుడు చంద్రశేఖరంగారి మనుమడు రవికాంత్ కూడా సుగుణ, పరిమళల క్లాస్ మేట్. అన్నీ బాగుంటే సుగుణ వివాహం రవితో చేయాలని అంతా నిశ్చయించుకొన్నారు. అందుకనే చంద్రశేఖరంగారు వద్దన్నా వినకుండా వెంకటరత్నంగారు రవిని తమ యింట్లోనే అట్టిపెట్టుకున్నారు.

సుగుణ, పరిమళ వరుసకు అక్క, చెల్లెళ్ళు. సుగుణ పరిమళకంటే పెద్దదైనా ఆమెను 'అక్కా' అనేది.

"అక్కా రవిగారు కాఫీ తాగలేదు" అనో

"అక్కా రవిగారు ఇంకా ఇంటికి రాలేదేమి" అనో

"అక్కా రవిగారికి క్రీమ్ కలరు చొక్కా బాగుంది" అనో

"అక్కా- రవిగారు టెన్నిస్ ఛాంపియన్ కావాలి" అనో ఎప్పుడూ పరిమళ వద్ద సొద పెట్టుకొనేది.

ఇంట్లో వాళ్ళు ఎంత ప్రయత్నించినా, పరిమళ ఎంత ప్రోత్సహించినా, రవి ఎంత ఉత్సాహం చూపినా సుగుణ రవితో చనువుగా మెసలలేక పోయేది.

ఎదురుగా సంపెంగ పువ్వువుంటే కాగితం పూవు చూడటానికి ఎంత అందంగావున్నా దగ్గరకు వెళ్ళబుద్ధికాదు. అలాగే రవికి పరిమళతో చనువు ఎక్కువ కాసాగింది. సుగుణకు వుండే బెరుకు పోగొడదామనో ఏమో పరిమళ, రవినీ సుగుణనూ సినిమాలకూ, పిక్నిక్సకూ, షికార్లకూ పంపించాలని చూసేది. కాని ప్రతిసారికూడా సుగుణ "అక్కా- నీవొస్తే కాని నే వెళ్ళను" అని హఠం వెయ్యటంతో తనకుకూడా వెళ్ళటం తప్పేదికాదు. సుగుణనూ రవినీ దగ్గర చెయ్యాపోయిన తన ఆలోచన ఏమాత్రం ఆచరణలోకి రాకపోవటంతో పరిమళకు మనస్తాపం కల్గేది ఎందుకంటే ఇద్దరికీ మధ్య(Go between) గా బయల్దేరిన తను సుగుణ. Frigidity వల్ల (active) గా వుండాల్సి వచ్చేది. సినిమాలో ఇద్దరి మధ్య తను కూచోవాల్సి వచ్చేది. బస్సులోనూ రైలులోనూ, కారులోనూకూడా అంతే ! జీవితంలోకూడా అంతే కాబోలు అనే పరిస్థితి కల్గుతుందా అన్నట్లు ఫీలయేది పరిమళ.

ఏది కోరుకుందో అది కాకపోగా రాను రాను రవి తనతో ఎక్కువ సన్నిహితంగా మసలటం, సుగుణను బొత్తిగా చిన్నచూపు చూడటం గమనించ సాగింది పరిమళ. అంతవరకూ ఎంత చెప్పినా వినకుండా రవితో ఏమాత్రం చనువుగా వుండటానికి ప్రయత్నించని సుగుణ, రవి తనను నిర్లక్ష్యం చేసి పరిమళఎడ ఆకర్షితుడగు తున్నాడని తెలిసికోగానే ఎంతో మారిపోయింది. ప్రాణానికి ప్రాణమిచ్చి అక్కా.. అని పిలస్తూ వచ్చినదల్లా పరిమళను పలకరించడం మానుకుంది. "తిన్న యింటి వాసాలు లెక్కెట్టే రకం" అనీ సూటీపోటీ మాటలు విన

పడేట్టు అనేది. అవేమీ పరిమళ లెక్కపెట్టినట్లూ కనపడేదికాదు సుగుణ తనకుగా తాను రవితో చనువుగా వుండాలని ప్రయత్నం చేసేది కాని చేతయ్యేది కాదు. రవి ఆకర్షితుడయేవాడూకాదు. పైగా రవి వద్ద తాను పరిమళను ఎంత కించపరుస్తూ మాట్లాడితే అంతగా అతను పరిమళ అంటే అభిమానం చూపేవాడు.

రాను రాను సుగుణ హిస్టీరికల్‌గా తయారయి ఏ మాత్రం అవకాశందొరికినా సాధించటం, సీన్సు క్రియేట్ చేయటం మొదలెట్టింది. ఎవరు ఏం చెప్పినా విన్పించుకొనేస్థితి దాటిపోయింది. ఒకరోజు నావద్దకువచ్చి "సుజాతా! చూశావా యీఘోరం! రవినినాకాకాకుండా చేయటమే కాకుండా పెండ్లికాకుండానే రవి బిడ్డకు తల్లికాబోతుంది" అని అంది.

నేను వింతల్లోకెల్లా వింత వింటున్నట్లూ ఆశ్చర్యపోయాను. ఎందుకంటే పరిమళను గురించిన ఆమాట మతిలేకుండా సుగుణ అన్నా కూడా నమ్మేవాళ్ళు ఎవరూ లేరు. విషయం తెలిసికొందామని పరిమళ వద్దకు వెళ్ళాను.

రూము వాకిలి కివతలే అచేతనంగా నిలబడ్డాను, బాధితోద్వేగ స్వరంతో రవి అంటూన్న మాటలు వింటూ దాదాపు స్థాణువునైపోయాను.

"నీవింత నీచురాలవని తెలిస్తే మోసపోయేవాడిని కాదు. సద్గుణ రాశి అయిన సుగుణకు నేచేసిన ద్రోహానికి నాకు తగిన శాస్తిచేశావు"

మారునిముషంలోనే దూసుకుంటూపోయాడు రవి నాముందునుంచి, నేను వాకిలి పక్కనున్న సంగతికూడ గమనించకుండా. వెనుకనే వచ్చిన పరిమళ వాకిట్లోనే ఆగిపోయింది. ఎందుకంటే అప్పటికే రవి మోటారుసైకిల్ ఎక్కివెళ్ళిపోతున్న శబ్దంవిని. ఆపరిస్థితిలో పరిమళ కంటపడటం ఇష్టంలేక కర్టెనుపక్కకు చేరాను. కాని పరిసరాలు గమనించేస్థితిలోలేదు పరిమళకూడా.

మరుసటిరోజే కాలేజీ అంతా గుప్పుమంది. పరిమళ ఇల్లు వదలి వెళ్ళిపోయిందని. ఒక్కొరూ ఒక్కొరకంగా వ్యాఖ్యానించడం మొదలెట్టారు. కొందరు పరిమళది తప్పంటే కొందరు రవిది తప్పన్నారు. ఏదిఏమైనా సుగుణలోనూ రవిలోనూ మాత్రం రావలసినమార్పు వచ్చింది. కొద్దిరోజులలోనే ఇద్దరూ చెట్టపట్టాలు పట్టుకొని వెడ్డింగు కార్డ్సు పంచటానికి రావటమే ఆమార్పు.

త్వరలోనే వారి వివాహం అత్యంత వైభోగంగా జరపించారు వెంకటరత్నంగారు. పరిమళగూర్చి తలచినవారు లేకపోయారు. నేను మాత్రం పరిమళను మర్చిపోలేకపోయాను. సుగుణ ఏదో ఇంద్రజాలంచేసి పరిమళ స్థానాన్ని ఆక్రమించుకున్నట్లు బాధపడజొచ్చాను. అసలు సుగుణ నాతో చెప్పిన విషయాన్ని నమ్మలేకపోయాను. రవి పరిమళ ఎడ విముఖత్వం ప్రదర్శించటానికి కారణమూ అర్థంకాలేదునాకు.

కొద్దిరోజులకే అంతా తేటతెల్లం అయిందినాకు. అమెరికా నుండి వచ్చిన పరిచితమైన పరిమళ దస్తూరిగల వుత్తరం చూడటంతో,

డియరెస్ట్ సుజీ,

నేను ఎలా అమెరికా చేరానని ఆశ్చర్యపోతున్నావుకదూ. అదివరకే Tofel పరీక్షపాసయిననేను అమెరికన్ కాన్సల్ వద్దకు వెళ్ళాను. అక్కడ చిన్ననాటి స్నేహితురాలు రమ కనపడ్డది. పాస్‌పోర్టు ఎంట్రీకోసం రమభర్త అమెరికన్ సిటిజన్ మంచి పొజిషన్‌లో వున్నాడు. ఉద్యోగంకోసం వెళ్లిన నేను రమ సహాయంతో అమెరికన్ కాన్సల్ హెల్ప్‌తోనూ అమెరికా చేరాను. ఎక్కువ కష్టంలేకుండానే వుద్యోగం దొరికింది అమెరికాలో.

నా స్నేహితురాలు పరిమళ ఇంత రోగ్ అని అనుకొంటున్నావు కదూ ! బహుశా కాలేజీ అంతాకూడా అలాగే అనుకొంటున్నారు కాబోలు ? నేనేంచేయాలో తోచనిస్థితిలో నేను బయలుదేరివచ్చాను ఇక్కడకు.

...రంగా వుంచుదామన్నా రవి మరీమరీ దగ్గరకు రావటం ...వు. దానికి కొంతకారణం సుగుణ. ఆప్యాయంగా పలుక ...మయంలో మవునంగా, ముంగిలా వుండిపోయేది. పైగా వెళ్ళవలసినచోట్లకు బలవంతంచేసి నన్నుకూడా తీసికు... నాపట్ల ఆకర్షితుడవుతున్నాడని తెలిసికొన్నప్పుడు ...రవిముఖుడ్ని చేసికొంది.

...జు వుదయం రాత్రి పొద్దుపోయినదాకా మేలుకొనివుంటం ...త్వరంవలన వాంతిచేసికొన్నాను. హిస్టీరికల్ మూడ్‌లో ... పెద్దవత్తున అల్లరి మొదలెట్టింది! నేను రవి బిడ్డకు తల్లిని ...నని ఇంట్లో అందరకూ చెప్పింది చాలక పనికట్టుకు వెళ్లి ... చెప్పింది నేను గర్భవతి నని! రవి వెంటనే పరిగెత్తుకు ...రూంకి. "ఏమిటి పరిమళా నేను వింటున్నది నిజమా" ...కాదు' అని చెప్పాలని ప్రయత్నంచేసాయి పెదవులు. కాని 'అవును' అనేమాట బయటకు వచ్చింది.

...చేయను రవికి నాయందు ద్వేషం కలగాలంటే అంతకంటే ... నాపట్ల ద్వేషం కల్గితేగాని సుగుణను వివాహం చేసికో ...కరించడు. సుగుణ పిచ్చి వదలాలన్నా అంతకన్నా మార్గం ...నువలన అలా అనవలసివచ్చింది. తరువాత జరిగిందంతా ...వ్రు. ఏంచేయను చెప్పు? రవిని వివాహం చేసికొని జీవి ...తాతయ్య కుటుంబానికి కృతఘ్నురాలనై సుగుణ వుసురు ... వుండేకంటే నేను రంగంనుండి తప్పుకుని రవి, సుగుణల ...జరుగటానికి తోడ్పడాలంటే అంతకంటేమార్గం కనపడలేదు. ...కంగా నన్ను నేను పతితగా నిరూపించుకొన్నా ఒక సోదరి ...గు చేస్తున్నాననే ఆలోచన నాకు కొండంత సంబరాన్నిచ్చింది.

నెక్కడైనా ఎలాగైనా బ్రతుకగలననే ధైర్యంనాకువుంది. ఎక్కువసేపువుండి అక్కడ చిత్రవధ భరించలేక కొద్దిగంటల ...వదలి వెళ్లిపోయాను.

సుజీ! నీస్నేహితురాలెంతో తెలివికలదనీ ఇతరుల మనసులు అద్దంలా చదువగలదని అనుకొంటున్నావుకదూ! ఆశక్తే నాపాలిట శాపం అయింది. ఇతరుల మనసులు అర్థంచేసికొన్నానేకాని నామనసు నేను పూర్తిగా అర్థం చేసుకోలేకపోయాను. ఎదురుగా వున్నంతసేపూ దూరంచేసికోటానికి ప్రయత్నంచేసిన రవి ఆరువేలమైళ్ల దూరానవున్న నా హృదయాని కత్యంత సన్నిహితుడు. అతన్ని నా హృదయంలో నుండి తొలగించటం అసాధ్యమనే విషయం ఆలస్యంగా తెలిసికొన్నా.

నాసంగతి ఏపరిస్థితులలోనూ ఎవరికి తెలియచేయవద్దు. పీడ కలగా మిగిలిపోయిన నా జ్ఞాపకాలను సరిదిద్దటానికి వాస్తవాన్ని బయలుపరచటానికి ప్రయత్నంచేస్తే రవి, సుగుణల జీవితమనే అమృత భాండంలో విషపుచుక్కను ప్రవేశపెట్టిన దానవవుతావు.

సెలవు

పరిమళ.

ఈ వుత్తరం చదవగానే [redacted]

నాకు తెలియకుండానే కన్నీటిబొట్లు కొన్ని రాలాయి!

# వాక్శుద్ధి

పొద్దున్నేవచ్చినవాన పొద్దుకూకివచ్చిన చుట్టం పోనట్లుగానే పొద్దున్నేవచ్చిన ఆలోచన పొద్దుకూకివచ్చిన అనుమానం త్వరగా వదలవు.

నామటుకునాకు ఏదైనా కూనిరాగం ఉదయం లేవటంతో స్ఫురించిందో ఆరోజల్లా మనసులో అదే మళ్ళీమళ్ళీ జ్ఞాపకం వస్తుందిటుంది. మధ్యమధ్య పెదాలపై వినిపిస్తుంది.

క్రితంరోజు రాత్రి టవున్ హాల్ లో ఒక ప్రఖ్యాత ఉపన్యాసకుడు, అతీంద్రియ మానసశక్తిమీద ఉపన్యాసం చెప్పారు. అందులో ఒక భాగంగా అందరకూ అందుబాటులోవుండే ఉదాహరణలు ఇచ్చారు.

ఒకోరోజు ఎవరో దూరానవున్న బంధువులు మనను చూడటానికి వస్తున్నారని అనిపిస్తుంది. నిజంగా అలాగే జరుగుతుంది. ఊహాలు ఎల్లప్పుడూ వాస్తవాలు కాకపోయినా ఒకప్పుడు వాస్తవాలయి తీరటం అందరకూ అనుభవమే.

రాత్రంతా ఉపన్యాసం గురించి ఆలోచించి నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నాను ప్రక్కమీద. తెల్లవారుజామున ఎప్పుడో నిద్ర పట్టింది.

పూర్తిగా తెల్లవారకముందే ఉలికిపడినట్లు లేచాను,

ఏదో అదృశ్యశక్తి ప్రేరణచేస్తున్నట్లు, ఆరోజంతా నాకు వాక్శుద్ధికలిగి, నేనన్నమాట నిజమైతీరుతుందనే ఆలోచన ప్రబలంగా మనసును కలచసాగింది.

నా ఆలోచన నిజమాకాదా అని పరీక్షించ బుద్ధిపుట్టి మా ఆవిడను పిలచి "యీరోజు మనకోనిధి దొరకుతుందనిపిస్తుంది" అన్నాను.

"ఏమిటంపోయి పగటికలలు కంటున్నారా" అందోలేదో లోపల

నుండి మాఅమ్మమ్మ "ఒరే మోహన్ యీ చెక్కపెట్టెలో చిన్న రేకుపెట్టె మాఅమ్మది కనపడింది. మూతి బిగుసుకొనిరావటంలేదు చూడరా" అంది.

వెనుకటికాలం రేకుపెట్టె, డబ్బులువేసికొనేది, తుప్పుపట్టి మూత గభాలున రాలేదు. అంచు కొంచెంవంచి మూతతీసిననాకు కళ్ళు జిగేల్మనేట్లు దాదాపు వంద రాణి మార్కు వెండిరూపాయలు అరడజను సావరీలు, రెండు మొహరీలు కనబడ్డాయి.

పెద్ద సందుగు పెట్టె మాఅమ్మమ్మకు పుట్టింటివారిచ్చింది. అందులో ఏమున్నయ్యో మాకెవరికీ తెలియదు. అమ్మమ్మ పెళ్ళి శుభలేఖలు దగ్గర్నుండి, దస్తావేజలు, ప్రోనోట్లు, పాత జరీచీరెలు ముఖమల్లు జాకెట్లు, పట్టుచీరెలలోనుండి చింపి దాసిన జరీపోగులూ, నేను చిన్నప్పుడు ఉగ్గుతాగిన వెండిగిన్నె, మాఅమ్మకు అన్నప్రాసన చేసిన వెండికంచం, మాఅమ్మమ్మకు పుట్టింటివారిచ్చిన హారతిపళ్ళెం, ఒకటేమిటి మాంత్రికుని పాండోరాస్ బాక్సులాతీస్తే మూతపెట్టటానికి వీల్లేనంత నిండుగా కుక్కబడి వుంటుంది. ఆసందుగు పెట్టెలో ఎన్ని దొంగఅరలున్నయ్యో మాకు తెలియదు. గుబులు దొర్లినపుడు అమ్మమ్మ అమావాస్యకో పౌర్ణానికో ఓసారి తనసామాన్లన్నీ తవిడి చూచుకొని తాళంవేసికొని తాళంచెవి బొడ్లోదోపుకుంటుంది. ఇంత వరకూ ఆతాళంచెవి మాఅమ్మకీ ఇవ్వలేదు. ఆమెకు జ్వరంవచ్చినపుడల్లా "అమ్మమ్మా నీతాళంచెవి ఇక నాకివ్వొచ్చు" అనే వాడిని.

"అప్పుడే చచ్చాననుకుంట్రా" అనేదికాని చస్తే చెవిఇచ్చేదికాదు.

ఆరోజు ఎందుకనో పెట్టెఅంతా సర్దుకొని దొంగఅరలన్నీ గాలించి మరీ యీచిన్ని యినుపపెట్టెను బయటకు తీసింది.

బళ్ళో పిల్లవాడు అడిగిన ప్రశ్నకు సమయానికి సమాధానం చెప్పలేక ఆతరువాత గుర్తువచ్చి నాలిక కొరుక్కుని ఉక్రోష పడ్డట్లు అమ్మమ్మ అందులోని వస్తువులను చూశాక తెగ ఉక్రోషపడ్డది.

ఆపెట్టె ఆమె తల్లిగారిచ్చింది. ఇచ్చేటప్పుడు "యీపెట్టెలో మంత్రించిన విభూదివుంది, దేవతా విగ్రహాలూ వున్నాయి నీవు ఆపదలో వున్నపుడు తెరచి చూడు" అన్నదట.

అప్పటినుండీ అమ్మమ్మకు ఆవిషయం కొద్దిరోజులే జ్ఞాపకంవుంది. ఆజ్ఞాపకంవున్న కొద్దిరోజులూ ఆమెకేఆపదా రాలేదు.

సందుగుపెట్టె మూలపారేసినాక ఆవిషయం పూర్తిగా మర్చిపోయింది అమ్మమ్మ. ఈరోజు యాదృచ్ఛికంగా బయటపడింది నిధి.

ఇప్పటి రోజుల్లో చెప్పలేనంత విలువవస్తుంది ఆపెట్టెలో వున్న వాటిని అమ్మితే !

నాకు వాక్శుద్ధి కల్గిందన్న నమ్మకం మాఆవిడకు పూర్తిగా కలిగింది కాని నాకు కొంచెం అనుమానమే.

మరోసారి పరీక్షచేయ బుద్ధయింది. ఈసారి అసాధారణ మయినది, అసంభవమయినది జరుగుతుందేమో నావాక్శుద్ధివలన. అని చూద్దామనిపించి మా అమ్మమ్మతో,

"అమ్మమ్మా యీరోజు సుశీల అక్కయ్య వస్తుంది మన యింటికి" అన్నాను.

సుశీలక్కయ్య అంటే నాకు మాఅమ్మమ్మకుకూడా ప్రాణం !

"ఎలావస్తుందిరా కొద్దిదూరం కాదాయె ఆరువందలమైళ్ళు. ఇంటాయనకు ఎప్పుడూ సెలవ దొరకదు. పిల్లలకు బడులాయె. ఒంటరిగా ఎలావస్తుంది" అంది.

ఆమెమాటలు ముగించిందోలేదో రిక్షాఒకటివచ్చి యింటిముందాగింది.

సుశీలక్కయ్య నవ్వుతూ రిక్షాదిగింది.

బావగారి బంధువుల్లో మాకు దగ్గరవూళ్లో పెండ్లి జరుపుతున్నామని పిలచారట! తనకు వీలుకాదు కాబట్టి ఇటువయిపు ఎవరో తెలిసిన

వాళ్ళు వస్తుంటే జతచేసి అక్కను పంపారు బావగారు. ఇంటిపక్క ఆవిడ పిల్లలనూ ఇంటినీ కనిపెట్టి చూస్తానని మాటఇచ్చాక అక్క బయల్దేరింది. కొంత మమ్మల్ని చూద్దామనే ఆశతో.

కుశలప్రశ్నలు అయ్యాక అంతా హాల్లోచేరాము.

నా వాక్శక్తిని పరిశీలించుదామని మరలా కోరిక కలిగింది.

అవి వానాకాలం రోజులు.

"ఇవాళ అందరం మామిడికాయలు, రసాలమామిడికాయలు తింటాం" అన్నాను.

నేను అనటమే తడవుగా అక్కయ్య "నామతిమండినట్టేవుంది. బాగాగుర్తుచేశావురా. నీకిష్టమని యీకాలంలో ఇక్కడ దొరకవనీ మామిడికాయలు బుట్టలోతీసికొనివచ్చాను నావెంట" అంటూ తను తెచ్చిన రసాలు మాకందరకూ ఇచ్చింది.

నాశక్తిమీద నాకు నమ్మకం ఎక్కువయింది.

కాని నేను భయంతో వణకిపోవాల్సి వచ్చింది కొద్దిసేపట్లోనే !

ఎదురింటివారి కుక్క టైగర్ దూసుకొంటూ మా వంట యింట్లో జొరపడి గిన్నెల్లో పదార్థమేదో సంగ్రహించి చిటికెలో మళ్లీ బజారునపడింది.

"ఓరి నీకుక్కచావ !' అన్నాను రోజూ అన్నట్లే !

శరవేగంతో వెడుతున్న ఎంబాసిడర్ కారు వెనక చక్రంకిందపడి తక్కున చచ్చింది టైగర్.

నాశక్తికి భయపడడం మొదలయింది ఆక్షణంనుంచే.

పొరపాటుగా ఏమిమాట బయటకు వస్తుందోనని గిజగిజలాడాను.

అసలు మనసు ఆలోచించడం మానివేసింది కొంతసేపు.

ఒకవేళ ఆలోచనలుకూడా ఫలిస్తాయేమో. అనుకొన్నట్టే జరుగు

కండ్లలో వత్తులు వేసుకొని సేవచేసేది.

ఇంతజ్వరం పసిగుడ్డు ఎలాతట్టుకొంటాడనుకొనేది.

ఎన్నేళ్ళొచ్చినా నేనామెకు పసిగుడ్డునే !

పరీక్షలకు ఎక్కువగా చదువుతున్నా "అమ్మో అంతగా చదివితే ఆరోగ్యం దెబ్బతింటుందేమో" అను కొనేది.

కొంత వయసువచ్చాక ఆమె అతిప్రేమకు మొహంమొత్తి విసుక్కొంటూ వుండేవాడిని.

"నీకో కొడుకుపుడితే తెలుస్తుందిరా నామనసు" అనేది.

ఆమె నోటిచలువవల్ల నాకు పెండ్లయినవెంటనే రాము కలిగాడు.

ఆమె చెప్పినట్టు నేనూ మావాడు ఎక్కడికివెళ్తే ఏంజరుగు తుందోనని తెగభయపడుతుండేవాడిని.

వాడుపాకుతుండే వయసులో ఎక్కడ నూతిలో పడతాడోనని నూతి పిట్టగోడ ఎత్తుగా కట్టించాను.

నడవటం మొదలెట్టగానే మేడమీదకు వెళ్ళకుండా ఎప్పుడూ మెట్లగది తాళంవేసి వుంచేవాడిని.

బజారుకు ఎప్పుడు వెళ్ళతాడోనని వరండాను గ్రిల్‌తో మూయించాను.

పెద్దయినాక అంతే.

బజారుకువెళ్ళితే తిరిగి వచ్చిందాకా అమ్మమ్మకంటే ఎక్కువగా కంగారుపడేవాడిని.

ఒకసారి తొమ్మిదేళ్ళ వయసులో విహారయాత్రకని బయ ల్దేరాడు. వద్దనిచెప్పాకాని వాడు మంకుపట్టుపట్టి వెళ్ళాడు.

వాడు ఇంటికి తిరిగివచ్చేంతవరకూ నాకు తిండీ, నిద్రా లేదు.

మా అమ్మమ్మ నన్నుచూచి పకాపకానవ్వి వేళాకోళంచేసేది.

ఏమిటి నాఆలోచనలు వాడిమీదకు వెళ్తున్నాయి.

రోడ్డునవస్తూ ఏకారుకిందయినా పడలేదుకదా.

కెవ్వుమని అరచాను. 'నాకీ వార్ధక్యం వద్దు' అంటూ కేకలు పెట్టాను.

ఏమిటిరా పగటి నిద్రలో కేకలేస్తున్నావు అంటూ మాఅక్క, నాభార్య అమ్మమ్మ అంతా పరిగెత్తుకు వచ్చారు.

నోటివెంట మాటరాదు. వళ్ళంతా చెమటలుపట్టింది. గుండె ఎక్స్‌ప్రెస్ రైలింజనులా కొట్టుకొంటూంది. శరీరావయావలేవీ స్వాధీనంలోలేవు.

అలా ఎంతసేపున్నానో నాకే తెలియదు.

"నాన్నా మరి రోడ్డునవస్తుంటే మురళీవాళ్ళ కారు నన్ను రాసుకుంటూ పోయింది, కారు మడ్గారు గీసుకుపోయింది" అంటూ కుంటుకుంటూ పరిగెత్తుకువస్తున్న రామును గట్టిగా పట్టుకొని వళ్ళంతా తడిమిచూశాను.

అమ్మయ్య పిల్లవాడు క్షేమంగానే వున్నాడు.

అయితే కారుకింద పడ్డాడని నేనన్నది కలలోనన్నమాట.

కలలో అన్నమాటకూడ శాఖచూపించి వదలింది.

నిజంగా అనియుంటే !

ఇక జన్మలో ఇటువంటి శక్తులు కలుగకూడదన్న భావం మనసులో ప్రబలంగా చోటుచేసికొంది.

# మతిమరుపు

ప్రొఫెసర్ రావుగారు బ్యాంకి మేనేజర్‌తో పనివుండి బ్యాంకికి వచ్చారు. పని పూర్తిచేసుకొన్నాక బయటకువచ్చి చూచుకుంటే కారువుందికాని డ్రైవర్ రాజు కనబడలా !

బ్యాంకి ప్రక్కను రోడ్డు ఆచివరా, యీచివరా చూచివచ్చాడు; ఎక్కడా డ్రైవరు ఆచూకీలేదు.

లోపలకువచ్చి ఫోనుచేశాడు భార్య శాలినికి, డ్రైవరు ఒక వేళ పనివుండి తన యింటి ఆవరణలోనేవున్న డ్రైవరు క్వార్టర్సుకు వెళ్ళాడేమోనని.

అప్పుడు భార్యచెప్పింది "మీరు సొంతగా కారునడుపుకొంటూ బ్యాంకికి వెళ్ళారుగదా ! ఇప్పుడు డ్రైవరు లేడంటారేమిటి ? వాడు సెలవుపెట్టి నిన్ననే వూరెళ్ళిపోయాడుగదా !" అని.

అప్పుడు గుర్తొచ్చింది కాంతారావుగారికి తానే కారునడుపుకు వచ్చినట్లు !

ఇక కారుతాళం ఏమయినట్లు ?

మేనేజరుగారితోసహా అందరూ కారు తాళాలకోసం వెతక సాగారు.

బల్లమీద ఫైల్సులన్నీతీసి వెదకారు పొరపాటున పడ్డవేమో నని డ్రాయరు సొరుగులన్నీతీసి చూలిపారు.

చెత్తకుండీలన్నీ గాలించారు.

ఎక్కడా జాడలేదు.

అందరూ వెదుకుతూ వుండగానే కారు బయల్దేరిన శబ్దం అయింది !

రావుగారి కారు తాళాలుకారుకే వున్నాయి.

అందర్నీ తాళాలు వెదకమని, ఆసంగతి మర్చిపోయి, మామూ లుగా వెళ్ళి కారులో కూర్చొని డ్రైవ్ చేసుకొంటూ వెళ్ళిపోయా డన్నమాట !

ఇదీ వరస !

Absent minded professor కు ఉదాహరణ కావాలంటే మా టవునులో రావుగారికంటే మించినవారు లేరు.

ఆయన మతిమరుపు గురించి లేనిజోక్ లేదు. కథలుగా వర్ణించి పగలబడి నవ్వుకునేవారు జనం !

చిన్నప్పటినుండి వున్నది ఆయన కీ జాడ్యం !

బడిలోకి వెళ్ళేటప్పుడు రోజూ పుస్తకాలో పెన్సిలో, కలమో, చెప్పులో, అన్నినో పారేసేవాడు. ఒకోరోజు బడికి వెళ్ళటం మర్చిపోయి ఎక్కడికో వెళ్ళి ఆలోచిస్తూ కూర్చొనేవాడు.

ఏమయినా అతనిది గొప్ప మేధాశక్తి. పరీక్షలు వ్రాయాలేగాని వ్రాస్తే నూటికి నూరుమార్కులు రావాలిసిందే !

వేళకు వెళ్ళి రైలుగాని, బస్సుగాని ఎక్కటానికి ఎవరయినా మనిషితోఉండి తీసికొని వెళ్ళవలసినదేకాని సొంతగా వెళ్ళలేడు అని ఆయన తండ్రి ఎప్పుడూ వెంటవచ్చి రైలో, బస్సో, ఎక్కించి మరీ వెళ్ళేవాడు !

రైలు ఎక్కించి వెళ్ళగా ఒకోసారి దిగవలసినచోట దిగకుండా స్టేషను దాటివెళ్ళాక దిగటం జరుగుతుండేది !

అందుకని ఎవర్నయినా జతచేసి పంపుతుండేవారు కాలేజీకి వాత్తేరు వెళ్ళేప్పుడు !

వేళకు గుర్తుచేయకపోతే తిండి నిద్రకూడా మర్చిపోయే టటు వంటి మనిషి !

పెండ్లిలో తాళికట్టేటప్పుడు తాళితీసికొని భార్య నెత్తిమీద ఉంచాడు.

ప్రక్కన తల్లివుండి నెమ్మదిగా సైగచేసినమీదట భార్య మెడలో తాళికట్టాడు.

తలంబ్రాలు పోసినట్లుగా తాళి నెత్తిన వేశాడన్నమాట ఒకదానికొకటి కంగారుపడి.

అంతకంటే వింతవిషయం పెండ్లిఅయినరాత్రి జరిగింది.

పెండ్లికుమార్తెను గదిలోకి తీసికొనివెళ్ళిన ముత్తయిదువులకు ఎంతసేపటికీ అతనిజాడ తెలియలేదు.

ఒకవేళ ఏదైనా వంట్లో నలత ఏర్పడినదేమోనని ఆయన గదిలోకివెళ్ళి చూస్తే గాఢనిద్రలో మునిగివున్నాడు! అంతమరపు.

భార్యతో హనీమూన్‌కి వెళ్ళినప్పుడు చాలాచోట్ల ఆమెను వదలివేసి బయలుదేరి వెళ్ళేవాడు.

భార్య శాలినికి ఆయన సంగతి అదివరకే అవగతమయివుంది గనుక తన జాగ్రత్తలో తానుండి ఎక్కడా ఆయనను వదలకుండా పరువు కాపాడుకొంది!

ఆయన న్యూక్లియర్ ఫిజిక్సులో మనదేశంలో అగ్రశ్రేణి సైంటిష్టులలో ఒకరుగా పేరుతెచ్చికొన్నాడు.

పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థులకు పాఠాలు చెప్పేప్పుడు వాళ్ళకు ఎంతవరకు సబ్జక్టు చెప్పాలో గుర్తుండేదికాదు రావుగారికి. ఏవిషయం మొదలెట్టినా ఎంతోదూరం వెళ్ళిపోయేవాడు! పైగా ఆయన వాగ్ధాటి అనర్గళం ఎవరకూ ఆయనచెప్పిన పాఠం అర్థంఅయ్యేదికాదు. పైగా ఆయన పేరు ప్రఖ్యాతులు అప్పటికే మారుమోగుతున్నవాయె!

రిసెర్చిచేసే విద్యార్థులకుమాత్రం ఆయన కామధేనువు. ఏ ఏ ప్రాబ్లమ్ ఎలా సాల్వుచేయాలో ఏథియరీనుంచి ఎలా ప్రొసీడ్ అవాలో విద్యార్థులకు చక్కని సలహాలిచ్చి తర్ఫీదుచేసేవాడు. దాదాపుగా చాలామంది చేసిన రిసెర్చిలో ఎక్కువపాలు ఆయన చేయూతతో చేసినదే అయివుండేది!

రిసెర్చి వర్కులోపడితే భోజనం, టిఫిన్ సంగతి మర్చిపోయేవాడు.

ఆయనకు భోజనం, టిఫిన్‌ల సంగతి గుర్తుచేసే ధైర్యం ఎవరికీ వుండేదికాదు !

చాలారోజులు వేళకు భోజనం లేకుండా గడిపేవాడు.

మంచి ఆరోగ్యం, అద్భుతమైన శరీరదార్ఢ్యం కలిగివున్నవాడు కావటంతో ఆయన బండిలాక్కొస్తున్నాడుకాని మామూలు మని షయితే ఎప్పుడో హారీ అనేవాడే !

ఆయనకు ఒక్కడేకొడుకు, కాశ్యప.

చాలా చిన్నతనంలోనే తన తెలివితేటలతో అందరనూ మురి పించాడు కాశ్యప.

తండ్రినిమించిన తనయుడవుతాడన్నా రందరూ !

మూడోఏటకే అక్షరాభ్యాసం జరిగి అయిదో సంవత్సరం వచ్చేసరికి అయిదు తరగతులూ పూర్తిచేయగలిగాడు.

హైస్కూలులో చేర్చటానికి వయసుచాలదుకనుక ప్రైవేటుగా మెట్రిక్ చెప్పించాడు రావుగారు. పదోఏటే మెట్రిక్ పాసయాడు.

కాలేజీలో చేర్చుకోరుకనుక ప్రైవేటుగా పి.యు.సి.చదివించాడు.

అన్ని పరీక్షలలోనూ యూనివర్సిటీ ఫస్టు వచ్చేవాడు.

ఏ సబ్జక్టు చదివినా అందులో ఏదో ఒక విషయాన్ని తీసికొని అంతవరకూ ఎవరకూ తెలియని కొత్తవివరణలూ, పోకడలూ కనపడేయి కాశ్యపకు అతను చెప్పేవరకూ ఆ ఫైనల్ పోయింట్సు అతని లెక్చె రర్లకూ ప్రొఫెసర్లకూ అర్థమయేవి కావు.

అతని జ్ఞానతృష్ణ అనంతం, మేధస్సు అమోఘం, ధారణాశక్తి అనల్పం !

కాని మతిమరుపులోమాత్రం తండ్రిపోలిక పూర్తిగావచ్చింది ! తండ్రిని మించిపోయేడేమోకూడా !

రావుగారి పుత్రుడు గనుక అతనికి ఏలోటూ జరుగకుండా వస్తున్నది కాని లేకపోతే ఎప్పుడో ఏప్రమాదానికికో బలిఅయి వుండేవాడు.

స్పేస్ సైన్సులో ఎక్కువగా కృషిచేయదలచి బహుచిన్న వయసులోనే అమెరికా వెళ్ళిపోయాడు కాశ్యప.

మనదేశంలోకంటె అమెరికాలో శాస్త్రవిజ్ఞానం విషయకంగా ఎంతో పురోభివృద్ధి సాధించినదికనుక అభిలాషగలవారికి, జిజ్ఞాసువు లకు చేసికొన్నవారికి చేసికొన్నంత అన్నట్లు అపారమయిన అవకాశాలు వుంటాయి.

అచిరకాలంలోనే ప్రపంచ ప్రఖ్యాతి చెందిన శాస్త్రజ్ఞులవద్దనుంచి ప్రశంసలను పొందాడు.

కాశ్యప ఎప్పటికయినా నోబెల్ ప్రయిజు పొందితీరతాడని విశ్వసించేవారు తోటిశాస్త్రజ్ఞులు.

'పుత్రోత్సాహము తండ్రికి' అన్నట్లు ఒక్కగానొక్క పుత్రుడు సాధించుతున్న విజయాలకు ఎంతో సంతోషపడిపోయాడు రావుగారు.

భార్య పెండ్లివిషయం ఎత్తితే "ఇప్పుడేం తొందర వాడి రిసెర్చికి భంగం కలుగకూడదు" అంటూ తేల్చివేసేవాడు.

కొడుకు అభివృద్ధిని గమనిస్తున్న సంతోషంతో రావుగారు కూడా అద్భుతమైన విజయాలను సాధించాడు తన ఫీల్డులో !

దేశంలోనూ విదేశాలలోనూకూడా ఆయన ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు.

అమెరికాలో ఆయన ఉపన్యాసాలు ఏర్పాటు చేశామన్నప్పుడు ఎంతో సంతోషంతో ఒప్పుకొన్నాడు.

చాలా సంవత్సరాల తర్వాత కొడుకును చూడబోతున్నాననే సంతోషంతో ఆయన మనసు పరవళ్లు త్రొక్కింది.

న్యూయార్కు విమానాశ్రయంలోదిగి వేయికండ్లతో ఎదురు చూచాడు కాశ్యప కోసం.

అతని జాడే లేదు.

ఏదైనా ప్రమాదమయిందేమో ?

ఇంతలో కొడుకుకుకూడా తనలా మతిమరపువున్నదని గుర్తుకు వచ్చింది.

ఒకవేళ మర్చిపోయాడేమో ?

చిన్నగా నవ్వుకొంటున్న రావును ఆహ్వానించటానికి వచ్చిన సైంటిస్టులు వెంట తీసికొనివెళ్ళారు.

ఆరోజు రావుగారి ఉపన్యాసం. ఎంతో దూరంనుండి ఉపన్యాసం వింటానికి ఫీల్డులోవున్న సైంటిస్టులు వచ్చారు.

రావుగారి కండ్లు హాలంతా కలియదిరిగాయి. ఎక్కడా కాశ్యప జాడలేదు.

ఉపన్యాసం చెప్పటానికి డయాస్‌మీదకు వెళ్ళబోతున్న రావుగారి చేతిలో ఎవరెక్సుమెస్సేజ్ వుంచాడు.

కాశ్యప కారు ఏక్సిడెంట్‌లో చనిపోయాడని సారాంశం.

రావుగారి కాళ్ళకింద భూమి కుంగిపోయినట్లుగా కుప్పగా కూలిపోయాడు.

ఎంతోసేపు ఉపచారం చేసినాకగాని ఆయనకు తెలివిరాలేదు.

శూన్యదృక్కులు, నోట మాటాపలుకూ లేకుండా ఉండిపోయిన రావుగారు ఎన్నిరోజులకూ కోలుకోలేదు.

సైకియాట్రిస్టులుచూసి స్కిజోఫ్రేనియా అని తేల్చారు.

మెదడుకు యి సి టీ కరెంటుషాకు ట్రీట్‌మెంటు ఇవ్వాలని నిర్ణయించారు.

అలాగే యిచ్చారుకూడాను.

కరెంటు పాసయిస్తే మెదడులోని కొన్నికణాలు దెబ్బతిని కొంత మేధాశక్తి తగ్గిపోతుందేమో ?

ఇవ్వకపోతే వాదాపుగా జంతువుతో సమానంగా శేషజీవితం గడపాల్సి వస్తుందేమో.

అని మధనపడీ మధనపడీ మరీయిచ్చారు అక్కడి సైకియాట్రిస్టులు యి సి టి.

మంచి ఫలితాన్నిచ్చింది యి సి టి.
మళ్ళీ కోలుకున్నాడు రావుగారు.

మామూలు ప్రపంచంలోకి వచ్చాడు.

అన్ని విషయాలలోనూ ఆసక్తిచూపగలగుతున్నాడు.

కొత్తవిషయాలు తెలిసికోవాలనే కుతూహలం చూపుతున్నాడు.

త్వరలోనే బయల్దేరి స్వదేశం తిరిగివచ్చాడు.

ఎవరూ ఆయనకు కాశ్యప విషయం గుర్తుచేయలేదు బాధపడతాడని, ఆఖరుకు భార్యకూడా.

కొద్దిరోజులలోనే అందరూ ఆయనలో వచ్చిన మార్పు గమనించారు.

ఆయనలో మతిమరుపుగుణం పూర్తిగా పోయింది.

ఇ సి టి వలన మతిమరుపు నయమయింది.

మేధాశక్తి తగ్గినందువల్ల మతిమరుపు పోయిందా, లేక మెదడులో మతిమరుపుకు సంబంధించిన ప్రత్యేక కణాలేవైనా ఇ సి టి వల్ల దెబ్బతిని రోగం కుదిరిందా ? లేక మతిపోయినపుడు మతిమరుపు పోయిందా ?

ఇది అందరనూ వేధిస్తున్న ప్రశ్న !

# పిన్ని

కామాక్షమ్మ పిన్నిని కొడుకు యింట్లోంచి వెళ్ళగొడితే వచ్చి చేరింది మాయింటికి

వచ్చినామెను ఎలా కాదనటం.

స్వయానా మాఅమ్మ చెల్లెలు.

బడిలో పిల్లలకు పాఠాలు చెప్పటానికి, నోట్సులు తయారుచేసి కోటానికి కాక ఇంట్లో పనికూడా చేయాలంటే నావల్ల హూనం అయిపోతున్నది !

నిజానికి నాకో తల్లి తోడూ ఆసరా కావాలి !

మాఅమ్మ పోయిన దగ్గరనుండి మనిషిసాయం లేక నానా బాధలూ పడుతున్నాను.

భర్త వైపు సాయంవచ్చే బంధువు లెవరూలేరు. ఆయనకు ప్రైవేటు కంపెనీలో తీరికలేని ఉద్యోగం.

సురేంద్రన్నయ్య పిన్నిని వెళ్ళగొట్టటంకూడా నామేలుకే చేశా డనుకొన్నాను.

నేను వేళకు ఇంట్లో వుండక తిండితిప్పలూ చూడకపోవటంతో పిల్లలు రమ సుమలు ఎండిపోయారు.

కనీసం వాళ్ళయినా వేళకు కమ్మనితిండికి నోచుకొన్నారు ఇప్పటి కయినా.

మధ్యతరగతి సంసారంలో రెక్కాడితేగాని డొక్కాడదు.

వంటమనిషిని పెట్టుకొనేతాహతూ లేదు.

వంటమనిషిని పెట్టుకొన్నా వెంబడివుండి బాధ్యతగా చేయించు కోపోతే ఎగనా దిగనాచేసి ఇల్లు గుల్లచేయటంతప్ప రుచిగాను శుచి గాను వండిపెట్టరు.

వాళ్ళవెంటబడి చేయించుకొనేకంటె సొంతంగా వంటచేయటం

తేలిక. తక్కువ ప్రైములో అవుతుంది, రుచిగానూ శుభ్రంగానూ వుంటుంది.

అందుకే బడిపంతులమ్మ ఉద్యోగంలో చేరిన కొత్తలో ఒకరిద్దరు వంట మనుషులను పెట్టుకొన్నా ఎక్కువ రోజులు వాళ్ళను వుంచుకోబుద్ధి కాలేదు.

ఒకామె బహుదుబారా మనిషి.

పొద్దున లేచిన దగ్గరనుండి రాత్రిపడుకోబోయేవరకు పొయ్యి గణగణ మండవలసిందే. పొయ్యిమీద గిన్నె లేనపుడుకూడా మంట తగ్గించదు.

"మామ్మా కట్టెలఖర్చు ఎక్కువయింది" అన్నా కొద్దిరోజులున్నాక మొహమాటపడుతూనే

"నేనే చెబుదామనుకొన్నానమ్మాయి, ఓబస్తా బొగ్గులుకొను, కట్టెలు ఆటివస్తాయి" అంది.

సరే బొగ్గులు తెప్పించాను.

కట్టెలపొయ్యి మామూలుగానే ఉదయంనుండి సాయంత్రం వరకూ మండుతూనేవుంది.

పక్కన బొగ్గులపొయ్యికూడా రగులుతూనేవుంది తోడుగా. ఉదయంనుండి సాయంత్రంవరకూ !

ఏమనుకొందో ఏమో "అమ్మాయి ఒక కిరసిన్ స్టౌవ్ కొను. గిట్టుబాటవుతుంది" అన్నది వారంరోజుల తర్వాత.

సరే స్టౌవ్ కొన్నా !

వంట మామ్మకు ముందు కట్టెలపొయ్యి, యీపక్క కిరోసిన్ స్టౌవ్, ఆపక్క బొగ్గుల కుంపటీ ఉదయం లేవటంనుండి రాత్రి పడుకొనేదాకా మండేవి. యిదీవరస !

ఆమెకు అగ్నిహోత్రి అని మారుపేరుపెట్టారు మావారు.

ఇహ ఆమెను భరించటం నావల్లకాదని తేలిపోయింది.

ఏదోచెప్పి పంపించివేశాను.

రెండోఆమె వయసులోవున్న విధవరాలు. అన్ని విషయాల లోనూ పొదుపుగానే వుండేది. ఇల్లూ శుభ్రంగా వుంచేది.

కాని ఆమె వేషాలు నాకునచ్చలా! తర్వాత ఏమనుకొంటే ఏమిలాభం ?

నేను యింట్లోవుండే సమయం వుంటుంది, లేనిసమయం వుంటుంది.

ఎంతమంది తెలివితక్కువగా కొంపలు కూల్చుకోలేదు.

అవకాశం లేనంతవరకూ అందరూ ప్రవరాఖ్యులే !

ఎదురుగా ప్రలోభం కనపడుతుంటే నిగ్రహించుకోగలవా రెందరు ?

నిజంచెప్పొద్దూ ఏకారణం లేకుండానే మాన్పించాను.

"కారణం లేకుండా మాన్పించావేం" అని మావారన్నప్పుడు నాగుండె ఝల్లుమన్నది.

కొంపతీసి ఏమయినా గ్రంధం జరుగలేదుగదా !

ఏదోచెప్పి మాట మార్చేశాను.

అప్పటినుండి మరల వంటమనిషిని పెట్టుకొంటేఒట్టు ! మన బంగారం మంచిదయినా మనజాగ్రత్తలో మనముండాలిగా ! !

కామాక్షమ్మ పిన్ని అన్నీ తెలిసిన మనషి అన్నిరకాలవంటలూ పిండివంటలూ చేయగలదు.

పొద్దునే యిడ్లీ చేసేది.

మధ్యాన్నం అన్నం, కూరా, పులుసూ, పచ్చడీ వేడిగా తయారు చేసి అందరకూ కొసరివడ్డించేది.

ఉదయం యిడ్లీ మిగిలితే మధ్యాన్నం సియాళి చేసేది యిడ్లీ ముక్కలతో !

మధ్యాహ్నం అన్నం మిగిలితే రాత్రికి జంతికలన్నా చేసేది లేకపోతే మర్రోజు మెత్తగా రుబ్బి వడియాలైనా పట్టేది ?

ఇల్లు శుభ్రంగా వుంచేది.

కాని బియ్యం, పంచదార, చింతపండూ అన్నీ అంతత్వరగా నిండుకుంటున్నాయేమిటి ?

నేను వంటచేస్తే 'వారం వచ్చేసరకులు పిన్ని చేతిలో రెండు రోజులుకూడా రావటంలేదు.

ఒకటికి నాలుగు పదార్థాలు నింపాదిగా చేస్తుందిగదా, నేనయితే కూరవండితే పులుసుచేయకుండా పులుసువండితే పచ్చడిచేయకుండా ఏదో ఇంత వుడకేసేదాన్ని. ఆ తేడావుంటుంది కాబోలు అని మనసు సరిపెట్టుకొన్నాను.

ఓరోజు సాయంత్రం ఆఖరిపిరీడు ఖాళీదొరికితే పెందలాడే యింటికి వెళ్ళేను.

ఇంట్లో పిన్ని లేదు.

ఏమయిందని పనిమనిషి లక్ష్మిని అడిగాను.

సైగచేసి చూపించింది.

ప్రహరీగోడ పక్కన పిన్ని పక్కింటి బామ్మతో మాట్లాడుతుంది "మరీ ఇంత అన్యాయం అయితేఎలా సగానికిసగం ధరకూడా ఇవ్వకపోతే అంటుంది, బియ్యంమూటనిక అందిస్తూ !

అవతలఇంటి బామ్మ నన్ను చూచినట్లుంది చటుక్కున వెళ్ళిపోయింది.

నేనుకూడా ఏమీ ఎరుగనట్లు తిరిగివచ్చాను.

సరకులు ఎక్కువగా ఖర్చవటానికి కారణం బోధపడింది.

కాని స్వయానా అమ్మతోబుట్టువు, తల్లితర్వాత తల్లి అంతటి దాన్ని ఏమనేది ?

నా జాగ్రత్తలో నేనుందామని అనుకొన్నాను.

రోజూ ఉదయం లేవగానే ఆరోజుకు సరిపోయేంత కాఫీపొడి, పంచదారా, కూరగాయలూ చింతపండూ తీసి విడిగాపెట్టి స్టోరురూము తాళంపెట్టేదాన్ని.

బియ్యంకొలచి ఎసరుగిన్నెలో నీళ్ళలో వేసేదాన్ని.

ఇక పిన్నికాదు ఆమెతలలో జేజెకూడా ఏమీచేయలేదులే అనుకొని భరవాసాగా స్కూలుకు వెళ్ళివస్తున్నా !

కాని నాదిలాసా త్వరలోనే పోయింది.

ఓరోజు పొయ్యిదగ్గరకు పిన్నిలేని సమయంలో వెళ్ళాను. పొయ్యివెనక పెంకుముక్కలో తడిబియ్యం ఆరబెట్టివున్నాయి.

'తాడితన్నేవారి తలదన్నేవారుం' టారనీ నేను బియ్యం నీళ్ళలో వేసి వెళితే ఆమె అందులో కొన్నితీసి ఆరబెట్టి అమ్ముకుంటుందన్న మాట !

తాను బియ్యంతీసినట్లు తెలియకొండా వుండటానికోసంకాబోలు, బియ్యం మెత్తగా వండుతున్నది అన్నం ఎక్కువగా కనబడటానికి.

అన్ని వస్తువులూకూడా ఈవరకంత ఎక్కువగా కాకపోయినా కొద్దికొద్దిగా అమ్ముకొంటూనే వున్నదన్నమాట !

నేను ఏంచేయాలో తోచక అట్లాగే దిగాలుపడి ఉన్నాను.

ఇంతలోనే సురేంద్రన్నయ్య వచ్చాడు దేవుడిలా !

లోపలకు తీసికొనివెళ్ళి పిన్ని వినకుండా జరిగినవిషయాలు చెప్పాను.

తాను తల్లిని తీసికొనివెళ్ళటానికే వచ్చాననీ, మనుమరాలు పోయిన దగ్గరనుండి కామాక్షమ్మ పిన్నికి యిలా చిల్లర దొంగతనాలు చేయటం అలవాటయిందనీ, అన్నయ్య అన్నాడు.

అలా వచ్చిన డబ్బుతో సురేంద్రన్నయ్య చనిపోయిన కూతురుకు గాజులూ, పిచ్చినగలూ, జాకెట్లూ, లంగాలూ, వంటసామాగ్రి ఒక టేమిటి సమస్తమూకొని దాస్తుందనీ, ఆసామాన్లతోటి ఆడపిల్లను కాపురానికి పంపవచ్చునని !

ఇంట్లోనే కాకుండా కూరగాయలమ్మటానికి వచ్చేవారివద్ద కూర గాయలు తస్కరించేదనీ.

చిల్లరకొట్టువద్దకు వెడితే అపరాలో, బెల్లంముక్కో మరోటో కాజేసుకువచ్చేదనీ.

బట్టలకొట్లోనూ, నగలకొట్లోనూ అదేపనిచేయబోయి పట్టు పడగా పెద్దఅల్లరి అయిందనీ.

అప్పుడు తాను గట్టిగా మందలించితే ఇలావచ్చేసిందనీ.

చెప్పాడు అన్నయ్య.

తన బండారం బయటపడిందనో ఏమో పిన్ని మెదలకుండా తన సామాను సర్దుకొని తయారయింది అన్న వెంట వెళ్ళటానికి.

పిన్ని యిలా అయిందన్న బాధతో రెండు కన్నీటిబొట్లు రాల్చ గల్గానుకాని మరేం చేయలేకపోయాను, మాట్లాడలేకపోయాను.

చనిపోయిన మనుమరాలిని కాపరానికి పంపించబోతున్నట్లు ఊహించుకుంటూ అందుకు కావలసిన సామాగ్రి ఎవరికీ తెలియకుండా పోగుచేయటానికి ఇలా కష్టపడుతుందన్నమాట పిన్ని !

# మమత

బ్రహ్మదేవుడు గండ్రేడ్ తనం ఉండవలసినచోటకూడా జాలిగుణం పెట్టటంతో అది ఓ పిసరు ఎక్కువయింది నాలో! దానికితోడు మొండి ధైర్యం! చిన్నతనంనుంచీ అందువలన కొన్ని బాధలూ, అవస్థలూ పడ్డాను, కొన్ని సుఖాలూ లాభాలూ పొందాను!

ఎవరయినా బాధపడుతుంటే చూడలేకపోయేదాన్ని. ఇంటికి ముష్టివాడువస్తే ఏమీ వెయ్యకుండా పంపేదాన్నికాదు.

మా పక్కింట్లో ఓ పేదకుటుంబం వుండేది. భర్త ఏమీపని చేసేవాడుకాదు. ముంగిలా మునగదీసికొని మంచంమీద పడుకొని వుండేవాడు. ఆడవాళ్ళు బయటకువెళ్ళి పనిచేయటం వాళ్ళలో అలవాటులేదు. అక్కడకూ ఆమె ధైర్యంగా పరిస్థితి నెదుర్కొంటూ శాయశక్తులా ప్రయత్నించేది.

అప్పడాలూ వడియాలూచేసి అమ్మించేది, విస్తళ్ళు కుట్టేది. చీరెలకూ జాకెట్లకూ ఎంబ్రాయిడరీ చేసిపెట్టేది.

కాని ఈతృణమూ, పణమూ పిల్లలున్న సంసారాన్ని యీడ్వ గలవా? ఉన్నకొద్ది పొలంమీదవచ్చే వరుమానం బహుతక్కువ. ఇంటాయన బద్ధకంచూసి రైతులివ్వవలసినదికూడా సరిగా ఇచ్చేవారు కాదు. పెద్దలు మిగిల్చిన కొంపవుంది కనుక పరువుబజారున పడకుండా కాపాడుకోగల్గేది.

"ఏమండీ కట్టెపుల్లలు లేవు. వీధిలో పేడ బొగ్గుమసికలపి వుండలు చేసి పెట్టుకుంటే అవీ నిండుకున్నాయి. ఎలాగయినా ఓరాయి ఎత్తు పుల్లలు తెస్తురూ మీకు పుణ్యంవుంటుంది" అంటం వినపడ్డది ఓరోజు. నేను ప్రహారీగోడ నానుకొని ఆడుకొంటూంటే అప్పుడు నావయస్సు ఏడు సంవత్సరాలు!

వెంటనేవెళ్ళి నాలుగుకట్టె పుల్లలు వారి పెరట్లోపడేట్లు విసరాను.

కొద్దిసేపట్లో పెరట్లోకి వెళ్ళినభర్త "ఏమే కట్టెలు పొడిగానే లేవని బాధపెడతావ్రా. నీతో సంసారం చేసేకంటె సన్యాసుల్లో కలవటంమేలు" అంటూ అరచాడు.

ఆశ్చర్యంతో బయటకు వచ్చిన యిల్లాలు "ఆభగవంతుడే కరుణించాడు" అంటూ రెండు చేతులూ జోడించి తూర్పుకు తిరిగి దండంపెట్టింది.

అదిమొదలు నేను కాలేజీ చదువుకు గుంటూరు వెళ్ళేవరకూ నాచేతనైన చిన్నసహాయాలు రెండోకంటికి తెలియకుండా పక్కింటి యిల్లాలికి అందేట్లు చేసేదాన్ని అమ్మానాన్న ఏమన్నా కొనుక్కో మని ఇచ్చిన డబ్బూ, కట్టెపుల్లలూ, బొగ్గులూ, కూరగాయలూ, బెల్లంముక్క ఒకటేమిటి పక్కింట్లోకి వేయటానికి వీలయిన వస్తువులన్నీ ఎవరూలేకుండాచూచి గిరవాటు వేసేదాన్ని.

మాయింటి ఎదురుగా ఇంజనీరుగారు వుండేవారు ఆయనకో జీపూ దానికో డ్రైవరు వుండేవాడు. డ్రైవరూ ఎవరూలేనప్పుడు తనసీటుకింద కొంతడబ్బు దాచుకొనేవాడు. ఓరోజు డాబా పిట్టగోడ కొసనుంచి చూస్తున్ననాకు సీటుకింద డబ్బు దాస్తూండటం కనబడ్డది.

ఆతడు సీటు సరిచేసి బజారులో అటూఇటూ చూశాడు ఎవరూ లేరని రూఢిచేసికొని తృప్తిగా వెళ్ళిపోయాడు. కాని పైకి చూడలేదు. చూస్తే నాతల కొంతయినా కనపడి వుండేది.

ఆరోజే పక్కింటి ఆవిడ ఏమండీ ఈరోజు ఫీజుకట్టకపోతే పిల్లల పేర్లు హాజరుపట్టీలోంచి తీసేస్తారండీ. ఎక్కడకయినా వెళ్ళి ఎలాగయినా పదిరూపాయలు పట్టుకురండి. మన జీవితాలు ఎలాగా వ్యర్థమయిపోయాయి "పిల్లల భవిష్యత్తు చేజేతులా నాశనం చేయకండి" అంటూ ప్రాధేయపడుతూ కంటినీరు పెట్టటం నాకళ్ళారాచూశాను.

అయినా ఆ బద్ధకస్తుడు "డబ్బుడబ్బని అఘోరిస్తావు ఎక్కడ తెచ్చేది ? ఏమైనా చెట్లకు కాస్తాయింటే ? నోరుమూసుకో"అన్నాడు.

ఆమాటవిని ధైర్యంచేసి ఎదురింటికి వెళ్ళి ఆడుకుంటున్నట్లుగా జీపుదగ్గరకు వెళ్ళాను. డ్రైవరు ఆచూకీలేదు. నెమ్మదిగా సీటుకింద చెయ్యిపెట్టి డబ్బుతీశాను.

ఏమీ ఎరుగనట్లూ యింటికి వచ్చాను. గుప్పెటవిప్పి చూస్తే పదిరూపాయలనోటు ?

బహుశా భార్యకు తెలియకుండా సొంత ఖర్చులకు జీపుడ్రైవరు దాచిపెట్టుకొన్న డబ్బు అయివుంటుంది.

ఓన్యూస్ పేపరుముక్కలో గులకరాయిపెట్టి పదిరూపాయలూ వుంచి పక్కింటామెముందు పడేల్లు విసిరి పిట్టగోడ సందులోంచి గమనిస్తున్నా.

ముందు ఆమె విస్తుపోయింది.

కాగితం విప్పిచూచి చాల సంతోషపడిపోయింది. ఆకాశంవైపు నమస్కారం చేసింది.

ఆమె ముఖంలో కన్పించిన వెలుగు నేనింకా మర్చిపోలేను.

మర్రోజు జీపుడ్రైవరు తిరిగివచ్చి సీటుపైకెత్తి చూచుకొని తెగకంగారు పడటం మొదలెట్టాడు !

" ఏమిటిరా అలా వెతుకుతున్నావు జీపంతా " అన్నారు యింజనీరుగారి భార్య.

"ఏమీ లేదమ్మా నిన్న వేరుసెనక్కాయలు తిన్నాను కాంప్‌కి వెళ్ళినపుడు. ఏమైనా సీటుకిందకు జారాయేమోనని వెతుకుతున్నా ! వెధవఎలుకలు తింటానికేమైనా దొరికితే సీటుకొట్టేస్తాయి" అంటూ సర్దేశాడు కాని తన రహస్యం చెప్పలా.

ఆరోజల్లా ఆలీబాబా కొల్లగొట్టివెళ్ళినాక గుహనుచూచి ఉసూరుమనే దొంగలనాయకుడిలా మండిపడుతూనేవున్నాడు డ్రైవరు.

కోరచూపులతో పనిమనిషిని మింగేట్లు చూశాడు నాలుగయిదు రోజులవరకూ !

ఏమయితేనేం పక్కింటి పిల్లలు బడికి వెళ్ళారు !

మాక్లాసులోనే రైల్వేకూలి రంగయ్య కూతురు సుగుణ చదువు తుండేది. నాకు మంచినేస్తం !

ఎవరితోపడితే వారితో స్నేహం చేయకూడదని చెప్పిచూడక పోలేదు మాక్లాస్‌మెట్లూ, కొంతమది టీచర్లూ, నేనుమటుకూ సుగుణతో స్నేహం మానుకోలేకపోయాను !

అప్పటి రోజులకింకా ఫీజుకన్సెషన్లూ, స్కాలర్‌షిప్పులూ రాలా ఉంటే సుగణకు ఏబాధా వుండేదికాదు.

జీతం కట్టకపోతే పేరు తీసివేసేవారు. పలానారోజులోపల జీతం కట్టకపోతే పేరు హాజరుపట్టీలోంచి తీసివేస్తామని కొద్దిరోజుల ముందు నోటీసు పంపుతారు. ఆరోజు అలా నోటీసు వచ్చింది !

గుడ్లునీరు గుడ్డ కుక్కుకుంటూ వెక్కుతూ కూర్చుంది సుగుణ,

అదిచూసి మహాసంతోషపడి పోయింది జలజ. సుగుణకు తనకంటె ఎక్కువ మార్కులు వస్తాయని జలజకు తగనిమంట !

ఇన్నాళ్ళకు తన మనసు కుదుటపడ్డది. సుగుణ యిహ క్లాసుకు రాదు !

ఆరోజు నేను సుగుణను బలవంతంగా మాయింటికి తీసికొని వెళ్ళాను. అలా తీసికొనివెళ్ళటం ఆరోజుల్లో మహాసాహసమే !

అదృష్టంకొద్దీ నాయనమ్మ ఇంట్లోలేదు. నాన్నగారు వరండా లోనే కూర్చొన్నారు.

నేను విషయం చెప్పాను. సుగుణకు ఎలా మంచి మార్కులు వస్తాయో, జీతం కట్టకపోతే ఆమెచదువు ఎలా ఆగిపోతుందో !

నాకు కొంతకాలం కొనుక్కుతింటానికి డబ్బు ఇవ్వవద్దనీ, సుగుణకుమాత్రం జీతం కట్టటానికి డబ్బు యిమ్మనీ అడిగాను.

నాన్న వెంటనే డబ్బుతెచ్చి సుగుణకిచ్చాడు. మరీమరీ దండాలుపెట్టి వెళ్ళింది సుగుణ.

సుగుణ వెళ్ళగానే లేచివచ్చి అమాంతం ఎత్తుకొని ముద్దుపెట్టు కొన్నాడు నన్ను నాన్న.

"నావరాలతల్లి ఏ అదృష్టవంతుడికోసం పుట్టిందో? నిన్ను కట్టుకున్నవాడిదేనమ్మా అదృష్టం అంతా" అన్నాడు.

కాని కొన్ని విపత్తులూ తప్పలేదు.

సభకీర్తి అని ఓటీచరువుండేది చండామార్కులవారి చెల్లెలే అనేవారు, పాఠాలు చెప్పటంలోనూ, క్రమశిక్షణ పాటించటంలోను బహుకఠినంగా వుండేది.

ప్రశ్నకు సమాధానం చెప్పకపోతే బెత్తం దెబ్బలు తప్పవు.

నేను ఎప్పుడూ బెత్తం దెబ్బలు తినవలసిన అవసరం రాలేదు. ఓసారితప్ప.

రోజూలాగే ఆరోజూ ప్రశ్న అడిగింది. నాపక్కనే శిరీష కూర్చొంది. ఏరోజూ ప్రశ్నకు జవాబు చెప్పగల్గేదికాదు. శిరీషకు రోజూ దెబ్బలే.

నాప్రక్కన కూర్చొని బహుదీనంగాచూస్తూ, జవాబుకాయితం మీద వ్రాసిచూపమని చెప్పింది.

శిరీషమీద అమితమయిన జాలి కల్గింది. నోటు బుక్కుమీద జవాబు వ్రాశాను. చదువుకొన్న శిరీషముఖంలో దైన్యంపోయి ధైర్యం చోటుచేసికొంది. కాని మా టీచరువి పాము చెవులు, ఎక్సురే కళ్లు !

"పరీక్షలోకూడా కాపీ అందిస్తావా" అంటూ నన్ను రెండు దెబ్బలు వేసింది అప్పుడుతప్ప ఎప్పుడూ దెబ్బలు తినలేదు బళ్ళో !

ఇంట్లో సరేసరి !

ఎవ్వరూ ఏమనేవారుకాదు.

కాని ఓసారి మాత్రం !

మాఅన్నయ్య హరి చదువుకోకుండా చెడుసావాసాలుపట్టి పాడవుతున్నాడని ఓరోజు నాన్న వాడ్ని చావకొట్టి గదిలో పారేశాడు. అన్నం నీళ్ళుకూడా ఇవ్వకూడదని శాసించాడు.

నాన్నమాట కాదనే ధైర్యం యింట్లో ఎవరికీలేదు. నాన్నకు కోపంవచ్చినప్పుడు నాయనమ్మతోసహా ఎవరూ ఆయన కంటపడరు. అలా ఎన్నిరోజులు హరి అన్నయ్యను అన్నంనీళ్లు లేకుండా వుంచుతాడో అని అందరూ భయపడ్డారు.

మధ్యాహ్నం వేళఅంతా నిద్రలు పోతున్నారు. నేను నెమ్మదిగా వంటింట్లోకివెళ్ళి కొద్దిగా అన్నం పులుసూకలిపి విస్తరో పొట్లాం కట్టి తెచ్చి కిటికీలోంచి అన్నయ్యకు ఇచ్చాను. బొమ్మలాటలోని బుడ్డి చెంబుతో నీళ్ళిచ్చాను గ్లాసు కిటికీలోంచి పట్టకపోతే. ఆ అన్నం కడుపులో పడగానే వాడికి ప్రాణం లేచివచ్చింది.

జాలిగా అడిగాడు "బజారు చివర కిల్లీకొట్టుకువెళ్ళి ఓసిగరెట్టు తీసికొనిరావూ" అని.

అమ్మ కూరలకుంచుకొనే డబ్బుల్లోంచి పదిపైసలు తీసికెళ్ళి సిగరెట్ తెచ్చి కిటికీలోంచి యిస్తున్నాను. అదుగో అప్పుడు నాఖర్మకాలి నాన్నకళ్ళపడ్డాను. ప్రళయకాలరుద్రుడయ్యాడు. దభీ దభీ రెండు గుద్దులు గుద్దాడు. కిక్కురు మనకుండా నిల్చున్న నన్ను చూచి ఆయనకోపం మంచులా కరగిపోయింది.

"ఈజన్మలో నీవంటిమీద చేయివేస్తాననుకోలేదు తల్లీ ! ఆ పాపిష్టివాడివలన నీకు దెబ్బలు తగిలాయి" అంటూ దగ్గరకు తీసికొన్నాడు నాన్న.

మళ్ళీ జన్మలో నాన్న చేతిదెబ్బలు తినలేదు.

అదేమోకాని ఎవరూ నన్ను పల్లెత్తుమాట అనేవారుకాదు ఎక్కడకు వెళ్ళినా !

"మమతవంటి పిల్లలేదు" అనే అనిపించుకొన్నాను. కాలేజీలో కూడా.

కాలేజీవిద్యార్థినిగాకూడా నాజాలిగుణంవలన, కొన్ని సుఖాలూ, దుఃఖాలూకూడా అనుభవించాను వెనుకటి మాదిరిగానే !

ఎం. ఏ. పాసయి ఇంగ్లీషు లెక్చరరుగా కాలేజీలో చేరిన నాకు పెండ్లి సంబంధాలు చూడసాగాడు నాన్న. ఏఅదృష్టవంతుడికోసమో పుట్టాననుకొనే నాన్న పెద్ద ఆస్తిపరుడూ వ్యాపారస్తుడూ అయిన మోహన్ నన్ను పెళ్ళిచేసికొంటానని కొప్పుకోగానే పొంగిపోయాడు.

"మా అమ్మాయి అదృష్టవంతురాలు. కాబోయే అత్తగారు మరీమరీ మెచ్చుకొనివెళ్ళారు మా అమ్మలును" అంటూ వచ్చినవా రందకూ చెప్పసాగాడు నాన్న.

మా కాబోయే అత్తగారు నన్ను చూడటానికి వచ్చినపుడు "అమ్మాయీ నీ గుణవిశేషాలువిన్నాను. నీవు కోడలుగా మాయింటికి రావటం నేను నోచుకొన్న నోముల ఫలం" అంటూ నాచేతులు తన చేతులలోకి తీసికొన్నది.

పక్కనేవున్న అమ్మా, నాన్న, నాయనమ్మ, అన్నయ్య అందరి కళ్లూ చెమర్చాయి.

పెళ్ళి జరిపించాడు నాన్న పెద్ద ఆర్భాటంగా ఏవేమకకూ లోటు రానీయలేదు. ఏ ఖర్చులూ తగ్గించలేదు. ఏలాంఛనాలూ జరగ లేదనిపించలేదు. ఎంతో సంతోషంగా అత్తగారింటికి పంపారు.

ఎన్నో కోర్కెలతో, ఆశలతో అత్తగారియింటిలో అడుగు పెట్టిన నేను తీరని ఆశాభంగమే ఎదుర్కోవలసి వచ్చింది.

మధుర పుష్పఫల భరితసుందర నందనోధ్యానవనంలో విహరించటానికి వెళ్తే కాలనాగు బుసకొడ్తూ వెంటబడ్డట్టు వున్నది నాస్థితి.

ఏమీ దాచకుండా అత్తగారూ అన్నీ వివరించారు. ఇంట్లో

ఏలోపమూ లేదు. ఆస్తిలోనూ, అంతస్తులోనూ, ఏలోటూ లేదు కాని ఆయన బుద్ధికే లోటు.

అత్తగారు చేయని ప్రయత్నంలేదు. పడనిపాట్లులేవు, నాగురించి విన్నతర్వాత నేనైతే తన కొడుకును దారిలోకి తేగలననే మొండి ధైర్యంతో మాపెళ్ళి జరిపించింది.

"నీభర్త ఆస్తి, అంతస్తూ పరువు ప్రతిష్ఠా నీచేతిలో పెడుతున్నా"నంటూ యింటి తాళంచెవులు నాచేతిలో పెట్టింది.

ఇంటికి వచ్చినవారుగాని, ఇంట్లోని నౌకర్లుగాని నాకు చెప్పిన మాటల సారాంశం ఇది.

నాభర్త మోహన్ వ్యసనపరుడూ, అమిత కోపిష్ఠి అని.

మొదటిరాత్రే తెలిసికొన్నాను కరుడుకట్టిన శాడిస్ట్ అని.

శారీరకంగా హింసించడమే కాక శూలాలవంటి మాటలతో మనసు క్రుంగతీస్తాడని.

"ఇది నీకు మొదటిరాత్రేనా? మాట్లాడవేం? కాలేజీలో చదివినపిల్లలు కాలుజారకుండా వుంటారంటే నేనునమ్మను" అంటూ మొదలెట్టాడు.

భయంతోనూ, సిగ్గుతోనూ, అవమానంతోనూ ముడుచుకుపోయిన నన్ను ఒక్కతోపుతోసి వెళ్ళిపోయాడు మోహన్.

ఆయన తోసిన తోపుకు సోఫా అంచుకు వెళ్ళి కొట్టుకుంది నాతల, స్పృహ తప్పింది కొంతసేపు తల దిమ్మరపోయి తెలివి వచ్చాక చూచుకొంటే పెద్ద బొప్పి చేతికి తగిలింది!

శారీరకంగా తగిలిన దెబ్బకంటే మానసికంగా తగిలినగాయం భయంకరమైనది!

తొలిరాత్రి యింత తీయగావుంటే నాభవిష్యజ్జీవితం గురించి ఏమి ఊహించుకోవాలి నేను?

నాగురించి నావాళ్లు పెట్టుకొన్న ఆశలూ, నాభావిజీవితంగూర్చి నేనుకన్న కలలూ యిలా తెల్లారతాయని అనుకొన్నప్పుడు అంతులేని బాధకలిగింది.

అదేమి చిత్రమో నాకు ఎంత దుఃఖంలోనూ కంటివెంట నీరు రాదు. బొళ్ళున ఏడిస్తే కొంత దుఃఖోపశమనం కలుగుతుందేమో ? కాని నాకా అదృష్టంలేదు !

తెల్లవారిన తర్వాత కొడుకు చేసినపని ఊహించి మాఅత్తగారు పడినబాధ యింతింతకాదు.

తనబాధ నేను చూడగూడదని ఆమె, నావ్యధ ఆమె తెలిసికోగూడదని నేనూ బైటపడకుండా జాగర్తపడ్డాము.

తెల్లవారి ఎనిమిది గంటలకు తిరిగివచ్చాడు మోహన్. అలవాటు లేని నాకు ఆయనవద్దనుండి వస్తున్న బ్రాందివాసన వింతఘాటుగావుంది.

ఏమీ ఎరుగనట్లు ఆయనకు కావలసిన విషయాలు పట్టించుకొని, కాఫీ ఫలహారాలు అందించాను. తల్లి, నౌకర్లు చూస్తారనో ఏమో ఏమీ అనలేను. ముభావంగా వుండిపోయారు వున్నకాసేపూ !

మరుసటి రోజునుండి రాత్రిళ్లు గదికే రావటం మానివేశాడు మోహన్. మా అత్తగారి విచారానికి అంతులేదు. ఏదో తప్పుచేసిన దానిలాగా నన్ను తప్పించుకుని తిరుగసాగింది. కదిలిస్తే కన్నీరు మున్నీరుగా విలపించటానికి సిద్ధంగావున్న ఆమెను పలకరించటానికి నాకు ధైర్యం చాలలేదు.

సహజ సిద్ధమైన మొండి ధైర్యంతో మెలగ సాగాను ఇంట్లో.

పనివాళ్లూ, నౌకర్లూ, గుమాస్తాలూకూడా ప్రాణం విడిచేవారు నేనంటే మంచిచెడూ పట్టించుకోని మోహన్ వద్ద ఎన్నాళ్లు పని చేసినా కలుగని ఆనందం ఏదో వారికి నావద్ద లభించేది.

వారి బాగోగులు విచారిస్తూ అవసరమయిన చిన్న చిన్న సహాయాలు చేసినందుకే వారు నన్ను అందలం ఎక్కించి పూజించటం

మొదలెట్టారు. ఇంట్లో అందరూ గౌరవించినకొద్దీ మోహన్ నన్ను బాధించటం ఎక్కువయింది.

"వాళ్ళ కేదో మత్తుచల్లావు. లేకుంటే నీ వెంట అలా ఎందుకు పడిచస్తారు" అనేవాడు. "కాలేజీ చదువు చదివిన టక్కులాడిని చేసుకోవటం అంత బుద్ధితక్కువ మరోటిలేదు" అనేవాడు.

పేరుపేరునా మనిషి మనిషితో నాకు సంబంధం అంటగడితే కాని ఆయనకు తృప్తి కల్గేదికాదు. ఏమన్నా మారుమాట్లాడేదాన్ని కాదు. నామౌనం ఆయనను మరీ రెచ్చగొట్టింది. గొడ్డును బాదినట్లు బాదేవాడు. నేను ఏవిధంగానూ రియాక్టు కాకపోవటంతో మరీ పశువులా ప్రవర్తించేవాడు. క్రమంగా నాకు అనేక విషయాలు తెలిసి వచ్చాయి.

మోహన్ సకల గుణాభిరాముడూ, సప్తవ్యసనపరుడూ అని.

తండ్రి చిన్నప్పుడే పోవటంవల్ల తల్లి గారాబంతో ఏమీ అనలేకపోవటంవల్ల, చేతిలో కావలసినంత డబ్బు మెసలటంవల్ల యిచ్చకాలాడే స్నేహితులతో ఇష్టారాజ్యం భరతుడి పట్నంగా చలాయించుకొని వస్తున్నాడు.

ఇదేవిధంగా సాగితే ఎంతోకాలం ఆస్తి నిలవదూ, బహుశ మనిషికూడా బ్రతుకడేమో!

పెండ్లిఅయితే మారతాడేమోననే వెర్రినమ్మకంతోనూ, ఇతరత్రా నాగురించి ఏర్పరచుకొన్న మంచి అభిప్రాయంతోనూ అత్తగారు అసలు విషయాలు మానాన్నకు తెలియకుండా పెళ్ళిళ్ళ పేరయ్యకు ఘనంగా సంభావన ముట్టచెప్పి జాగ్రత్తపడ్డది. నేనేం చేయాలి ?

అపజయాన్ని ఒప్పుకోటానికి సిద్ధంగాలేనూ నామీదే ఆశలన్నీ పెట్టుకొన్న అత్తగారిని, దేవతలా పూజించే పనివారినీ నిరాశలో ముంచెత్తటం ఇష్టంలేదు.

పరిస్థితులను మార్చలేనపుడు వాటికి లొంగకుండా వుండటం ఉత్తమలక్షణం.

మోహన్‌ను బాగుచేసే ప్రయత్నంలో అపజయాల పరంపర ఎదురయినా ప్రయత్నాన్ని విరమించుకోవటానికి ఇష్టపడలేకపోయాను.

నేను ఎంతఓర్పు చూపితే అంత కఠినంగా శిలలా మారేవాడు. ఎంత లాలనగా దగ్గరకువెళితే అంత పశువులా ప్రవర్తించేవాడు. ఎంతప్రేమగా చూడబోతే అంత పగతో బుసలుకొట్టేవాడు. ఎంత నేర్పుగా ఆయనను మార్చాలని ప్రయత్నిస్తే అంత మాఢ్యంగా మసలుకొనేవాడు.

ఎంత మూర్ఖంగా ఎంత పశుతుల్యంగా మోహన్ ప్రవర్తించినా సహజసిద్ధమైన జాలిగుణం నాలో పెల్లుబికేదికాని కోపంకాని బాధకాని కల్గేదికాదు.

ఎందుకనో ప్రతిరోజూ పగలు కొంతకాలమయినా యింటివద్ద వుండే మోహన్ యీమధ్య ఇంటిచాయలకే రావటం మానేశాడు. నాలుగయిదు రోజులకోసారివచ్చి కావలసిన డబ్బూ, దస్కం, బట్టలూ గిట్టలూ తీసికొని మళ్లీ వెళ్లిపోయేవాడు !

రోజుకొక కొత్తరుచి అనుభవించే మోహన్ ఒక ప్రేయసిని శాశ్వతంగా అట్టిపెట్టుకొన్నాడని చెప్పారు !

ఆమె ఎవరోకాదు ఆఫీసులో పనిచేసే స్టెనో అట.

ఇక నామీద దాడి ఎక్కువయింది. ఒక్కొక్కటీ నానగలన్నీ ఒలుచుకొని తీసికొనివెళ్లి ఆమెకు సమర్పించసాగాడు. వెండి సామానులు క్రమక్రమంగా స్థానభ్రంశం పొందుతున్నాయి. నాచీరెలలో మంచివికూడా ఆమెవద్దకు చేరుతున్నాయి. ఇన్నాళ్లూ అన్నీ సహించిన అత్తగారు ఇక వూరుకోలేకపోయారు. కోపమూ, కన్నీరుకూడా పనిచేయలేదు కొడుకుమీద.

అంతులేని నిర్వేదంతో ఇంట్లోవుండి నరకయాతన అనుభవించ లేనంటూ కాశీలో సత్రంలో వుంటానని బయల్దేరి వెళ్లారు.

వెళ్లేప్పుడు ఆమె పడ్డవ్యధ కార్చినకన్నీరు మర్చిపోలేను. కన్నతల్లి యింటినుండి వెళుతున్నా ఆరోజైనా యింట్లో లేడు మోహన్.

తల్లి వెళ్లిపోయాక సంకోచమనే తాడులో ఆఖరిపోగు తెగిపోయి నట్లు మోహన్ విశృంఖలత ఎక్కువయింది. పనులన్నీ మరీజోరుగా చేయటం మొదలెట్టాడు. తల్లిగది బాగుచేయించి, డబుల్ బెడ్, కొత్త సోఫాసెట్ వేయించాడు.

టెంపరరీ ప్రియురాలిని సరాసరి ఇంటికి తీసికొనివస్తాడనీ అందు కేమాత్రం సమ్మతించినా నాజీవితం నరకమవుతుందనీ మరీ మరీ చెప్పారు అందరూ !

ఇప్పుడు నేననుభవిస్తున్న స్వర్గం ఏమిటి ? ఇంతకంటే హైన్యం యింకా ఏముంటుందిలే అనే నైరాశ్యం హృదయంలో చోటుచేసి కొంది. ఏమయితే అది అయింది అనే మొండి ధైర్యంతో ఉండి పోయాను.

ఆరోజు రానేవచ్చింది. పనివాళ్ళందరూ దిగులుపడుతూ ఇంట్లో వుండిపోయారు. ఇరుగూపొరుగూ వింత చూద్దామని వాకిళ్ళవద్ద నిలబడ్డారు. గదిలోకి వెళ్ళి తలుపువేసికోమని వంటఆమె చెప్తున్న మాటలు నా చెవిన పడలేదు.

శిలాప్రతిమనై చేష్టలుడిగినుల్చొన్నాను. ప్రియురాలితో వచ్చే మోహన్‌ను ఆహ్వానించటానికి !

నాముఖంచూసి కన్నీరు కార్చనివారులేరు ఇంట్లో. ఆవచ్చేశారు! అడుగో మోహన్ పక్కన వన్నెల విసనకర్రతో !

ఇప్పుడుకూడా నాకండ్లనుండి నీరు రాదు.

అది నా జన్మలక్షణం. అదేమిటి ? ఎవరామె ? ఎక్కడో

చూచినట్లుందే ? వింతల్లోకెల్లా వింత ఆమె నా కాళ్ళమీద పడుతున్న దేమిటి ? అక్కా-అంటూ ?

"అక్కా- నన్ను గుర్తుపట్టలేదా ! నేను సుగుణనక్కా ! నే నెంతో పాపాత్మురాలిని ! దేవతలాంటి నీ ఉసురుపోసుకొని సంతోష పడ్డా నిన్నాళ్లూ !

పరిస్థితులకు లొంగిపోయిన నేను ఏపరిస్థితులకూ లొంగని నీ హృదయౌన్నత్యంముందు తలవంచుతున్నాను.

కుక్క- చింపిన విస్తరిలాంటి నా జీవితంకోసం అమృతమయమైన నీజీవితాన్ని నాశనం చేయలేను" అంటూ నేను ఎంతచెప్పినా వినకుండా పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది.

ఏదో మహాద్భుతం జరిగినట్లు మాన్పడిపోయారందరూ.

సుగుణవెంట పరిగెత్తుకొని వెళ్ళిన మోహన్‌కు ఆమె ఏమి చెప్పిందో ఎలాచెప్పిందో తెలియదుకాని ఆరోజునుండి పూర్తిగా మారిపోయాడు మోహన్.

చిన్నప్పుడు నేనుచేసిన మంచి అంతా ఈనాటికి నాకు కలసి వచ్చిందని మనసులో అనుకొన్నా.

# వర్కొహోలిక్

రామయ్యా లోకనాధంగారి ఇంటినుండి పరారైపోయాడన్న వార్త సంచలనం కలిగించింది.

లోకనాధంగారిది మొదటినుండి కలిగిన సంసారం. సిరీ, సంపద కొల్లగావున్న కుటుంబంలో ఒక్కడే సంతు అవటంవలన దేనికిలోటుం డేదికాదు. రామయ్యా తల్లి లోకనాధానికి పింతల్లి. రామయ్యా పుట్టగానే భర్త పోవటంతో వేరేదిక్కులేక అక్కగారింటికి జేరింది. అప్పటినుండి చిన్న పెద్దపని అందుకుంటూ చేదోడువాదోడుగా వుంటూ కంటికి రెప్పలా బిడ్డను సాకుతూ, అక్క ఆస్తిని సంరక్షిస్తూ వుండిపోయింది.

రామయ్యాను చిన్నప్పుడు బడిలోవేస్తే పోయేవాడుకాదు. పశువుల కొట్టంలోనూ, పొలంలోనూ ఎంతపనయినా అవలీలగాచేసి పారేసేవాడు. అతను ఎప్పుడు అన్నం తింటున్నాడో ఎప్పుడు నిద్ర పోతున్నాడో ఎవరూ చూసేవారుకాదు. ఎప్పుడూ పనులు చేస్తూనే కనపడేవాడు ఎవరికైనా !

సాధారణంగా పల్లెటూళ్ళలో కొన్ని నెలలు రైతులు ఖాళీగా వుంటారు ఏపనిలేకుండా. రామయ్యామటుకు పనిలేకుండా వుండేవాడు కాదు. వేసవికాలం పొలంలో గట్లుగనేలు సరిచేసి చేలు చదరం చేసేవాడు. గొడ్లకు తాళ్లునేసేవాడు. సావిడి బాగుచేసేవాడు. మెట్ట పొలం వూరికే వుంచక కూరగాయలు పండించేవాడు. ఒక్కడే నీరు తోడి కూరగాయమళ్ళు తడిపేవాడు. పనిపాటలు చేయటం కాకుండా పొదుపుగా వుండేవాడు. బజారులోకనపడ్డ పేడ పోగేసుకొచ్చేవాడు. చేలలో రాలిన తాటిమట్టలూ కొబ్బరిమట్టలూ ఏరి ఇంటికి తెచ్చేవాడు. చాకిరీకి చాకిరీ పొదుపుకు పొదుపూ చేసే రామయ్యా దొరకటం లోకనాధం అదృష్టమని అంతా అనేవారు. పనిలేకపోతే తోచదు రామయ్యాకు అనేవారు. కొంతమంది కుర్రకారు ఆయనకు పెట్టిన

ముద్దుపోరు వర్కో-హాలిక్. రామయ్యకు పనే వైకుంఠం, పనే కైలాసం పనేముక్తి, రక్తి. పనివుంటే సారాత్రాగిన వాడికంటే హుషారుగా వుండేవాడు. పనేనిషా.

“ఒకవేళ ఖర్మంచాలక ఏరోజైనా పనిలేకపోతే పిచ్చివా డయినా అవుతాడు లేదా చావనైనా చస్తాడురా రామయ్య అనేవాడు వెంకయ్య తాత.

కాని పనిలేకుండా వుండటానికి లోకనాధంగారిది దివాణమంత కొంప, జమీలాంటి ఆస్తి. అందువలన ప్రమాదం ఎప్పుడూ రాలేదు. అదీగాక పనిచేసేవాడున్నాడంటే తప్పించుకుపోవటానికి నవుకర్లకూ, పనివాళ్ళకూ కావలసినన్ని సాకులు.

మొదట్లో లోకనాధం తల్లి రాజమ్మ చెల్లెలి కొడుకును మంద లించాలని చూసింది.

“ఒరేయి అందరిపనులూ నెత్తినవేసుకుని చెయ్యాల్సిన ఖర్మ నీకేమిరా! నువ్విట్లాచేస్తుంటే అంతా పనిఎగ్గొట్టి వెళ్ళతారురా”అనేది.

కాని ఎంతచెప్పినా విననివాడిని ఎవరేం చేస్తారు ?

అదిగాక లోకనాధం మొదటినుండి సోమరి, జల్సారాయుడు. పదేళ్ళప్పుడే తండ్రిపోయాడు. రామయ్య పట్టించుకోకపోతే బండిదొర్లే దెలా! అందువలన రాజమ్మగారు వూరుకోక తప్పలేదు. చీమలు పెట్టిన పుట్టలు పాముల కుపయోగపడ్డట్లు రామయ్య కష్టపడి పోగుచేసిన డబ్బు లోకనాధం జల్సాలకు సరిపోయేది. గిట్టనివాళ్ళు దుర్బోధచేయా లని ప్రయత్నం చేయకపోలేదు. ఎవరేం చెప్పినా రామయ్యలోమార్పు రాలేదు.

తనకిది కావాలని అడిగేవాడుకాదు. మంచిబట్టలు కట్టుకొనే వాడుకాదు. మంచి తిండి కోరేవాడూకాదు,

అదృష్టం లోకనాధానిది అనేవారంతా వయసొచ్చాక సరయిన సంబంధంచూసి ముడెట్టారు రామయ్యకు.

ఎన్ని సంవత్సరాలైనా రామయ్యకు సంతానం కల్గలేదు. అన్న కొడుకు మధునే ఎంతో గారాబంగా చూచుకొనేవాడు.

రామయ్యభార్య సీతమ్మకూడా అతనికి సమవుజ్జీ! ఎప్పుడూ ఆసులోదారంలా తిరుగుతూ పనులు చక్కపెట్టుకునేదేకాని వూరకే వుండేదికాదు. భర్తపొలంలో జాగ్రత్త చేస్తే ఆమె ఇంట్లో పాలు, పెరుగు, నెయ్యి, వెన్న, మజ్జిగఅమ్మి సొమ్ముచేసి తోడికోడలు రాఘవమ్మకు ఇచ్చేది. ఆఖరుకు దొడ్లోపూసిన బంతి, మల్లెపూవులు కూడా జీతగాడ్ని పట్నంపంపి అమ్మించటమో లేక కూరగాయ లమ్మకిచ్చి అమ్మించటమో చేసేది.

చేసిపెట్టే వాడుండాలేకాని సుఖపడటానికేం! రాఘవమ్మ కాలుకదిపేదేకాదు, ఆఖరకు పిల్లవాడు మధునికూడా సీతమ్మకే వదిలేసింది. మధుకూడా కొంత వయసొచ్చి యితరులు చెప్పగాతప్ప అమ్మ నాన్నా సీతమ్మ, రామయ్యలనే అనుకొనేవాడు. తల్లినీ, తండ్రినీ, అక్కయ్య అన్నయ్య అంటూండేవాడు (రామయ్య సీతమ్మ అలా పిలచేవారుకనుక).

మధుని భూమిమీద కాలుపెట్టకుండా పెంచేవారు రామయ్య, సీతమ్మ. అతడు పుట్టి పెద్దవాడవుతున్నకొద్దీ వారి తాపత్రయం కూడా ఎక్కువయింది.

కష్టపడి పోగుచేసినడబ్బు లోకనాధానికి, రాఘవమ్మకూ ఇవ్వకుండా మధుపేరిట ఆస్తులుకొనటం, బంగారు వస్తువులు చేయించటం, దుస్తులూ, ఆటబొమ్మలూ కొనటం మొదలెట్టారు.

మధుకు అయిదారు సంవత్సరాల వయసు వచ్చేసరికి రామయ్య భార్య సీతమ్మ పాండువ్యాధివచ్చి చనిపోయింది. సరయిన వైద్యం చేయించమని ఎంతమందిచెప్పినా డబ్బు ఖర్చవుతుందని వినిపించుకోక నిలువునా ప్రాణాలు తీసుకొంది.

రామయ్యకు మళ్ళీ పెళ్ళి చేయాలని చూశారుకాని ససేమిరా ఒప్పుకోలేదు,

భార్యపోయిన దగ్గరనుండీ ఇంకా దయ్యంపట్టినట్టు పనిచేసేవాడు రామయ్య.

మధుకు పది సంవత్సరాలు వయసు వచ్చేసరికి పక్కవూళ్ళో హైస్కూలుకు పంపవలసివచ్చింది. రామయ్య రోజూ బండికట్టుకొని టిఫిన్ కారియర్ తీసికొని మధును పక్కవూరిబడికి తీసుకెళ్ళేవాడు. బడి వదలినదాకా వుండి మళ్ళీ మధును ఎక్కించుకొని ఇంటికి తీసుకొచ్చేవాడు.

మధు బడిలో వున్నప్పుడు తాను వూరికే వుండేవాడుకాదు. వచ్చేటప్పుడు చేలోపండిన కూరగాయలు, దుంపలూగట్రా తెచ్చి అమ్మి వూళ్ళోవారికి కావలసిన సరకులుకొని బండిమీద వేసుకొని తిరిగివచ్చేవాడు. చేతికి వాచీ లేకపోయినా ఏదో Sixth Sense వున్నట్లుగా బడి వదలే సమయానికి గేటువద్దకు వచ్చేవాడు.

మధు కాలేజీ చదువుకు వచ్చేసరికి దాదాపుగా లోకనాథం పిత్రార్జితం ఎంతఆస్తివుందో అంతఆస్తి పోగుచేశాడు మధుపేరిట.

ఎంత ప్రయత్నంచేసినా మధు డిగ్రీ తెచ్చుకోలేకపోయాడు. ఒక శుభముహూర్తాన చదువుకు నామంపెట్టి ఇంటికి తిరిగొచ్చాడు.

కనిపించినవారంతా రామయ్యను "ఏమయ్యా మధుకు పెండ్లెప్పుడు చేస్తావు! అయినా నీ తాపత్రయానికి తగ్గంత కట్నం తెచ్చేపిల్ల దొరకొద్దంటలే" అనేవారు.

"ఆ మాకున్నది చాలదా! పనీపాటలుచేసికొనే పిల్లయితే వున్నది కాస్త జాగ్రత్త చేసుకొంటుంది" అనేవాడు.

ఆమాట లోకనాథానికి, రాఘవమ్మకూ నచ్చేదికాదు. బోలెడు కట్నం వస్తుందని ఆశపడేవారికి రామయ్య మాటలు రుచించక పోవటంలో ఆశ్చర్యం ఏముంది.

జీవితంలో మొదటిసారి అన్నా వదినలతో వాదంపెట్టుకొన్నాడు రామయ్య. ఉన్నింటి పిల్లయితే అనువుగా వుండక అంతా ఖర్చుచేసి

పారేస్తుంది, లేనింటి పిల్లయితే వున్నది జాగ్రత్తచేసి కూడబెడుతుందని అనేవాడు.

వచ్చే అవకాశం ఎందుకు పోగొట్టుకోవాలి, వాళ్ళంత వాళ్లు ఎగబడివస్తుంటే అనేవాళ్లు రాఘవమ్మా, లోకనాథం.

వాళ్ళ పోట్లాటకు అంతంవుండేదికాదేమోకాని త్వరలోనే పక్కవూరిలో ముత్యంలాంటి పిల్ల, కట్టుకుపోయినంత ఆస్తికి వారసురాలు, శక్తిలా పనిపాటలు చేయనేర్చిన ఉత్సాహవంతురాలు దొరికింది. పేరు జానకి.

పెండ్లి ఎంతో వైభవంగా జరపించారు. రామయ్యతోపాటు లోకనాథం రాఘవమ్మకూడా సంతోషపడ్డారు.

రామయ్యను అందరూకూడా "భలేపని చేశావయ్యా! పనిమంతురాలయిన కోడల్ని తెచ్చుకొన్నా" వనేవారు.

రాఘవమ్మనూ లోకనాథాన్ని "ఐశ్వర్యవంతురాలయిన కోడల్ని సాక్షాత్తు మాలక్ష్మిని తెచ్చుకొన్నా" రనేవారు.

జానకి కాపరానికి వచ్చిన కొద్ది రోజులకే పెద్దల ముగ్గురి సంతోషం చట్టుబండలయింది.

జానకి అమిత జాగ్రత్తకల పిసినారి. వచ్చిన వెంటనే పెత్తనం చేచిక్కించుకొని మామగారికి డబ్బు అందకుండా చేసింది. అత్తగారిని అజమాయిషీలో వుంచుకొంది. వారిద్దరూకూడా (అత్తా మామలు) మొదట్లో గింజుకొని యాగీచేశారు. తప్పక వూరుకొన్నారు.

అసలుచిక్కు వచ్చింది రామయ్యతో.

రామయ్య లేచేసరికి ఇంట్లోను సావిట్లోనూ పనులన్నీ చక్కపెట్టి అతనికంటెముందే పొలాలకు బయల్దేరి వెళ్ళిపోయేది. అన్నిపనులూ చక్కగా చేయించుకొచ్చేది, జానకి వాళ్ళవూళ్ళో ఆడవాళ్లు పొలాలకు

వెళ్ళే అలవాటుంది. ఆమెకు పొలంపనులన్నీ చక్కగా చేయించగల శక్తి వున్నది.

రామయ్య "నేనున్నానుగదా! నీకెందుకమ్మా శ్రమ" అంటే వినేది కాదు.

రామయ్య మొదట్లో కంపరమెత్తినట్లు తిరిగేవాడు తోచక. తర్వాత మరి ఏమయిందో పిచ్చెక్కినట్లు ప్రవర్తించేవాడు. కొద్ది రోజులకే ఎవరికీ ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.

పనిమంతురాలయిన కోడలు కావాలని కోరి తెచ్చికొన్న రామయ్య పనిలేకుండా సోమరతనంగా వుండలేక పారిపోయాడని అందరూ అనుకున్నారు.

# ఆ న వా యి తి

వెర్రిబాగుల వెంకయ్య అయిదోమారు పెండ్లి చేసికొన్నాడు. పెండ్లికూతు రెవరోకాదు శాంత !

మార్కెట్లో సరిగా మధ్యలో కూరగాయలషాపు వెంకయ్యది. ఎగాదిగాతూచి లాభంఎక్కువ వేసుకోకుండానే సరకుఅమ్మే వెంకయ్యకు ఎప్పుడూ నష్టం వచ్చేదికాదు. తల్లీ, తండ్రీపోయి ఒంటరిగావున్నా తెలివి అంతంత మాత్రమే అయినా అతని అదృష్టవిశేషం ఏమిటో నష్టమన్నది జాతకంలో లేదు.

ముప్ఫయిఏండ్లు వచ్చినా నిక్కరూ చొక్కా, ఫ్రెంచి కట్ మీసాలూ, జిబ్బనెత్తి పాచిపండ్లూ, ఎప్పుడూ నవ్వుతూండే మొహం.

పెండ్లి చేసికోవేరా అంటే "ఆఘుడియ రావాలిగా" అనేవాడు కాని వాడికి పెండ్లి అవసరంలేదని అందరు అనుకొనేవారు. చివరకు ఎలాగో సొట్టకాలి సీతమ్మకు తాళికట్టి షాపుకు తెచ్చికొన్నాడు.

సొట్టకాలి సీతమ్మకు పాతికేండ్లకు తక్కువ వుండవు. అంత కాలం ఎవరూ చేసికోకపోవటానికి కారణం ఆమెకు ఆస్తిపాస్తులుకానీ అందచందాలుకానీ లేకపోవటమే.

కాని వెర్రిబాగుల వెంకయ్య పెండ్లిచేసికోగానే షాపుకు కూరలకు వచ్చేవారికి పక్కషాపుల్లో పెండ్లికాని యువకులకు ఆమెలో అందం ఆకర్షణ కనబడసాగాయి.

వెంకయ్యమీద అసూయపడేవారు. వీడికికూడా పెండ్లాం వచ్చిందే అని ! పనివున్నా లేకపోయినా షాపుదగ్గర చేరేవారు. పొరుగింటి పుల్లగూర రుచి అని, వెంకయ్య భార్య అవగానే సామాన్య స్త్రీ అయిన సీతమ్మ అందరకూ గ్లామరస్‌గా కనుపడ సాగింది.

పెండ్లిగాకముందు ముఖంచూడని వారంతా వెంకడి పెండ్లాం

అవగానే వెంటబడటం మొదలెట్టారు. ముందు ఎగతాళిగా, తరువాత ఈర్ష్యగా, తర్వాత నిజంగానే !

"వెంకడ్ని చేసుకోపోతే వేపమొద్దును చేసుకోకపోయావా" అంటూ పరాచికాలు మొదలెట్టేవారు.

"నీకు వేరే మగాడే దొరక్కపోయాడా పెండ్లి చేసుకోటానికి" అని ఉసూరుమనేవారు.

ఎక్సెరే కళ్ళతో ఆమె వళ్ళంతా పరిశీలించి చూసేవారు.

సీతమ్మకు ఇదంతా మొదట విసుగుగానూ ఆతర్వాత తమాషా గానూ అనిపించినా కొంతకాలం అయ్యేసరికి పరాయిమగాడి పొగడ్త వినందే ముద్దదిగని స్థితి వచ్చింది.

ముఖంలో సంతోషం సంతృప్తి వలన కళ వచ్చింది. సొట్టకాలు తిన్ననవలేదు కాని మనిషిలో ఆకర్షణ పెరిగింది.

ఓ మంచిరోజుచూసి పక్కషాపు వీరాస్వామిని తీసుకొని ఉడా యించింది !

మళ్ళీ వంటరివాడయ్యాడు వెంకయ్య ! మళ్ళీ వేళాకోళం మొదలయింది "వెంకయ్యా పెళ్ళెప్పుడు చేసుకొంటావని"

ఎక్కువరోజులు కాకుండానే తూర్పువెళ్ళి నిరుపేద అయిన దూరబ్బంధువుల అమ్మాయి, సామాన్యంగా సంసారపక్షంగా వుండే లక్ష్మిని పెండ్లాడి తీసుకొచ్చాడు.

లక్ష్మి వచ్చినకొత్తలో తలెత్తి చూసేదికాదూ ఎవరితోనయినా మాటాడాలంటే బెదురుతూ చూసేది 'దొంగకోడి' అని పేరుపెట్టేరు షాపుకు వచ్చేవాళ్ళు.

'దొంగకోడి' బెదురు పోవటానికి ఎంతోకాలం పట్టలేదు.

సహజంగా యవ్వనంలో వుందా! కొత్తగా నేర్చుకొన్న అలం కరణతో అందంగా తయారయేది ముఖానికి స్నోలూ పౌడర్లూ

పులిమేది. కండ్లకు కాటుకపెట్టేది. వాలుజడవేసి మల్లెచెండు పెట్టుకొనేది, వాయిల్ చీరకట్టి పూతనగలు సింగారించేది.

అన్నీ అలంకరించుకొని ఇదంతా వ్యర్థమేగదా అన్నట్లు కాంక్షగా కనబడ్డ మగాడినల్లాచూస్తూ కాలంగడిపేది !

అలా ఎక్కువకాలం గడవకముందే గద్దతన్నుకుపోయినట్లు లేవదీసుకుపోయాడు. డోలువాయించే రామాంజయ్య.

మళ్ళీ ఒంటరివాడయ్యాడు వెంకయ్య !

ఇద్దరు భార్యలూ వున్నప్పుడు సంపాదన బాగావున్నదని గ్రహించిన వెంకయ్య యీసారి ఎవరూ చెప్పకుండానే తనంతటతాను పెండ్లి కూతురును వెతుక్కొన్నాడు.

కూరగాయలుమోసే నాగిని పెండ్లి చేసికొన్నాడు ఆమె తండ్రికి మూడువందల రూపాయలు ఇచ్చి.

మంచి యవ్వనంలోవున్న నాగి పెండ్లి అవగానే నాగమ్మ అయింది. పడగవిప్పిన నాగుపాములా మెరిసిపోయింది. వెనకటి భార్యలకంటే అందంగా వుంటుందేమో. వచ్చే కష్టమర్లు ఎన్నోరెట్లు పెరిగారు. నాగమ్మవద్ద ఎంత చనువు తీసుకొనేవారో అంత భయపడేవాడు.

చివరకు కొద్దిరోజుల్లోనే కూరలు కొంటానికి వచ్చే చిల్లరకొట్టు శంకరం, నాగుపామును మెడలోవేసికొన్న శివుడిలా, నాగమ్మను లేవదీసుకువెళ్ళేడు.

నాగమ్మ పెండ్లాడే ముందే అరటిచెట్టుకు తాళికట్టాడు కనుక ఇక అయిదో పెండ్లికి సిద్ధమయాడు వెంకయ్య !

అప్పుడు శాంతను వివాహం చేసికొన్నాడు.

శాంతపుట్టగానే తల్లి చనిపోయింది. తండ్రి మరలా పెళ్ళి చేసుకొన్నాడు. సవతితల్లి చిత్రహింసలూ పెట్టేది. తండ్రి ఏమనేవాడు కాదు. గంపెడుమంది సవతి చెల్లెళ్ళనూ, తమ్ముళ్ళనూ సాకటమే కాక,

ఊరిలో నాలుగిళ్ళలో పాచిపనిచేసి తెచ్చిన అన్నంతో అందరి కడుపులూ నింపాలి.

తండ్రి రిక్షావేయగా వచ్చిన డబ్బుతో మస్తుగా తాగిపడి వుండేవాడు.

తల్లి ఎప్పుడూ ముక్కుతూ, మూలుగుతూ విసుక్కొంటూ కసురుకుంటూ వుండటంతప్ప పూచికపుల్లవార పనిచేయదు !

చుట్టుపక్కల వున్నవారు అయ్యో అనుకోవటమేకాని, తల్లీ తండ్రీ పట్టించుకొనేవారుకాదు శాంతకు పెండ్లి చేయాలని.

ఇల్లే ఎదిగిపోయింది శాంత ! జులాయిగాతిరిగే సవతి మేనమామ వచ్చి ఇంట్లో తిష్టవేశాడు. తమ్ముడికిచ్చి పెండ్లిచేస్తే ఎలావుంటుందో అని ఆలోచించింది సవతితల్లి. వాడికా ఎవరూ పిల్లనివ్వరు ! సవతి కూతురుకు పెండ్లి చేయలేదన్న అపవాదు తప్పుతుంది తనకు. పెండ్లి అయినా ఇంట్లోనేవుండి తనకు వెనకటిమాదిరిగానే ఊడిగం చేస్తుం దామె. తనకు ఏమీ నష్టంలేదు. పైగా తన మంచితనం లోకానికి చాటొచ్చు.

బాగా ఆలోచించి తమ్ముడికి సవతి కూతురునిచ్చి ముడిపెట్టింది.

పెండ్లి చేసిన రోజునే అతిగాతాగి వాంతులయి, రక్తం కక్కుకొని చచ్చాడు శాంతమొగుడు. ఇక శాంత పాట్లెక్కువయ్యాయి! తమ్ముడ్ని పొట్టన పెట్టుకొందంటూ సవతితల్లి పెద్ద అల్లరిచేసింది. అదివరకు సవతి కూతురును మనిషికన్నా హీనంగా చూచేది, ఇప్పుడు మృగం కన్నా హీనంగా చూడసాగింది.

కసుర్లూ, విసుర్లూపోయి దెబ్బలూ తన్నులూ వచ్చాయి.

ఇరుగూ పొరుగూ "యీ తన్నులు తింటూ ఇక్కడే పడివుండక పోతే ఎక్కడికివెళ్ళితే నీకానెడు పొట్టకు పట్టెడు మెతుకులు దొరకవు" అనేవారు.

సమాధానం చెప్పేదికాదు శాంత .

బయటవాళ్ళ సానుభూతి ఎక్కువయింది. కాని యింట్లో నరకం మొదలయింది !

శాంత పనిచేసే యిండ్లలో ఒకయింటిలో వంటపనిచేసే భీముడు, శాంత అంటే అభిమానపడేవాడు. అతనికి శాంతపడే బాధలన్నీ తెలుసు.

ఒకరోజునవచ్చి శాంత సవతితల్లితో ఏంమాట్లాడాడో ఏమో, చేతిలో ఏంపెట్టాడో ఏమో వెంటనే శాంతకు భీముడికీ పెండ్లి జరిపించింది ఆమె.

శాంతను తీసికొనివెళ్ళి వేరుకాపురం పెట్టాలని ఇంటికోసం ప్రయత్నంచేస్తూ పెండ్లి అయిన మరుసటిరోజునే లారీకిందపడి చనిపోయాడు భీముడు.

మళ్ళీ శాంతకు సవతితల్లి చెర తప్పలేదు.

పైగా ఇద్దర్ని పొట్టను పెట్టుకొందని అపవాదు మిగిలింది.

"ఇక నిన్నెవరు పెండ్లిచేసుకొంటారే" అంటూ శాపనార్థాలు పెట్టసాగింది సవతితల్లి !

అదుగో అప్పుడు వెంకడి మూడోభార్య నాగమ్మ శంకరంతో వెళ్ళిపోయిన తర్వాత వెర్రి వెంకడికంట బడింది శాంత. సవతితల్లికి కోరినడబ్బిచ్చి వివాహంచేసికొన్నాడు శాంతను !

వెంకడికది అయిదోపెండ్లి అయితే శాంతకు మూడో పెండ్లి.

ముగ్గురు భార్యలతో కాపురంచేసి బ్రహ్మచారిగావున్న వెంకడికీ యిద్దరు భర్తలచే తాళికట్టించుకొనీ కన్యగానే వున్న శాంతకు జోడీ కుదిరింది.

ఆ యీ ముచ్చట ఎన్నాళ్ళులే అన్నారు అందరూ ! వెంకడు నేడో రేపో చస్తాడుచూడు అన్నారు కొందరు ! శాంతను ఎవడో లేవదీసికొనివెళ్తాడుచూడు అన్నారు మరికొందరు ! అది మామూలేగా!

కాని యీసారి ఆనవాయితీకి విరుద్ధంగా జరిగింది. వెంకడు చావనూలేదు. శాంత వెళ్ళిపోనూలేదు. గంపెడు పిల్లల్నికని ఓపికగా సంసారాన్ని యీదుకు వస్తున్నది !

వెర్రి వెంకడి వెర్రి చాలావరకు కుదిరింది.

ఇప్పుడీతని షాపులో రద్దీ లేకపోయినా గుట్టుగా కాలక్షేపం చేయటానికి తగిన ఆదాయం వస్తూనేవుంది.

శాంత తన పిల్లలతోపాటే సవతి తమ్ముళ్ళనూ చెల్లెళ్ళనూకూడా ఆదరిస్తూ మనిషంటే శాంత అని అనిపించుకొంటున్నది ఆచుట్టు పక్కల !

# మానవతి

"వదినా కస్తూరికి పెండ్లివాళ్లు పంపిన నగలూ చీరాసారా చూశావా" అంది మామేనత్త లక్ష్మీదేవమ్మ కూరలు తరుగుతూ ఆపనేచేస్తున్న మా పెద్దమ్మ నాగరత్నమ్మతో.

"ఆ చూశాలే! అవీ ఓనగలేనా? నాపెండ్లికి మామామగారు యాభై కాసుల బంగారం పెట్టారు. ఇక పెండ్లి అయినాక మీఅన్నగారు నన్నెంత ప్రేమగా చూసుకొనేవారో నీవెరుగనిది కాదుకదా!

గట్టికంటె, నత్తు, నానుతాడు, నాగరం, పాపిటపిండెలు, అర వంకీలు, రాళ్లు రత్నాలు ముత్యాలు గాజులు, వడ్డాణం, పెద్దదండ, ఆణీపాణీముత్యాలహారాలు, మంచి పగడాలదండలు, కాశీకాయగుళ్లు, గవ్వలపట్టెడ, రాళ్ళఅడ్డిగ, రవ్వలపోగులు ఒకటేమిటి ఏడువారాల నగలూ చేయించి అవిపెట్టుకుంటేగాని వూరుకొనేవారుకారు. "ఎప్పుడూ కంచిపట్టుచీరలే కట్టుకో మనకేంలోటు" అనేవారు.

ఆమారాజుపోయాడు వంటిమీద శాస్త్రానికి అరశవిరీఎత్తు వుంగరం వుంచుకొని అన్నీ వొలిచేశా. ఆయనపోయాక నగలు పెట్టుకోవాలంటే వంటిమీద తేళ్లూ, జెర్రులూ పాకినట్టుంటుంది.

ఈపాపిష్టిప్రాణం పోనన్నా పోయిందికాదు. ఏదో శవంలా బతుకుతున్నాననుకో అంది పెద్దమ్మ.

వెంటనే అత్త లక్ష్మీదేవమ్మ అందుకుంది.

"వదినా మీఅన్నయ్య బతికుండగా నన్ను మల్లెపూవుకంటే సున్నితంగా చూసేవారనుకో!

సింహాచలం కొండమీద మాపెళ్లి అయినకొత్తలో ఎక్కబోయినపుడు నాకాళ్లెక్కడ కందిపోతయ్యోనని తన పైపంచె తీసి ముందు పరచి నేను నడచినతర్వాత దాన్ని తీసికొని ముందుకువెళ్ళి పరచేవారు. పైకెళ్లిందాకా అలానే చూశారు.

ఎంతఇదిగా చూసేవారనుకొన్నా ! "ఆయన్ని తలచుకోని రోజు లేదనుకో" అంది.

మాఅక్క పెండ్లిరోజు భోజనాల పందిట్లో పనివుండి వెళ్లిన నాకు వారి సంభాషణ ఆశ్చర్యం కలిగించింది.

కొద్దిసేపట్లోనే మాఅమ్మ కేక వేయటంతో చేస్తున్నపనీ, చెప్పుకొంటున్నకబుర్లూ మాని ఇద్దరూ అవతలికి వెళ్లారు.

మాదూరపు బంధువు పండుముత్తయిదువ వైదేవమ్మగారు కిసుక్కున బోసినవ్వు నవ్వింది.

"ఈముండల ప్రగల్భాలు చూశావటే! సిగ్గన్నాలేకుండా ఎన్ని అబద్ధాలు చెప్పుకుంటున్నారో ! ఇద్దర్నీ మొగుళ్లు కాల్చుకుతినేవారు. ఎవరెరుగని సంబడాలూ !" అంటూ మెటికలు విరిచింది.

"మరెందుకు అట్లా చెప్పుతారు" అంది కొత్తగా పక్కింటి అద్దెకుచేరిన సంపూర్ణ !

"మొగుడు తన్నాడంటే నామోషీకాదటే ! బాగా చూసేవాడంటే నలుగురిలో మహాగౌరవం పెరుగుతుందనుకుంటున్నారు భడవా కుంకలు ! నేను బతికేవున్నాను, విని నవ్విపోతానన్న సిగ్గుకూడా లేకపోయె" అని చేతులు తిప్పింది వైదేవమ్మ.

"అట్టయితే లక్ష్మీదేవమ్మగారి భర్త ఆమెను మల్లెపువ్వులా చూడలేదంటావా" అంది సంపూర్ణ.

"మల్లెపూవులాకాదు విషపుపురుగును విదలించినట్లు విదిలించి పారేసేవాడు. రోజూచీవాట్లూ చెప్పుదెబ్బలే యింట్లో వుంటే ! ఆదెబ్బలు భరించలేక పుట్టింటికి పరిగెత్తేది. మొగుడువెళ్లేక మళ్లీ యింటికి చేరేది."

"ఇంట్లో వుండక ఎక్కడకు వెళ్లేవాడు"

"అదీ నానోటితోనే చెప్పిస్తావూ ! చంచల అని ఓసానివుండేది. అచ్చటాముచ్చటాతీరుస్తూ దానికొంపలోనే పడివుండేవాడు. పంటల

సమయములోనో పనివుంటేనో తప్ప యింటికి వచ్చేవాడుకాదు ! వస్తే యిదీవరస.

ఓరోజున తాగివచ్చాడో ఏమో. చర్నాకోలు పుచ్చుకొని వెంటపడితే వీధులన్నీ తిరిగి మాయింటి మంచంకింద దాక్కుంది.

"భడవ దీనిసిగ్గు ముక్కలవ్వా" అంది వైదేవమ్మ.

"అట్టయితే నాగరత్నమ్మగారి నగలుకూడా అబద్ధమేనా" అంది సంపూర్ణ.

"పచ్చి అబద్ధం! నాగరత్నమ్మ తండ్రి మావూళ్లోకెల్లా షావుకారు. కూతురికి ఏడువారాలనగలు చేయించిపెట్టి మేనల్లుడికిచ్చి ముడిపెట్టాడు.

కాని అల్లుడు పేకాటకూ గుర్రప్పందేలకూ సర్వం జగన్నాథం చేశాడు. ఆఖరుకు పుస్తెకూడా మిగల్చలా! అయినా ఎలా వాగుతుందో చూశావా" అంది వైదేవమ్మ.

"మరయితే భర్తలుండగా వీరు వారిని ఏమీఅనకుండా గుడ్లప్పగించి వూరుకొనేవారా"

"ఎందుకూరుకున్నారు. కావలసినగోలచేసేసి వూరూనాడూ ఏకం చేసేవారు.

ఇంటింటికిపోయి చిలువలుపలువలుచేసి వాడంతా చాటింపు వేసేవారు.

భర్తలుపెట్టే బాధలకు తాముగనుక సహనంతో ఓర్చుగు వస్తున్నామనీ ఇతరులయితే ఎంతో అల్లరి చేసేవారనీ అనేవారుకాని నిజానికి మొగుడుయింటికి రాగానే ముందుగానే రాగాలు మొదలెట్టి అల్లరిచేసేవారు. వీళ్ళ అల్లర్లు భరించలేక చివరకు భర్తలు ఇండ్లకు కూడా వచ్చేవారుకాదు. వస్తూ తన్నులూ తగూలూ !

ఇద్దరికీ ఆఖరి చూపుకూడా దక్కలేదు. నాగరత్నమ్మ మొగుడు క్లబ్బులోనూ. లచ్చిందేవమ్మ మొగుడు సానియింట్లోనూ చచ్చారు.

అదుగో మొగుళ్ళు చచ్చిందగ్గరనుండి మొదలెట్టారీపతివ్రతా వేషాలు !

తమ చరిత్ర తెలిసినవారు లేరనుకొంటే మరీ జోరుగా చెపుతారు, భర్తలు తమతో జరపిన రాసక్రీడలు.

ఎంత నమ్మకంగా చెబుతారంటే కొత్తవారు నమ్మి ముచ్చట పడిపోయేట్లుగా చెబుతారు.

తాము పొందని సుఖాన్ని వైనవైనాలుగా వర్ణించి నోటితీపరం వదల్చుకొంటేకాని వారికి తృప్తివుండదు.

భర్త వుండగా వారు తమను ప్రేమగా చూచేవారని చెప్తే ఎవరూ నమ్మరుకదా !

మొగుడుపోయి ముండమోసినాక భర్త ఆదరంగా చూచే వాడని చెప్పుకుంటే విన్నవారు గౌరవిస్తారని అనుకొంటారు. అలా చెప్పుకోటం గొప్పకోసం మొదలయి యిప్పుడు అలవాటయిపోయింది.

చెప్పగా చెప్పగా అబద్దం నిజమయినట్లూ. పూర్వం ఒక బ్రాహ్మణుడు నల్లమేకను తీసుకొనిపోతుంటే దురూహతో కొందరు దొంగలు దాన్ని కుక్క-కుక్క అన్నారట- నలుగురు మేకను కుక్క అనటంతో ఆ బ్రాహ్మణుడుగూడా కుక్కే-అనుకొని ఆమేకను వదలి పెట్టి వెళ్ళాడట. అలాగే జనం వీరి అబద్ధాలు వినీ వినీ నిజాలనుకొని నమ్ముతున్నారు.

మొట్టమొదట నాబోటిది వింటుందన్న భయం వుండేది! నిండా మునిగినాక చలేమిటని ఇప్పుడు నాఎదురుగానే చెపుతున్నారు పోచి కోలు మాచమ్మలు ! అయినా ఆముండలమాట లెందుకులే సంపూర్ణా, నీవు ఎంతో పెట్టిపుట్టావు. నీభర్త బుద్ధిమంతుడనీ, నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాడనీ విన్నాను" అంది వైదేవమ్మ,

"అయ్యో పిచ్చి మామ్మా! మగాళ్ళల్లో మంచివారుంటా రంటావా నీపిచ్చిగాని. మాఆయన నన్ను ప్రేమగా చూడటానికి

తీరికెక్కడిదీ. ఎప్పుడూ ఆఫీసు ఫైళ్ళే ఓ అచ్చటాలేదు ముచ్చటా లేదు. సినిమాలూలేవు, కార్లూలేవు, జన్మకు ఓమల్లెపూవుకొని ఇంటికి తేడనుకో! పై ఖర్చులకు పైసాచేతిలో పెట్టడు. ఎన్నిబాధలూ పెడుతుంటాడనుకున్నావు పైకిమాత్రం బుద్ధిమంతునిలా కనబడతాడు. నాపాట్లు ఎవరికి తెలుస్తాయి. పైకిచెపితే సంసారం గుట్టురట్టు చేస్తుందంటారమ్మో ముందు మన ఆడవాళ్లే! అందుకే ఎలాగో ఓర్చుకొని వస్తున్నా! ఇంకో తెవరన్నా అయితే ఎప్పుడో విడాకులిచ్చి పారిపోయేది!

ఏమో ఏనాటికి ఆయనబుద్ధి మారుతుందో ఏనాటికి నాఅదృష్టం బాగుపడుతుందో నని సంసారాన్ని యీడుకువస్తున్నా" అంటూ పపిట కొంగుతో కండ్లూ ముక్కు తుడుచుకొంది.

"అట్లాగా అమ్మా! పైకి చెప్పక దుఃఖం కడుపులోనే మింగుకుంటున్నావు కనుక జనం నీభర్త మంచివాడనుకొంటున్నారు. ఇన్నేళ్లు వచ్చినాయిగానాకు. భార్యను సంతోషపెట్టి ప్రేమగాచూసే మగతొత్తు కొడుకుని చూడలానేను ప్రతివాడూ పెళ్ళాన్ని బాధపెట్టేవాడే!

ఒకోడూ ఒకోరకంగా బాధపెడతాడు. బాధలూ, చెరలూ పెట్టటంలో తేడాలేకాని అసలు ప్రేమగా చూసేవారేరీ!

కాకపోతే ఒక్కోతి బయటకు చెప్పుకొంటుంది. మానవతి అయిన నీబోటిది గుట్టుగా వుంచుతుంది" అంది వైదేవమ్మ.

సంపూర్ణ మాటలకు నేనవాక్కయి పోయాను. సంపూర్ణ భర్త ప్రసాదరావు నిజంగా బుద్ధిమంతుడు. చేసేది చిన్నఉద్యోగమయినా. వచ్చేది కొద్దిజీతమయినా, భార్యకు ఏలోటూ లేకుండా ప్రేమానురాగాలతో ముంచెత్తేవాడు. ఏరోజూ పదిపైసలుపెట్టి మల్లెపూదండన్నా తేకుండా యింటికిరాడు. కొత్తసినిమావస్తే మొదటాటకు తీసుకెళ్తాడు. పండుగలకు, తిరనాళ్ళకు పక్కటౌనుకి వెంటేసుకు వెళ్ళేవాడు. వచ్చి కొద్దిరోజులే అయినా భర్త అంటే ప్రసాదరావులా వుండాలి అని బజారంతా అనుకునేట్లు చేశాడు.

కాకపోతే ఆమెకోరే గొంతెమ్మకోర్కెలు తీర్చే తాహతు లేదు !

నిజానికి సంపూర్ణ అతనికి తగినభార్యకాదు. ఎప్పుడూ రుసరుసలాడుతూ రుంజుకొంటూ రాచిరంపాన పెట్టేది.

ఇవేమీ సరకు గొనకుండా భార్యను తన ప్రేమామృతంలో ముంచి ఎత్తేవాడు ప్రసాద్.

మరినేను చూచింది నిజమా, నేను నేడు సంపూర్ణ నోటినుండి విన్నమాటలు నిజమా ?

మా పెదబావ అక్కతో అంటూండేవాడు " ఏమగాడూ భార్యను పూర్తిగా తృప్తిపరచలేడు" అని.

రేపు పెళ్ళయాక నేనుకూడా నాభర్తను గురించి యిలాగే మాట్లాడతానా అనే సంశయం మనసులో పొడసూపి వళ్లు గగుర్పొడిచింది !

# నిరీక్షణ

కాలేజీకి సెలవలివ్వగానే ఉత్తరదేశయాత్రకు బయల్దేరాను కావలసినడబ్బు జేబులోవేసికొని మొదటగా తాజ్‌మహాల్ చూడాలనే కోరిక ప్రబలంగా వుండటంతో ఆగ్రాలో దిగాను.

ఇండియా టూరిస్టు డెవలప్‌మెంటు కార్పొరేషన్ ఐ. టి. డి. సి. వారి బస్సుటికెట్ కోసం క్యూలో నుల్చున్నాను.

నాముందు నుల్చున్న బొమ్మలాటి అమ్మాయి ఎక్కడో చూసి నట్లనిపించింది. క్యూ నెమ్మదిగా కదుల్తోంది, అమ్మాయిని పరిశీల నగా చూడసాగాను. తేనెరంగు వంటిమీద అక్కడక్కడా దోమలు కుట్టినందువల్లో, ఎండవేడిమికో ఎర్రగా పొక్కులున్నాయి, బంగారురంగు జుట్టు పోనీటైల్ రూపంలో అమర్చబడివుంది. సన్నని నడుముమీద ఎదటవారిచూపులు ఫోకస్ చేయించటాని కన్నట్లు పెట్టుకొన్న వెడ ల్పాటి బెల్టు, చర్మాని కతుక్కున్నట్లున్న వెల్వెట్ గౌను, చేతిలో ఎర్రరంగు హాండ్ బాగ్.

ఆ యిప్పుడు గుర్తుకొచ్చింది! ఉదయం ఐ. టి. డి. సి. ఆఫీసు అడ్రసుకోసం హోటలు కౌంటర్ దగ్గర మేనేజరుతో మాట్లాడుతుండగా అక్కడ కౌంటరుమీద బాగ్ ఆనించి ఉత్తరాలకోసం అడుగుతుంది.

"ఏమీ రాలేదు మిస్ సలోమీ" అన్నాడు మేనేజరు.

సలోమీ! ఎంత అందమైనపేరు. అందమైన అమ్మాయికి అందమైనపేరు అనిపించింది ఉదయం!

హిందూనామం కానపుడు పేరు అందమైనదని ఎలా అనగల వంటారేమో వింటానికి అందగావుండటాన్నిబట్టి అందమైనపేరు అని అన్నాను.

ఇకపోతే పాశ్చాత్యుల అమ్మాయి అందం నీవేమి అప్రీషియేట్ చేయగలవంటారేమో!

ఎర్రతోలువుంటేచాలు బుర్రముక్కయిన దొప్పచెవులైనా అందంకిందేవచ్చే మనకు పాశ్చాత్యుల అందాన్ని అప్రీషియేట్ చేయటం కష్టమేమరి! కాని పాశ్చాత్య ప్రమాణాలకైనా, ప్రాచ్యదేశాల లెక్కప్రకారమైనా సలోమీ అందకత్తె అని ఒప్పుకోక తప్పదు.

ఆమె కంఠస్వరం వింటానికి సొంపుగా నరాలను మత్తెక్కిస్తున్నట్లుగా వుంటుంది. ఆమె నడుస్తుంటే నాగుపాము భారంగా కదుల్తున్నట్లుండి మరీమరీ చూడాలనిపిస్తుంది. నీలిరంగు కనుపాపలు అగాధ సముద్రాలను గుర్తుకు తెస్తుంటాయి.

ఆర్చిల్లావున్న ఆమె కనుబొమలు ఎక్కుపెట్టిన మదనుని జోడు ధనుస్సుల్లా వున్నాయి.

ఆమె చెవులు వికసించిన లిల్లీపూవుల్లా వున్నాయి.

లిప్‌స్టిక్ వేసుకోకపోయినా పండిన దొండపండ్లలా వున్నాయి ఆమె పెదవులు.

మేకప్ ఏమీ లేకపోయినా చెక్కుటద్దాలలా వున్నాయి ఆమె బుగ్గలు.

మధురమైన నా ఆలోచనలు భగ్నంచేస్తూ "కెవ్వు" మన్న కేక వినబడ్డది.

ఎవరో పదహారు పదిహేడు సంవత్సరాల కుర్రవాడు సలోమీ హాండ్‌బాగ్ లాక్కుని పరిగెత్తుకు పోతున్నాడు.

వెంటబడి పరిగెత్తాను. ఎక్కడనుండి వచ్చిందో నాకాశక్తి కొద్దిసేపట్లోనే వాడిని పట్టుకొని ఆచెంపా యీచెంపా వాయించి బాగ్ తీసుకొచ్చి 'సలోమీ'కి అప్పచెప్పాను.

"థాంక్స్" అందామె ఒక విధమయిన యాసతో.

అలా మొదలైంది మా పరిచయం. టికెట్ తీసికొని బస్సులో ఎక్కాము. అనేకమంది విదేశస్తులున్నా సలోమీవచ్చి నాపక్కనే కూర్చొంది. ముందుగా ఫతేపూర్ సిక్రీ దిశలో బయల్దేరింది బస్సు.

నిర్మానుష్యమైన రోడ్డు, పొదలు తుప్పలూ, దూరంగా అడవులూ, కొండలూ, రోడ్డుపక్క అక్కడక్కడా మొగలాయిలకాలంలో కట్టించిన చలివేంద్రాలూ, విశ్రాంతి గృహాలు శిథిలమవుదామా వద్దా అని ఆలోచిస్తున్నట్లున్నాయి! ఆఇరవై పాతిక మైళ్ళలో ఎక్కడా జనసమ్మర్దంకలవూళ్లు తగులలేదు. ఎత్తుపల్లాలమీద మెలికలు తిరిగిన రోడ్డుపై దర్జాగా శరవేగంతో సాగిపోతుంది బస్సు.

బస్సులో ఎక్కువభాగం ప్రపంచ నలుమూలలనుండి ఏతెంచిన విదేశీయాత్రికులే! ఉన్నకొద్దిమంది భారతీయులలో ఎక్కువమంది దక్షిణ దేశీయులే.

గైడ్ హుషారుగా ఇంగ్లీషులో అనర్గళంగా చెప్పుకుపోతున్నాడు. ఏదైనా మొగలాయిలనాటి ప్రాచీన కట్టడము కనబడ్డప్పుడు దాని చరిత్ర, ఆ యా ప్రదేశాలలో జరిగిన యుద్ధాలూ చెప్పుకుపోతున్నాడు. యాత్రికులు అడిగిన ప్రశ్నలకు విసుగు చెందకుండా ఒకటి అడిగితే పదివిశేషాలు చెప్పుతున్నాడు.

స్వాగత తోరణాలలాంటి రాతికట్టడాలు దాటి కొద్దిమైళ్ళు వెళ్ళేక ఫతేపూర్‌సిక్రీ కోటదగ్గర ఆగింది బస్సు.

అక్బరుకు సంతులేకపోతే, ఒక ముస్లిం మతగురువు ఆశీర్వాచనం వలన వారసుడు కలిగాడనీ, ఆయనపేరుతో రాజధాని నిర్మించాడనీ చెప్పాడు గైడ్. ఆ మతగురువు సమాధికూడా కోటలో వున్నది.

కోటద్వారం చాలా ఎత్తుగాను పైకిచూస్తే కళ్ళు తిరిగేట్లుగా వుంది. మనదేశంలోని దర్వాజాలలోకెల్ల బులంద్ దర్వాజా అని పిలువడే ఆదర్వాజా ఎత్తయినదట.

దర్వాజా పక్కనే యాత్రికుల నాకర్షిస్తూ యిద్దరు యువకులు ఏమేమో మాట్లాడుతున్నారు. వారు కొద్దిసేపట్లో కోట ఉపరిభాగంలోకి వెళ్ళి అక్కడనుండి గోడపక్కగావున్న దిగుడుబావిలో దూకుతారని చెప్పాడు గైడ్. కొద్దిసేపట్లోనే ఆయువకు లిద్దరూ గోడపైనుండి

దాదాపు వంద అడుగుల పైచిలుకులోతున వున్న నూతి నీటిలో దూకారు. మరునిముషంలోనే పైకివచ్చి మమ్ము డబ్బు అడుగుతూ పోయారు. విదేశస్తులు చాలామంది పదిరూపాయలనోట్లు వేశారు.

అక్బరు కొద్దిసంవత్సరాలకాలమే ఆకోటలో నివసించాడని, నీటి కరువువలన మరల రాజధానిని అక్కడనుండి తరలించాడనీవాడుక. రాజధాని సిక్రీలో వుండగా ఖయిదీలచే నీరు అయిదంచల్లో కోట పైభాగంలోనికి తోడించి అక్కడనుండి పైపులద్వారా కోటలో వివిధ భాగాలలోనికి పంపించేవారట. గైడ్ చెప్పుతున్నమాటలు అర్థంకాక కాబోలు సలోమీ తరచునన్ను గుచ్చిగుచ్చి ప్రశ్నించి అన్నివివరాలూ తెలిసికొన్నది.

లోపల సలీమ్ క్రిస్టీ సమాధి అందంగా అలంకరించబడి ఇప్పటికీ మంచిస్థితిలోవుంది. అక్కడ ఇత్తడి, కంచు, పంచలోహాలతో తయారు చేసిన నగిషీ పనితనం కల పనిముట్లు అమ్ముతున్నారు. అవి కొంటానికి నా సహాయం కావాలని కోరింది సలోమీ. నాణ్యమైన పనితనంతో, కొంతకాలం వుండేటటువంటి వస్తువులను ఎంపికచేశాను.

లోపలకోటలో వివిధబాగాలూ, పంచమహల్, అనే అయిదంత స్తులమేడ, దివానీఆమ్, దివానీఖాస్‌లూ, రాణీవాసపు మేడలూ, అందులో రాజుగారి ప్రియభార్యకు వేసంకాలం భవనం, చలికాలపు భవనం చూపించారు.

కొద్దిసేపట్లో తిరుగుప్రయాణ మయాము.

వెళ్ళేటప్పుడువున్న కుతూహలం తిరుగు ప్రయాణంలో లేదు, గైడ్ తన సీటులో జోగుతున్నాడు. ప్రయాణీకులలో ఎక్కువమంది అస్తవ్యస్తగాపడి నిద్రపోతున్నారు. నాకుకూడా కంటిమీదకు వస్తుంది నిద్ర. బలవంతాన ఆపుకో ప్రయత్నించినా ఆగేట్లులేదు. సలోమీ నిద్ర ఆపుకోవాలని ప్రయత్నిస్తున్నట్లులేదు. నాభుజంమీద తల ఆనించి హాయిగా నిద్రపోతున్నది. కుదుపులకుకూడా నిద్ర లేవటంలేదు.

అనుకున్న దానికంటే త్వరలోనే మళ్ళీ ఆగ్రా తిరిగివచ్చాము. ఆగ్రాకోటవద్ద బస్సు ఆగింది. ఫతేపూర్ సిక్రీకోటకంటే చాలాపెద్దది. ఆగ్రాకోటచుట్టూ కందకం. ఇప్పటికీ కోటలో చాలాభాగంలో మిలటరీ వుంటున్నది. అయిదారుగంటలుకలసి ప్రయాణంచేయటంతో చనువెక్కువయింది. ఏమైనా అడుగవలసి వచ్చినపుడు భుజంమీద తట్టి అడగటం మొదలెట్టింది సలోమీ.

చక్రవర్తిగారి కచేరీ, రాణీవాసపు మేడలూ, రోషనారా జహనారా మందిరాలూ, షాజహాన్‌ను బంధించిన గది, తోటలూ, వాటిలో ఫౌంటెన్‌లూ, జహంగీర్ చలువరాతి సింహాసనం అన్నీ చూశాము. జహంగీర్ సింహాసనంమీద కూర్చొని ఫోటోలు తీయించుకొన్నాము.

అక్కడనుండి బయల్దేరి తాజ్‌మహల్ చేరుకొన్నాము. యమున ఒడ్డున సుందరప్రదేశంలో నిర్మింపబడి ప్రపంచంలోని వింతల్లోకెల్ల వింత అయిన చలువరాతి కట్టడాన్ని చూడబోతున్నప్పుడు మనస్సెంతో తహతహలాడింది.

చుట్టూరా పెద్ద ప్రాకారాలు, ఉద్యానవనాలు, కృత్రిమ సరసులూ ఫౌంటెన్‌లతో తాజ్‌మహల్ ముందుప్రదేశం ఎంతో సుందరంగావుంది. మనసు సౌందర్యంలో తాదాత్మ్యం పొందినట్లు అనుభూతికలిగింది. గేటుదాటిన మేము ఆసౌందర్య రసానుభూతిలో మునిగిపోయి అడుగుముందుకు వేయలేక అచేతనులమైపోయాము. మాతోపాటే వచ్చినవారిస్థితికూడా అలానేవుంది. ఎనభైవ పడిలో పడిన జర్మను వృద్ధ దంపతులు వారి చిరకాలజీవితవాంఛ యీడేరినందుకు కాబోలు ఆనందబాష్పాలు విడుస్తూ ప్రామాన్పడిపోయారు. గైడ్ చెపుతున్న మాటలు ఎవరిచెవికీ ఎక్కలేదు కొంతసేపు. చేష్టలుడిగి శిలాప్రతిమలవలె నిలబడ్డాము. కాలం స్తంభించి పోయింది మాకు కొంతసేపు.

గైడ్ మందలింపుతో ఉలిక్కిపడి అందరం తాజమహల్ వైపు నడిచాముకాని అతను చెపుతున్నమాటలు ఎవరికీ చెవికెక్కటంలేదు. తాజ్ సౌందర్యోపాసనలో కనులవిందు చేసికొంటున్న మాకు మిగిలిన జ్ఞానేంద్రియాలు పనిచేయలేదు.

క్రమంగా తాజ్‌మహల్ లోపలిభాగాలూ, షాజహాన్, ముంతాజ్ మహల్ సమాధులూ, ముఖ్యభవనం నాలుగువైపులవున్న మినార్‌లూ, వెనుకభాగంలో యమునానదీ చూపించారు.

బస్సుబైలుదేరుతున్నట్లు హారన్ వినబడటంతో వెళ్ళలేక వెనుకకు తిరిగిచూస్తూ వెళ్ళి బస్సు ఎక్కాము.

జీవితాదర్శం సఫలమైందనే సంతోషం తాజ్‌మహల్‌ను వదలి వెళ్తున్నామనే బెంగతో పెనవేసికొని మనసుని వింతస్థితిలో వుంచింది!

చీకటిపడేవేళకు హోటల్‌కు చేరుకొన్నాము. మేమున్నహోటల్ తాజ్ అధునాతనమైన పద్ధతులలో కట్టబడివుంది. గేటుపక్కగా చిన్న స్విమ్మింగ్‌పూల్‌వుంది. మేము గేటులోనుండి లోపలకు వస్తుండగా బేతింగ్‌డ్రెస్‌లో ఒక ఏడివయసువ్యక్తి "హాలోబేబీ" అంటూ వచ్చాడు.

"మిస్టర్ మైపా" అంటూ పరిచయం చేసింది సలోమీ.

వారిది అమెరికా సంయుక్త రాష్ట్రాలలో వాషింగ్టన్ దగ్గర ఒక వూరని, తండ్రి సైంటిస్టుఅనీ సెలవులకు ఇండియా చూద్దామని వచ్చామనీ చెప్పింది సలోమీ.

తిరిగితిరిగి వచ్చిన అలుపు ఇప్పుడు తెలుస్తోంది. వంట్లో ప్రతికీలూ సలుపుతూవుంది. స్నానంచేసి లాంజ్‌లోకి వచ్చిన నాకు సలోమి నవ్వుతూ స్వాగతం చెప్పింది.

ఆరోజు పౌర్ణమి. పౌర్ణమి వెన్నెలలో తాజ్‌మహల్‌ను చూడాలని అనుకొన్నాము. ఎక్కడనొప్పి అక్కడ మాయమయి

పోయాయి. సలోమీ నేను బయల్దేరాము. కడుపునొప్పని సలోమీ తండ్రి ఫ్రీజర్ ఆగిపోయాడు.

హోటల్ బయట ఎందుకనో టాక్సీ దొరకలేదు. మా ఉత్సాహంలో మేము తాజ్‌మహల్‌కు మూడుమైళ్ళదూరం నడచి అయినా వెళ్ళేవాళ్ళమేమో కాని ఒకరిక్షావాడువచ్చి మమ్మల్ని ఎక్కించుకున్నాడు. రిక్షా చాలా ఇరుకు. వెన్నెలరాత్రి టాపులేని ఇరుకురిక్షాలో అందమైన అమ్మాయితో తాజ్ మహల్ చూడటానికి వెళ్ళే అదృష్టం పట్టింది నాకు.

మావలెనే వెన్నెలలో తాజ్‌ను చూడాలని వచ్చిన అనేక జంటలతో మేమూకూడా తాజ్ ఎదురుగా కూర్చొని ఆ అద్భుత శోభనుచూస్తూ కాలగమనాన్ని మరచిపోయాము.

మాలా అక్కడ జేరిన అనేక జంటలుకూడా అదేస్థితిలో వుండిపోయారు, చల్లని వెన్నెల్లో చక్కని పిల్లపక్కనవుంటే తాజమహల్‌ను చూస్తూ కాలంగడపుతున్నప్పుడు ఏంఅనుభూతులు కలుగుతాయో చెప్పక్కర్లేదు కదా !

అర్థరాత్రిదాకా తిరిగి బయల్దేరాము హోటల్‌కు. గదికి చేరానన్నమాటేకాని నిద్రపట్టలేదు.

ఉదయంలేచి దుస్తులువేసికొని లాంజ్‌లోకి వచ్చేసరికే సలోమీ రెడీగావుంది. తండ్రి ఇంకా నిద్రలేవలేదని ఆగ్రాలోవున్న ఇతర విశేషాలు చూద్దామనీ బయల్దేరదామని అన్నది. ఆరోజంతా హోటల్‌కు తిరిగిరాకుండా నూర్జహాన్ తండ్రి సమాధి, అక్బరు సమాధి, దయాల్బాగు చూశాము.

చీకటిపడే వేళకు హోటల్ చేరాము. సలోమీ తండ్రిజాడ కనబడలేదు. వాకబుచేయగా ఆరోజంతా భోజనం చేయలేదని సాయంత్రందాకా నిద్రపోయి అప్పుడు లేచి కొద్దిగా బీరు పుచ్చుకొన్నాడనీ బేరర్ చెప్పాడు.

ఆరోజురాత్రి కూడా తాజ్‌మహల్‌ను చూడటానికి వెళ్ళాము.

సలోమీ మనసు అస్తవ్యస్తంగా వున్నట్లు ఆమె ప్రవర్తనవలన తెలుసుకొన్నాను. పరధ్యానంగా వుండటం గమనించి ఏమిటనిఅన్నాను.

"ఏమీలేదు" అని అంది.

అమెరికాలో డేంటిగ్ సర్వసామాన్యం. అందువలన "బాయ్ ఫ్రెండే గుర్తుకు వస్తున్నాడా" అన్నాను.

"లేదు నీవు ఆశ్చర్య పోతావేమో నాకింతవరకు బాయ్‌ఫ్రెండ్స్ లేరు. అమెరికాలోకూడా బాయ్‌ఫ్రెండ్సులేని అమ్మాయిలుంటారు" అంది.

ఒక్కసారి మనసుని కట్టివుంచిన బంధనాలు తెగిపోయినట్లుగా సంతోషపడ్డాను.

ప్రేమాఘాతానికి ఎప్పుడెవరు బలిఅవుతారో చెప్పలేంకదా!

అకస్మాత్తుగాను, అనాలోచితంగానూ అయాచితంగానూ నా నోటినుండి వెలువడ్డాయి "సలోమి ఐలవ్ యూ" అని.

ముఖం పక్కకు తిప్పుకొని మవునమే సమాధానంగా వూరుకొంది. ఆమెనుండి నాప్రేమకు ప్రతిస్పందనను వూహించిన నన్ను ఆమె మౌనం కొంత నిరుత్సాహ పరచింది.

అన్యమనస్కంగావున్న ఆమెను నేను మరల పలుకరించలేదు. మవునంగానే హోటల్ చేరాము.

బేరరు ఎప్పుడో వుంచివెళ్ళిన భోజనం చల్లారిపోయింది. తినబుద్ధి కాలేదు. వేడినీళ్ళస్నానంచేసివచ్చి మంచంమీద వాలేనోలేదో తలుపు మీద దబదబ శబ్దం తలుపుతీయమని సలోమీ గొంతు వినబడ్డాయి.

పరిగెత్తుకువెళ్ళి తలుపుతీశాను. ఒక్కఉదటున లోపలకువచ్చి పడింది సలోమీ వెంటనే తలుపువేసింది. లైటు ఆర్పేయమని సైగ చేసింది. అయిదునిముషాలా స్థితిలోవున్నాక తేరుకొనివచ్చి సోఫాలో

కూర్చొంది. తండ్రి హెరోయిన్‌కు అలవాటుపడ్డాడు. అది దొరకనప్పుడు కూతుర్ని నానాహింసలూ పెడతాడు. ఇవ్వాళకూడా అలాగే అల్లరి మొదలు పెట్టబోయేసరికి పారిపోయివచ్చానంది.

వీపుమీద, తొడలమీద కమిలినమచ్చలు, సిగిరెట్‌తో కాల్చిన మచ్చలు చూపించింది.

నాకు కోపం నసాళానికంటింది. వెంటనే వెళ్ళి వాడి అంతు చూస్తానన్నాను.

"లాభంలేదు ఆయన హెరోయిన్‌కోసం ఏమైనాచేస్తాడు. నీవు ఆయన గదిలోకి వెళ్ళావంటే ప్రాణాలతో తిరిగిరావు. అసలే నీమీద మండిపడుతున్నాడు. ఆలోఫర్ నిన్ను చెడగొడుతున్నాడంటూ" అంది.

"నిన్నా కిరాతకుడిచేతుల్లోకి మళ్ళీపంపను. ఏమైనాసరే నేవు నాతోపాటు మావూరొచ్చేయి. మనం పెళ్ళిచేసికొందాము. నా భార్యగా నిన్ను కాపాడుకోంటానికి నాశాయశక్తులా కృషిచేస్తాను. నీతండ్రేకాదు నరరూపరాక్షసుడే ఎదురువచ్చినా సరకుచేయను" అన్నాను.

"లేదు రఘూ! హెరోయిన్ అలవాటుకోసం ఖూనీ చేయటానికైనా వెనుదీయడు మానాన్న నిన్నూ నన్నూ మీవూరు చేరేలోపల సఫాచేస్తాడు" అంది.

అప్పుడు ఎంతచెప్పినా వినేస్థితిలోలేదని గ్రహించి ఆమెను నిశ్చింతగా నిద్రపొమ్మని ఉదయం లేచినాక తాజాగా ఆలోచించి నిర్ణయానికి వద్దామనీచెప్పి ఆమెను బెడ్‌మీద పడుకోమనీ చెప్పి నేను సోఫా బాల్కనీలోకి లాక్కుని పడుకున్నాను.

ఎంతసేపటికి అటుదొర్లి ఇటుదొర్లి నిద్రపట్టక కొట్టుకులాడాను. దూరంగా నాలుగు గంటలు కొట్టాక నిద్రవచ్చింది కాబోలు తెల్లారి లేచేసరికి పొద్దెక్కింది.

గదిలోకి వెళ్ళిచూస్తే సలోమీజాడలేదు. తలుపులు బార్లగా

తెరిచివున్నాయి. హడావిడిగా సలోమీ గదివైపు పరిగెత్తబోతున్న నాకాళ్ళకు బ్రేకువేసినట్టు ఆగిపోయాను. టేబిల్‌లాంప్‌కిందివున్న వుత్తరాన్ని చూసి.

వణకే చేతులతో వుత్తరం చదువసాగాను.

డియర్ రఘు,

ఈ ఉత్తరం నీవు చదువుకునేసరికి నేను నీకు వూహించటానికి వీలులేని దూరతీరాలలో వుంటాను.

అసలు మనమధ్య జరిగింది ప్రేమకాదని నేనంటే నీవు భరించలేవు. నేనూ మనస్ఫూర్తిగా ఆమాట అనలేను. కాని నేనూ ఫ్రేజర్ కూడా నటులమే. హెరోయిన్‌కోసం ఎంతనాటకాన్నయినా ఆడి రక్తికట్టించగల సమర్థులం.

ఫ్రేజర్ నాతండ్రికాడు. అతను నాకేవిధమైన రక్తసంబంధీకుడూ కూడాకాదు. అతనిదే దేశమోకూడా నాకుతెలియదు. మాఇద్దరి సంబంధం హెరోయిన్. గోవాలో తేలికగా దొరకుతుందని (హెరోయిన్) వచ్చాను ఇండియాకు. అక్కడ హిప్పీకాలనీలో కొద్దికాలం వున్నాను. తెచ్చుకొన్న డబ్బయిపోయింది. అప్పుడు పట్టింది నన్ని శనిగ్రహం. కొద్దికొద్దిగా హెరోయిన్ యిస్తూ అతను చెప్పినట్లల్లా ఆడమనేవాడు. ఫ్రేజర్ తెలివైన బెస్తవాడు. నన్ను ఎరగాచూపి చాలా పెద్దచేపలనే పట్టేవాడు. ఎలా ఆరాతీసేవాడో ఒంటరిగా కనుపించే మగవారిముందుకు తోసేవాడు. విక్టిమ్ ముసలివాడో నడివయసువాడో అయితే నేను ఫ్రేజర్ భార్యగా చలామణి అయేదాన్ని. ముఫైనలభై సంవత్సరాల విక్టిమ్‌కు నేను ఫ్రేజర్ చెల్లిగానూ కుర్రకారుకు ఫ్రేజర్ కూతురుగానూ కనిపించేదాన్ని. ఇదందా నారేటు పెంచటానికి ఫ్రేజర్ వేసే నాటకం. మానసిక శాస్త్రాధ్యయనంలో అతనికి సాటిలేరనుకోవచ్చు !

కొంత పరిచయం పెంచుకొన్నాక ఫ్రేజర్ బారినుండి రక్షించమంటూ విక్టిమ్‌వద్దజేరి కొద్దిరోజులలోనే కావలసిన డబ్బూదస్కం

చేతబుచ్చుకొని పుడాయించేదాన్ని. కాని ఫ్రేజరుకళ్ళు కప్పలేక పోయేదాన్ని.

ఏకాంతంగా కన్పిస్తే పచ్చికామతృష్ణతో "బేబి ఆర్ యు ఆన్ టాబ్స్" (గర్భనిరోధమాత్రలు) అని బాయ్‌ఫ్రెండ్సు అడిగే సంస్కృతిలో పెరిగిన నాకు ప్రపంచం ఏమూలకు వెళ్ళినా దాదాపు అదే మనస్తత్వం ఎదురయింది. ముసలివాడయినా పడుచువాడయినా నాలో కోరుకున్నది ఒకటే పచ్చికామం.

మొదటిసారిగా నాయెడ ఆరాధనాభావం నీలో చూసి షాక్ తిన్నాను. అందరివలె నిన్ను మోసంచెయ్యమని తొందరపెట్టాడు. ఎందుకో నామనసు వ్యతిరేకించింది. నా తాత్సారం ఫ్రేజర్‌లో తొందరపాటునూ ఆగ్రహాన్ని కల్గించింది.

ఎప్పటికథ మళ్ళీ రిపీట్ అయింది. కాని నీవు నన్ను వివాహం చేసికొంటానని అంటంతో నాకు కనువిప్పు కల్గింది. నేను నీకు అర్హురాలనుకాదు, ఏదృష్టితో చూసినా! నాఅలవాటుకోసం ఏపనిఅయినా ఆఖరికి ఖూనీ అయినా చేయించగలవాడి చేతిలో కీలుబొమ్మను. వ్యసనానికి బానిసలమయిన మేము సంఘానికి చీడపురుగులం. కాని మేము జీవించినంతకాలం ఇతరుల రక్తంపీల్చి జీవించ వలసిందే !

కొద్దిరోజులు నీప్రేమను చవిచూసిన నేను నిన్ను మోసం చేయలేను. డబ్బుతీసికొని వెళ్ళకపోతే ఫ్రేజర్ వూరుకోడు. అందువలన నీపర్సులోడబ్బు తీసికు వెళ్ళుతున్నాను.

ఈ వ్యసనంనుండి బయటపడటానికి ఆఖరు ప్రయత్నం చేస్తాను. ఒకవేళ బయటపడ్డానో వచ్చి నిన్ను జేరుకుంటాను. లేదూ నాలాంటి అభాగినులందరకూ పట్టినగతే నాకూ పడుతుంది సెలవు." సలోమీ.

బురదలో మునిగివున్న సరోజంలాంటి సలోమీకోసం నానిరీక్షణ మొదలయింది.

# బ్లాటింగ్ పేపర్

"గురూ మీవూళ్ళో బాగా షైన్ అవుతానని చెప్పావుగదా మరి ఎలావుంది ప్రాక్టీసు ?"

అని అడిగా రాఘవని సిటీకేఫ్‌లో కాఫీతాగుతూ.

ఇద్దరు ఆటవునులో పేరొందిన డాక్టరు వంశీకృష్ణదగ్గర కాంపౌండర్లుగా కలసి పనిచేశాము.

నేను ఇంకా అక్కడే కాంపౌండరుగానే చేస్తున్నాను.

రాఘవ రెండు సంవత్సరాలూ కాంపౌండరుగా చేశాక వాళ్ళ వూరెళ్ళి ప్రాక్టీసు మొదలెట్టాడు.

"అడిగావూ? నాముఖంలావుంది. ఏమని చెప్పమంటావునాపాట్లు. ఇక్కడ సుఖంగా వుండలేక వెళ్ళాను!" అన్నాడు రాఘవ.

"అదేమిటి ! సొంతవూరిలో అందరూ తెలిసినవాళ్ళమధ్య నీకు అడ్డేమిటి ? ఎంతో ఉత్సాహంతోనూ ధైర్యంగానూ ప్రాక్టీసు పెడతానని వెళ్ళావుగదా !" అన్నాను.

"ఆమాటనిజమే ! వెళ్ళేప్పుడు ధైర్యంగానే వెళ్ళాను. అసలు నేను వంశీకృష్ణగారివద్ద కాంపౌండరుగా చేరిందికూడా మావూరిలో ప్రాక్టీసు పెట్టుకోటానికి తగిన అనుభవం సంపాదించుదామనే.

ఏరోగి ఏబాధలతో ఎలా హాస్పటల్‌కు వస్తుంది, డాక్టరుగారు ఏయేపరీక్షలు చేయించారు. ఏయేమందులువాడారు. ఎప్పుడు ఎలా రోగం నయమయింది, లేదా ఎలా కేసు ఫెయిలయింది మొదలగు విషయాలు చాలా జాగ్రత్తగా పరిశీలించాను, నేను కాంపౌండరుగా వున్నన్నాళ్లూ నాశక్తియుక్తులన్నీ వినియోగించి డాక్టరుగారివెంట నీడలాతిరిగి అన్నివిషయాలూ నేర్చుకొన్నాను.

నాకు తెలియనప్పుడల్లా ప్రతివిషయం డాక్టరుగారిని అడిగి తెలిసికొనేవాణ్ణి.

తెలిసికొన్న విషయాలన్నీ యింటికి వెళ్ళాక వివరంగా ఆలోచించుకుని ముఖ్యమయిన విషయాలు విపులంగా నోటుబుక్కులో రాసుకొన్నా ! ఏజబ్బుకు ఏమందులు వాడాలో, ఏంవాడకూడదో. ఏమందుకు రియాక్షను వస్తుందో, అలారియాక్షనువస్తే ఏంచేయాలో అన్నీ విపులంగా పరిశీలించి చూసుకొన్నాను.

ఏది ఆపరేషనుకేసో ఏదికాదో, ఏది ప్రమాదమయినదో, ఏది కాదో అనేవిషయాన్ని ఎలా నిర్ణయించవలెనో కూడా తెలిసికొన్నా.

మందులడోసు లెంతో, ఏమందులు పిల్లలకు వాడవచ్చో, ఏమందులు గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు, వృద్ధులకు ఇవ్వాలో తెలిసికొన్నా.

ఈ వివరాలన్నీ ఎంత పూర్తిగా తెలిసికొన్నానో, పల్లెటూరి నుండి డాక్టర్లు వంశీకృష్ణగారివద్దకు తీసికొనివచ్చిన కేసుల్లో ఎలా పప్పులో కాలు వేసేవారో కూడా అంత వివరంగా తెలిసికొన్నా !

రెండు సంవత్సరాలు గడిచేసరికి నాకు చెప్పలేనంత ధైర్యంవచ్చి మావూరిలో సొంత ప్రాక్టీసు పెట్టుకోవాలని అంతులేని ఆరాటం బయల్దేరింది.

సొంత యిల్లు, వున్న కొద్దిపొలం సొంతంగా చేసికోవచ్చనే ధైర్యంతో నేను ఎంతో అట్టహాసంగా వెళ్ళాను.

పైగా మావూరు మేజరుపంచాయితీ,దాదాపు పదివేల జనాభా, గట్టిరైతు లనేకమంది వున్నారు. వూరిమొత్తానికి కొకడే వైద్యుడు.

అతడా వృద్ధుడయ్యాడు. దాదాపుగా జవసత్వాలు వుడిగిపోయిన స్థితిలోవున్నాడు. నాకు మంచి పిక్ అప్ వస్తుందనుకొన్నా. కాని మనం అనుకొన్నట్లు జరుగుతుందా !

ఎంత అట్టహాసంగా మన డాక్టరుగారిచేత ప్రాక్టీసు ఓపెన్ చేయించాను ! మా ఊరిలోవారిని, పక్కనవున్న పలుకుబడికల రాజకీయనాయకులను ఫంక్షన్‌కు పిలచాను.

దాదాపు పదిరోజులు కాలికి బలపంకట్టుకొన్నట్లు వూరంతా తిరిగితిరిగి అందరనూ ఆహ్వానించి వచ్చాను.

అనవాయితీ ప్రకారం వృత్తిదాయాదిని కోప్రాక్టీషనరు బసవయ్యనుకూడా పిలిచాను.

ఆరోజు బసవయ్య నన్ను సభాముఖంగా దీవించుతూ తాను వృద్ధుడయినందువల్ల ఎక్కువగా శ్రమపడలేకపోతున్నాననీ, అందువల్ల నేను జాగ్రత్తగా ప్రాక్టీసు చేసుకొంటే పైకివస్తాననీ అన్నాడు, నాయకుల మాటలకంటే బసవయ్య మాటలకు పొంగిపోయాను !

ఏమీ లేకుండా పైబట్టతో వూరిలోకివచ్చిన తన్ను ఆదరించి యీరోజు యింతస్థితి కలిగించిన ప్రజలకు ధన్యవాదా లర్పించాడు. సంవత్సరానికి వెయ్యిబస్తాలు ధాన్యం, ఖర్చులకు తగుమాత్రంగా డబ్బు తనకు ముట్టచెబుతూ, యీ జిల్లాలోనే పల్లెటూరి డాక్టరు లందరిలోకి ఎక్కువ ఆదాయం సంపాయించేట్లు చేసిన వూరికీ ప్రజలకూ నమస్కరించి కృతజ్ఞతలు తెలిపాడు బసవయ్య. అతని వినయ విధేయతలకు జనం పొంగిపోయారు.

డాక్టరంటే అట్లావుండాలనీ, చూడగానే ముఖవర్చస్సుకే రోగం తగ్గాలని నయమవాలనీ, ఆయన అడుగుజాడలలో నడచి నేనుకూడా వృద్ధిలోకి రావాలని వచ్చిన నాయకులు తమ ఉపన్యాసాలలో చెప్పారు, చేరిన ప్రజలంతా అలాగే అనుకొన్నారు. నేను నిజమేనేమో నను కొన్నాను !

ఎంత భ్రమపడ్డానో కొద్దిరోజులకే తెలిసింది.

అంత పెద్దవూరా !

తరచుగా ఎవరో ఒకరు ప్రతిరోజూ పరలోకయాత్ర చేస్తూనే వుండేవారు.

అలాఅవబోయే వారిని తనదగ్గరకు తీసికొనివచ్చినా లేక వారిని చూడటానికి రమ్మని చెప్పినా గుండెపోటు వచ్చిందనో రక్తపోటు

వచ్చిందనో చెప్పి నావద్దకు వెళ్ళమనేవాడు. పైగా నేను డాక్టరు వంశీకృష్ణగారివద్ద బాగా తర్ఫీదయ్యానని బాగా వైద్యం చేయగలననీ వారికి చెప్పేవాడు.

వారు వచ్చి నన్ను చుట్టుకొనేవారు !

సొంత ఫ్యూరయినందువలన కొంత మొగమాటంవలన, కొంత అనుభవం లేకపోవటంవలన వాళ్ళు రమ్మనగానే వెళ్ళి చూసేవాణ్ణి.

పరిస్థితి గమనించి లాభంలేదని చెప్పేవాడిని. అయినా అప్పుడు బంధువులు ఆదుర్దాలో "మీ చేతనయిన కృషి చేయండి ఏమయినా ఇంజక్షను చేయండి" అనేవారు.

నేను అమాయకంగా ఇంజక్షను చేసేవాణ్ణి. తర్వాత కొద్ది సేపట్లోనే నేను చెప్పినట్లూ రోగి చచ్చేవాడు !

నేను ముందే చెప్పానుగదా అనేవాడిని, కాని నేను వైద్య శాస్త్రం ఎంత నేర్చుకొన్నా లోకానుభవంలో బసవయ్యకు ఏమాత్రం సరితూగనని తెలిసికొన్నాను.

అతను కావాలనే చచ్చే కేసులన్నీ నావద్దకు వెళ్లేట్లు చేసేవాడు.

ఇకచూసుకోండి కావలసినంత ప్రచారం ! నాహస్తవాసి మంచిదికాదని, నేను చేయివేస్తే రోగి బుగ్గిగా మిగులుతాడనీ, నా హాస్పటల్ముందు కట్టెలదుకాణం తెరచినవాడు బాగుపడతాడనీ, నాచేతి మాత్ర వైకుంఠ యాత్రనీ, బజారు బజారులోనూ మోగి పోయింది.

బసవయ్య బయటపడకుండా తన మనుషులచేత తెలివిగా యిలా ప్రచారం చేయించాడన్నమాట. నాపని అధ్వాన్నంగా తయారయిందనుకో !" అన్నాడు రాఘవ.

సరే హోటలునుండి వచ్చి ఎవరిదారినవాళ్ళం వెళ్ళాము.

డా॥ వంశీకృష్ణగారివద్ద పనిచేసిన కాంపౌండర్లలో రాఘవ

చాకులాంటివాడు. ఎంతో కష్టపడి డాక్టరుగారి దగ్గర వైద్యశాస్త్రంలో సుళువులన్నీ నేర్చుకొన్నాడు.

మరి వాడే సొంతవూరికి వెళ్ళి సొంతవైద్యం మొదలెట్టి రాణించ లేకపోతే నాబోటివాడు వెళ్ళి ఏంచేయగలడు ?

కాంపౌండర్లుగా చేరిన ప్రతిఒక్కరం ఎప్పటికైనా సొంతవైద్యం చేయాలనే కోరికతోనే చేరతాము. కాని సొంతవైద్యమంటేమాటలా? హంగు, ఆర్భాటం వుండాలి. పదిమందినీ కూడగట్టగలనేర్పు వుండాలి. అంతకుముందు ఊరిలో పాతుకుపోయిన వైద్యులదెబ్బ తట్టుకోగలిగి వుండాలి ! అన్నిటిలోకీ అఖరు విషయమే కొరకరాని కొయ్య.

వేళ్ళూని పాతుకుపోయిన వటవృక్షంలా తరతరాలుగా వైద్యులుగా నిలబడినవారిని ఢీకొనటం అంటే కొండను గొర్రెపిల్ల ఢీకొన్నట్లే!

ఊరిలో ప్రజాబాహుళ్యంతో విశేషసంబంధాలుండి ఇతర వృత్తుల్లో వున్నవారు వైద్యంకూడా చేయటం ఆనవాయితీగా వస్తూంటుంది. గుళ్ళో పూజారులో, దాసరులో, వైద్యం చేయడం చాలా ఊళ్ళల్లో వుంది.

కొత్తగా వచ్చినవారికి ప్రజలతో అలా మెలగాలంటే చాలా కాలం పడుతుంది.

వేళాపాళా లేకుండా పిలువగానే పరిగెత్తాలి. డబ్బు యిచ్చినా, ఇవ్వకపోయినా సర్దుకుపోయినా సర్దుకుపోవాలి. రోగిని అక్కా అనో బావాఅనో పిన్నీఅనో మామాఅనో వరసలుపెట్టి పిలవాలి.

డబ్బు ముట్టనిచోట్ల తెలివిగా వస్తురూపంలోనో, ధాన్యం రూపంలోనో, ఇతరంగా ఏదివస్తేఅది రాబట్టుకుంటూ వుండాలి. అలా స్థిరపడిపోతే తరువాత జనాల్ని ఒకాటాడించవచ్చు. ప్రజలుపెట్టిన పరీక్షలో నెగ్గితే కల్పవృక్షంనీడలో కుర్చీవేసుకొని కూర్చున్నట్లే. ఆడిందిఆట పాడిందిపాట. డబ్బుకుడబ్బూ, పేరుకు పేరూ. రాజకీయాలు

చెప్పటానికి, రాజీలు చేయటానికి, పెళ్ళిళ్ళు కుదర్చటానికి దేనికైనా తగిన సమర్థత వస్తుంది.

ఒకనాడు డా॥ వంశీకృష్ణగారికి చూపుదామని ఓరోగిని తీసుకు వచ్చినప్పుడు కనబడ్డాడు రాఘవ. మనిషిలో క్రితంసారివున్న నిరుత్సాహం, బేలతనంపోయి, హుషారుగా వున్నాడు.

రోగిని డాక్టరుగారికి చూపించి పంపించి "కాఫీకి వెళ్దాంరారా" అంటూ పిలచాడు.

సిటీకేఫ్‌లో టిఫిన్‌కు ఆర్డరిచ్చాక "ఏరా ఎలావుంది వైద్యం" అన్నాను.

చిఱునవ్వు చిందిస్తూ ఉత్సాహాన్ని ఒలకపోస్తూ అన్నాడు రాఘవ. "ఇన్నాళ్ళకు బసవయ్య కవచానికి బొక్క పెట్టాను.

ముసలిహీరోకు జంటగా వేయటానికి తరచు పడుచు హీరోయిన్లను మార్చినట్లు బసవయ్య తరచూ తనదగ్గరుండే కుర్రనర్సులను మారుస్తుండేవాడు.

సగంజనం అతనివద్దకు నర్సుతో మాట్లాడడానికో. లేక ఆమెచేత కట్లుకట్టించుకోవాలనో వెళుతూ వుండేవాళ్లు.

పుణ్యమూ, పురషార్థమూ అని నర్సులు అటుపనీచేసేవారు ఇటు జనాన్ని ఆకర్షించేవారు.

కాని లావణ్యావిషయం వచ్చేసరికి ముసలాడికీ తెగులు పుట్టింది. తన ఎరకు తానే చిక్కుకున్న వేటగాడిలా, లావణ్యా దాసుడయ్యాడు. ఆమెలేనిదే బతకలేను అన్నట్లు తయారయ్యాడు. మావూరిలోని మోతుబరిరైతులతో సావాసం కట్టింది మొదట్లో లావణ్య! కాని కొంతకాలానికి ముసలాడే ప్రేమికుడుగా మారాడు. అందరినీ సమానంగా ఆదరించేది మొదట్లో.

కాని రానురాను ముసలివాడివద్దకు రావాలంటే ఏవగించుకొనేది క్రమంగా బసవయ్యకు దూరంఅయింది. అయినా చేరువ కావాలని బసవయ్య ఆరాటం.

అతనువేసే పిచ్చివేషాలుచూసి మరీ దూరంకాజొచ్చింది. లావణ్య. భార్యలేని బసవయ్య వేసేవేషాలకు బసవయ్య తనతో ఆడే సరసపల్లాపాలకు సహించలేక పోయింది లావణ్య. కాని ముసలాడి యావ పెరిగిపోయింది.

తన దగ్గరకు వచ్చే యువకులతో లావణ్య చనువుగా మాట్లాడటం, పకపకానవ్వటం, వికవికావికారపు చేష్టలుచేయటం వెనుకటి రోజులలోలా సహించలేకపోయాడు బసవయ్య.

మావూరి ప్రెసిడెంటుగారి అబ్బాయితో సినిమాలకు, షికార్లకూ బయల్దేరేది లావణ్య.

ఇలా అయితే చేజారిపోతుందనుకొన్నాడో ఏమో, భార్య పోయి ఎన్ని సంవత్సరాలయిందో మర్చిపోయిన బసవయ్య లావణ్యను పెళ్ళి చేసికొంటానంటూ వేధించటం మొదలెట్టాడు.

న్యాయంగా లావణ్యవంటిదానికి బసవయ్యను పెండ్లాడితే ఆస్తి, అంతస్తూ వచ్చేవే. బసవయ్య చాలా డబ్బు సంపాదించి, వూరిలో ఆస్తిని ఏర్పరచుకొంటే ప్రజలదృష్టి పడుతుందని దూరంగా పట్టణంలో ఇళ్లూ, మైసూరు ప్రాంతంలో పొలాలూ ఏర్పరచుకొన్నాడు, ఎట్టాలేదన్నా కొన్నిలక్షల విలువచేసే ఆస్తి ఉంది.

ముసలాడిని వివాహమాడితే వాడుచస్తే వెంటనే ఆస్తి చేతిలోకి వస్తుంది.

కాని ఊరిలో ఐశ్వర్యవంతు లందరూ తన పాదాక్రాంతులవుతున్నప్పుడు బసవయ్య ఐశ్వర్యానికి లోబడుతుందా !

పైగా చూసిచూసి బసవయ్య ముసలి అవతారం ఆమెకు జుగుప్స కలిగించింది. మంచిగా చెప్పిచూచింది తనకు ఇష్టంలేదని. కాని బసవయ్య ఆమె ఇష్టంలేదన్నకొద్దీ ప్రాధేయపడటం. ప్రలోభపెట్టటం ఎక్కువచేయసాగాడు.

ఇక భరించలేక లావణ్య, బసవయ్యవద్ద నర్సుగా పని మాని వేసి నావద్ద చేరింది. బసవయ్యదశ తిరిగిపోయింది,

జనులందరూ తిరనాళ్ళలో పానకంకోసం ఎగబడ్డట్టు నా హాస్పటల్ కు రావటం మొదలెట్టారు. దాదాపుగా ఊరిలో ముప్పాతికవంతు నావద్దకే వస్తున్నారు వైద్యానికి !

పైగా బసవయ్యవద్ద పొందిన తర్ఫీదుతో లావణ్య చాలా విషయాలలో ఆరితేరివుంది.

ధనిక యువకులకు ఏదోరోగం వచ్చినప్పుడు మార్ఫియా ఇంజక్షనులుచేసి వారికి అవిలేనిదే బతుకలేరు అన్నట్లు తయారుచేసి వదిలాడు బసవయ్య. మార్ఫియాకోసం ఎక్కడెక్కడిడబ్బూ తెచ్చి ఇచ్చేవారు బసవయ్యకు. ఇంజక్షను దొరకటంలేదనీచెప్పి పెద్దమొత్తాలు గుంజేవాడు వాళ్ళదగ్గర బసవయ్య.

ఆకాతాలన్నీ లావణ్య వెంట నావద్దకే వచ్చాయి.

పెండ్లి కావలసిన యువతులు, పెండ్లి అయినాకూడా అప్పుడే పిల్లలు కలుగగూడదని అనుకొనే యువతులూ, చడీచప్పుడూ లేకుండా మూడోకంటికి తెలియకుండా బసవయ్యవద్ద గర్భస్రావం చేయించుకొనేవారు. ఆ విషయంలో ఎక్కడ తర్ఫీదు పొందాడో గాని బహుదిట్ట.

ఆరకం కేసులూ లావణ్య వుందని నావద్దకే రావటం మొదలయాయి.

దొంగనోట్లుతో పెద్దవాడయిన షావుకారూ, రైసుమిల్లులో లక్షలార్జించిన వ్యాపారీ, రాజకీయాలలో తిరిగి సొమ్ము చేసికొన్న ప్రెసిడెంటూ, వారూవీరేమిటి డబ్బున్న ప్రతిమగాడూ వైద్యం చేయించుకోవాలంటే నావద్దకే వస్తున్నారు. ఇప్పుడు చావబోయే కేసులేవీ నావద్దకు రావటంలేదు. అట్లాంటివారందరినీ ఏదో నెపంమీద బసవయ్యగారి దగ్గరకే పంపుతోంది లావణ్య.

బసవయ్యకు పెద్దతనం వలన మతి సరిగావుండక వైద్యం సరిగా చేయటంలేదనీ, అందువలనే ఆయనవద్దకు వెళ్ళిన కేసులేవీ బతికి బట్ట కట్టటంలేదనీ ప్రచారం మొదలెట్టింది లావణ్య.

అందమైనవారు మొదలెటితే అబద్ధప్రచారమే నిజమవుతుందని నాకు తెలిసివచ్చింది.

ఇలాగేవుంటే "కొద్దిరోజులలోనే ముసలాడు ఊరువదలి వెళతాడు చూస్తుండు" అన్నాడు రాఘవ.

అనుకొన్నది సాధించాలనే గర్వం వాడిముఖంలో స్పష్టంగా కనపడుతుంది.

బసవయ్య మందుల చీటీకి బ్లాటింగ్ పేపరులాంటి లావణ్య ఆయన పద్ధతులన్నీ ఉపయోగించి గురువుగారినే చిత్తుచేసింది !

ఏమయితేనేం రాఘవది అదృష్టం !



# చెదపురుగులు

రాకెట్ మేడ, ఆవరణ అతిథులతో కిటకిటలాడుతుంది. దశావతారం పెంపుడు పుత్రిక, చెల్లెలి కూతురు, మాలిని పుట్టినరోజు పండుగ వేడుకలకు భవనం మారుమ్రోగుతుంది. అందంగా అలంకరించివుంది. ఆర్-డి-ఒ గారు ఆర్భాటంగా ఆఫీసుజీపులో దిగారు. మునిసిపల్ కమీషనరుగారు ముచ్చటగావచ్చారు. డి-వై-యస్-పి గారు దర్జాగా అడుగు పెట్టారు. ఎం-ఎల్-ఏ గారు వెంట పరివారంతో సహా తరలివచ్చారు ఊరిలో పెద్దతలకాయలన్నీ అక్కడే లెక్కెట్టొచ్చు.

అవడానికది వూరిలో పెద్దమేడయినా యిప్పుడు కిక్కిరిసిపోయింది అతిథులతో. ఆహ్వానితులు, ఆహ్వానితులు కానివారూ కూడా పక్కపక్కనే కూర్చొన్నారు. మేడబయట ఆవరణలో కూడా షామియానాలు వేసి కుర్చీలు వేశారు. ఆకుర్చీలు చాలలేదు. గేటు బయట జేరిన జనానికీ కొదవలేదు. వీధిచివర తీసివేసిన విస్తళ్ళకోసం వచ్చినవారికీ కొదవలేదు.

ఏపనిచేసినా దర్జాగా చేస్తాడు దశావతారం. కట్టుకుపోయినంత ఆస్తి సంపాదించినా సంతానం లేదు. అందుకే చెల్లిలి కూతురు మాలినిని పెంచుకుంటున్నాడు.

మాలిని అచ్చటాముచ్చటా తీరుస్తుండేవాడు. ఏంచేసినా పెళ్ళిలా ఫెళ్ళున చేస్తాడు.

అసలాతను మొదట్లో గర్భదరిద్రుడు. నిత్యం రెక్కాడితేగాని డొక్కనిండేదికాదు.

అదిగో మాలినిని చేరదీశాడు, లక్ష్మీదగ్గర చేరింది.

చిన్న వ్యాపారం మొదలెట్టాడు మొదట్లో అచిరకాలంలోనే అభివృద్ధి చెందింది వ్యాపారం. ఈలోగా కోయంబత్తూరువారితో మాట్లాడి అవూరిలోని రాజకీయ నాయకుడు కొన్ని దొంగనోట్లను

తెప్పించాడు. రెండురూపాయలనోట్లు మాత్రం నమ్మిన బంటులా వుండే అవతారాని కందించాడు.

దానాదీనా ఇద్దరూ బాగుపడ్డారు.

ఒకసారి లక్షపోగవటమేకష్టం, ఆతర్వాత కోటీశ్వరుడవటం అంత కష్టంకాదు. లక్షాధికారి అయిన అవతారం కోటీశ్వరుడవటాని కెంతోకాలం పట్టలేదు. షాపులూ, హోటళ్లూ తెరిచాడు. టాక్సీలూ, లారీలూ తిప్పాడు. బ్రాకెట్ కంపెనీ, పేకాటక్లబ్బు ఏర్పాటు చేశాడు.

పెద్దపెద్ద పట్టణాలలో ధరలు పెరుగుతాయనుకొన్న-చోట స్థలాలుకొన్నాడు.

కాలువలు తవ్వుతూ త్వరలో సాగులోకి వస్తాయనుకొన్న భూములు చవకగా కొన్నాడు. అతనుకొన్నవన్నీ ధరలుపెరిగి ఎంతో లాభాన్ని తెచ్చిపెట్టాయి. పట్టింది బంగారమయింది.

ఇదంతా మాలిని ఇంటికొచ్చిన వేళావిశేషం అని అందరూ అన్నారు. అవతారమూ అనుకొన్నాడు. అందుకే మాలినిని భూమి మీద నడవనీయడు.

ఏమాత్రం దానికైనా పెద్దవేడుకచేసి వూరందరినీ పిలవటం, అంతా రావటం ఆర్భాటం చేయటం తరచుగా జరుగుతూ వున్నదే !

డబ్బువచ్చినకొద్దీ మనిషి పెరిగాడు. వేషం, భాష, ప్రవర్తన, నడవడీ అన్నీ మారాయి అందుకు తగినట్లుగానే ! పరువూ, మర్యాద, మన్నన, పరపతీ, పలుకుబడి పెరిగాయి. పెద్దలతో స్నేహాలూ ఎక్కు-వయాయి. ఆఫీసర్లందరితో అంతరంగికంగా మసలేవాడు.

అవతారం పేరుచెబితేచాలు ఏపనయినా జరిగిపోయేది ఆవూళ్లో.

మాలిని పద్ధెనిమిదవ పుట్టినరోజువేడుక జరుపుతున్నాడు అవతారం ఆరోజు. వచ్చిన చిన్నాపెద్దా, వారి తహతుకుతగ్గట్టు కానుకలు తెచ్చారు.

మాలినికండ్లు వచ్చినవారిని వారి బంధువులనూ చూడకుండా గేటువైపుగా కేంద్రీకృతమయ్యాయి.

కాలేజీలో బి. యే. చదువుతున్న ఆమె తన సహాధ్యాయి రాముకు మనసిచ్చింది. అతనిని తప్పక రమ్మని మరీమరీ పిలచింది. అతని రాకకోసమే మరలామరలా చూస్తోంది, చూసిచూసి విసుగెత్తి పోయిన ఆమెకన్నులలో నిరాశ నిండుగా చోటుచేసికొంది.

రాము ఒకవేళ రాడేమో అనే శంక మనసులో పీడించసాగింది. కాని తప్పక వస్తాడని మళ్ళీమళ్ళీ అనుకొంటూ కుదటపరచుకో చూస్తుంది మనసును. మాలిని కళ్ళొకసారి తళుక్కుమని మెరిశాయి ఆనందంతో ! కాని అదేమిటీ మామగారి గుమాస్తా అలా తరిమేస్తు న్నాడు రామును. పరిగెత్తుకెళ్ళి రామూని చేయిపుచ్చుకొని తీసికొని వచ్చి మామయ్యకు పరిచయం చేద్దామని కదలబోయింది. ఇంతలో "అమ్మాయీ కలెక్టరుగారి భార్యగారు వచ్చారు"అంటూ మామయ్య అడ్డువచ్చాడు.

ఆమెకు తగిన మర్యాదచేసి గేటువద్దకు వెళ్ళేసరికి ఏముంది రాముజాడలేదు. మంచిబట్టలు వేసికొనిరాని రాముని గుమాస్తా తరిమి కొట్టాడు. రానని మరీమరీ అంటున్న రాముని ఎంతో బలవంతంచేయగా వచ్చిన తన రాముని క్షణంలో వెళ్ళగొట్టాడు గుమాస్తా రాఘవయ్య.

"రాఘవయ్యగారూ ! ఇప్పుడు మీతో మాట్లాడుతున్న తెల్ల చొక్కా పైజమా వేసికొన్న ఆయన ఏమయ్యాడూ" అన్నది.

"వాడా, లోఫర్ ముండాకొడుకు జానకి కొడుకేనా ? వాడిని ఇంట్లోకిరానిస్తే మనపరువు పోతుంది. అందుకే కసిరి వెళ్ళగొట్టాను" అన్నాడు రాఘవయ్య.

హైవోల్టు కరెంటుషాకు కొట్టినట్లు నరాలన్నీ గిజగిజ కొట్టు కొన్నాయి. రాము భయపడుతున్నట్లే జరిగింది. తమ అంతస్తులలోని భేదాలు తమను దగ్గరజేరనీయవని రాము ఎప్పుడూ అంటాడు.

అటువంటిదేమీ వుండదని, మామయ్యా తనను ప్రాణంకంటె మిన్నగా చూచుకొంటాడనీ, తన ఇష్టప్రకారంతప్ప ఇంట్లో చీమైనా కదలదని ఎంతగానో చెప్పి యీరోజు పార్టీకి రావటానికి ఒప్పించింది.

గేటుదగ్గర తానుండక పోవడం పొరపాటనిపించింది మాలినికి. చేతులు కాలాక ఆకులుపట్టుకొంటే వుపయోగం ఏముంటుంది. రాము మనసెంతో క్షోభపడుతుంది. పిలిచి అవమానం జరిపించాననుకోడు కదా. మాలిని మనసు మనసుగాలేదు. యాంత్రికంగా పుట్టినరోజు పండుగ వేడుకలలో పాల్గొంది. ఎలాగో కొవ్వొత్తులను ఆర్పి, కేక్ కట్ చేశాననిపించుకొంది. వచ్చిన అతిథు లందరూ ఒక్కొక్కరే వెళ్ళి పోయారు.

అంత పెద్ద భవనం ఎలా తెలాపోయింది.

డబ్బొచ్చాక మామయ్యా ఈఊరిలోకెల్లా పెద్దమేడను వేలంలో కొన్నాడు. తర్వాత మేడను నాలుగువైపులా పెంచాడు. పై అంతస్తులో రాకెట్ ఆకారంలో గది కట్టించాడు. ఏమీ తోచనపుడు వెళ్ళి ఆగదిలో కూర్చోటం అలవాటు మాలినికి. ఈవాళ అలాగే చేసింది.

ఆగదిలో కూర్చొంటే దాదాపుగా ఊరంతా కనపడుతుంది. దూరంగా ఊరిబయట పాకలూ కనబడతాయి, పెయింటింగ్‌లోలా! వాటిలో ఒకదానిలో రాము అతని తల్లి వుంటారు.

తామిద్దరిమధ్య దూరం ఎంతో పెరిగిపోయిందనీ, ఏదో లోతు తెలియని అగాధం ఇద్దరనూ విడదీస్తుందనీ బాధపడసాగింది. ఏమయినా సరే మామయ్యతో చెప్పి రాముని వివాహం చేసుకోవాలని నిర్ణయానికి వచ్చాక మనసు కుదుటపడింది. నెమ్మదిగా మెట్లుదిగుతున్న మాలిని ఒక్కసారిగా ఆగిపోయింది.

కింద అంతస్తు గదిలో మామయ్యా, రాఘవయ్యా మాట్లాడు తున్న మాటలువిని.

"అమ్మాయిగారు ఆ బజారుముండ జానకికొడుకు రాముతో చనువుగా వుంటున్నారని చెప్పాగదండీ వాడికెంతధైర్యం! ఇవాళ పార్టీకి రాబోయాడు. నేను గేటులో వుండబట్టి సరిపోయింది! ఇప్పటికే అమ్మాయిగారూ వాడూ ప్రేమించుకొన్నారనీ పెళ్ళిచేసికోబోతున్నారనీ ఆ లోఫర్ వెధవ ప్రచారం చేస్తున్నాడు. ఈరోజు పార్టీలో అందరి ఎదటికి రావటానికి వాడు ప్రయత్నం చేశాడంటే ఏమనాలి" అంటున్నాడు రాఘవయ్య.

"అమ్మాయి మనసు కష్టపెట్టటం నావల్లఅయ్యే పనికాదు. అట్లని రాముకిచ్చి పెండ్లిచేసి దానిగొంతు కొయ్యలేను. ఏదో చిన్నతనంలో తెలిసో తెలియకో యీ ప్రేమవ్యవహారంలో పడింది.

నువ్వు రామును యీవూరినుండి వెళ్లేట్లుచెయ్యి కొద్దిరోజులకు అమ్మాయి వాడిని మర్చిపోతుంది. బంగారంలాంటిషుగర్ ఫ్యాక్టరీవాళ్ళ అబ్బాయి సిద్ధంగా వున్నాడు అమ్మాయిని చేసికోటానికి" అన్నాడు మామయ్య.

"మీరు 'ఊ' అనాలేకాని ఆరామునుగాడ్ని సప్తసముద్రాలకు అవతలబడ్డుకు తరిమేయనా! వెధవని నరికి ఉప్పుపాతర వేయించుతాను. వాడితాహతెక్కడ అమ్మాయిగారెక్కడ! నక్కెక్కడ నాకలోకమెక్కడ! ఇకమీరు నిశ్చింతగా వుండండి. షుగర్ ఫ్యాక్టరీ సంబంధం ఖాయం చేయించండి" అంటున్నాడు నమ్మినబంటు రాఘవయ్య.

రాఘవయ్య చూసిరమ్మంటే కాల్చివచ్చేరకం. ఊరినుంచి పంపించమంటే లోకాన్నుంచే పంపించేయగలడు! ఆయన శక్తియుక్తులు తనకేకాదు ఊరందరకూ తెలుసు!

తానెంత దురదృష్టవంతురాలు! తన్ను ప్రేమించిన భాగ్యానికి రాముని అవమానంపాలు చేసింది. ఇప్పుడు రాఘవయ్య రాము ప్రాణాలు తీయందేవదలడు. అభిమానధనుడయిన రాము తనను

మస్సిపోవటానికీ ఊరువదలి వెళ్ళటానికీ సుత రాము అంగీకరించడు. ఆ సైతాన్ రాఘవయ్య రాముని తుదముట్టించకామానడు.

మామయ్య పెండ్లిచేసి బంగారు పంజరంలోంచి వజ్రాలపేటిక లోకి తనను పంపాలని చూస్తున్నాడేకాని తన మనసులో ఏముందో తెలుసుకోలేకపోతున్నాడు.

పంజరంలో చిలకకు కావలసింది స్వేచ్ఛకాని బంగారంకాదు. తాను జీవితరహదారిలో చౌరస్తా దగ్గరకు వచ్చింది. నచ్చినవాడికోసం పంజరంలాంటి బ్రతుకుని, ప్రాణంలా చూచుకొనే మామయ్యను వదలు కోటమా ?

ప్రాణంకంటే మిన్నఅయిన రాముని వదలి జీవచ్ఛవంలా మామయ్య అభీష్టం తీర్చటమా ?

చాలాసేపు మధనపడి ఓ నిర్ణయానికి వచ్చింది మాలిని.

నలిగిపోయిన పట్టుచీరెలా పుట్టినరోజు పండుగ వేడుక అయి పోయిన మరుసటి ఉదయం రాకెట్ బిల్డింగ్ వుంది.

ఎక్కడచూసినా కాయితాలూ, కప్పులూ, సాసర్లూ చిందర వందరగా కుర్చీలూ, బల్లలూ, సోఫాలూ, అన్నిటిమీదా చచ్చిపడివున్న దోమలూ, ఈగలూ.

పొద్దుపోయి పడుకొన్నారేమో పనివాళ్లుకూడా ఎండెక్కేన దాకా లేవలేదు.

అందరికంటే ముందులేచిన అవతారం అలవాటు ప్రకారం లేవ గానే మాలినిని చూద్దామని ఆమెగదికి బయల్దేరాడు. గది ఖాళీగావుంది.

గదిలోంచీ బయటకు వస్తుంటే వ్రాతబల్లమీద ఉత్తరం తన్ను వెక్కిరిస్తున్నట్టు కనబడ్డది,

వణుకుతున్న చేతులతో తీసికొని చదివిన అవతారానికి మాలిని ఉత్తరంలోని ప్రతి అక్షరం ఒక శిలాఘాతంలా తగిలింది,

తాను ప్రాణంకన్న మిన్నగా ప్రేమించే రామూకోసం ప్రాణంలా చూచుకొంటున్న మామయ్యను వదలి వెళ్తున్నాననీ, తమమధ్య అంతస్తుల భేదం లేకుండా వుండాలని కట్టుబట్టలతో వెళ్ళిపోతున్నాననీ, తనమీద ఏమాత్రం ప్రేమవున్నా తమను వెంబడించవద్దనీ, ఒకవేళ అలాటి ప్రయత్నంచేస్తే తన శవమే దొరుకుతుందనీ ఉత్తరంలో సారాంశం !

కుప్పలా కూలిపోయాడు అవతారం. ఇంతడబ్బు సంపాదించ టానికి ఎంతగడ్డికరచాడు, ఎన్ని అన్యాయాలూ, అక్రమాలూ చేశాడు. ఇన్నిబాధలుపడీ చివరకు తాను సాధించిందేమిటి ?

ఎవరెస్టు శిఖరంపై కాలుమోపుతున్నాననుకొంటూ అంతు తెలియని లోయలో కూలిపోయినట్లుంది తనపని !

తాను తలచుకొంటే ఇప్పటికీ మాలిని ఎక్కడుందో తెలుసుకొని తీసుకురాగలడు.

కాని ఆమె మనసు రాముపై అంతగా లగ్నమయినప్పుడు, తీసుకు వచ్చి ప్రయోజనం ఏమిటి కాలు భూమిమీదమోపితే కందిపోతుందని గిజగిజలాడే తను మాలినిని క్షోభపెట్టగలడా ? పైగా తన మనుష్యులను చూసి పట్టుదలగల మాలిని ప్రాణం తీసుకొంటే ? ఎక్కడవున్నా తన మాలిని బ్రతికివుండేచాలు అనేనిర్ణయానికి వచ్చాడు !

మాలిని లేని జీవితం శూన్యంలా కనిపించింది అవతారానికి.

అదుగో అప్పుడు కలిగింది అంతులేని ద్వేషం తన సంపదమీద ఇంతసంపద లేకపోతే యీరోజు తన ప్రాణంలా పెంచుకొన్న మాలిని తనవద్దనే వుండేది. అవధులులేని విరక్తికలిగింది అవతారానికి! అప్పుడు మొదలెట్టాడు జీవితంలో మొదటిసారిగా ధర్మకార్యాలు, ఊరిలో రైతువారందరినీ పిలచి పంచలు పెట్టాడు ! వికలాంగులకు నిత్యం భోజన సదుపాయం కలుగచేసాడు ! అనాథ శరణాలయం స్థాపించాడు. పేద విద్యార్థులకు వసతిగృహం ఏర్పరచాడు. కాలేజీ పెట్టించాడు. కళ్యాణ

ండపం కట్టించాడు. నలుగురకు ఉపయోగపడుతుందన్నపని ఏదైనా
కే చేయించాడు.

అదుగో అప్పుడు సామాన్యపు జనానీకం మెచ్చుకొని మనసారా
ంచుతున్న సమయంలో వచ్చింది చెయిన్ రియాక్షన్.

తన పదవికి ఎవడు ఎసరుపెడుతున్నాడోనని నిత్యం శంకించే
ద్రుడిలా, శిఖరాగ్రాన్ని చేరుకొంటున్న అవతారం పేరుప్రఖ్యాతులు
గాసి ఆవూరు బడా రాజకీయనాయకునకూ,

మామూళ్ళివ్వటం మర్చిపోయిన అవతారం ఎంత గొప్పవా
యినా ఒకరివిషయంలో బెట్టు సడలిస్తే అందరూ మామూళ్ళు
గగొడతారనే భయంతో పోలీసు డిపార్టుమెంటూ,

ఇన్నాళ్లూ చేతులు తడుపుతూ సాయిలాపాయిలాగావుంటూ
చ్చి ఇప్పుడు మర్చిపోయాడని కంటుపడుతున్న టాక్సుడిపార్టుమెంటూ,

ఒకరేమిటి అవతారం అక్రమంగా డబ్బు సంపాదిస్తున్నప్పుడు
ాయశక్తులా సహకరించిన అన్ని శక్తులూ కూడబలుక్కొని ఒక్కసారి
దెబ్బతీశాయి.

టాక్సుడిపార్టుమెంటు వారి రెయిడ్‌లో కావలసినంత నల్లధనం
ొరికింది. పోలీసు డిపార్టుమెంటు రెయిడ్‌లో కావలసిన దొంగనోట్లూ
ొరికాయి.

ఎక్సయిజు డిపార్టుమెంటు రెయిడ్‌లో విదేశీమద్యమూ
ొరికింది.

ఒకరేమిటి అన్ని డిపార్టుమెంట్లకూ కావలసినన్ని కేసులూ,
ఒపికకొద్దీ దోపిడీచేసుకొని హరాయించుకోగలిగినంత సొత్తూ దొరికింది.

పల్లెత్తుమాటనలేదు అవతారం. అన్నీ నవ్వుతూ చూశాడు
వేదాంతిలా! చిరునవ్వుతో బేడీలు వేయించుకొన్నాడు.

అపురూపమయిన సంపద పోగొట్టుకొన్నవాడు అణాలూపైసలూ
కొరకు విచారించడుకదా!

# నాగస్వరం

కరెంటు లేక లిఫ్టుపని చేయకపోవటంతో అయిదో అంతస్తునుండి ఒక్కోమెట్టూ దిగుతూవస్తున్నాను. ఉస్సురంటూ, ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంట్‌ను తిట్టుకుంటూ పైకివస్తూ మలుపులో డేష్ ఇచ్చాడు ఒక పొడుగుశాల్తీ. పరీక్షగాచూస్తే వాడెవరో కాదు బి. ఏ. లో నా క్లాస్‌మేటు రమేష్. కొన్ని సంవత్సరాల తర్వాత కలసుకోటంతో సంభ్రమాశ్చర్యానందాలలో మునిగితేలాము. బి. ఏ. చదువుతున్నపుడు బాగాక్లోజుగా వుండేవాళ్ళం.

నేను మా కజిన్ సుశీలను చూడటానికి వచ్చినట్టే వాడు వాళ్ళ తాత కజిన్‌ను చూడటానికి వచ్చానని చెప్పాడు. వాళ్ళ తాత వుంటున్నది ఏడో అంతస్తులో ! నన్నుకూడా బలవంతంచేసి తీసుకొనివెళ్ళేడు వాళ్ళ ఫ్లాట్‌లోకి.

మద్రాసులో మార్షల్‌రోడ్డులో మబ్బులో చొచ్చుకుపోతూ పోటాపోటీలుగా అనేక ఆకాశహార్మ్యాలు వెలశాయి. అందులో మా కజిన్ వాళ్ళ ఫ్లాట్‌వున్నది ఒకటి. ఒకో అంతస్తులోనూ ఆరునుంచి పదిదాకా ఫ్లాట్సు. కింద అంతస్తులో బిల్డింగ్ తాలూకు ఆఫీసు, ఘూర్ఖాగది. బిల్డింగ్ మధ్యలో ఇరుసులా లిఫ్టు. పై అంతస్తుపై భాగంలో వాటర్‌టాంక్ శివుడినెత్తిన గంగలా. పేరుకు ఫ్లాట్ లేకాని దేనికిదానికి అన్నీ అమర్చి ఏఇబ్బంది లేకుండా ఏర్పాటైవున్నాయి. ఒకో ఫ్లాట్ ఇంటీరియర్ డెకొరేషన్ ఒకోరకంగావుండి దేనికది ప్రత్యేకంగా కట్టబడినట్లున్నాయి. ఎక్కువగా సింధీలు, ఉత్తరదేశస్థులూ కొద్దిమంది తమిళులూ. తెలుగువారూకూడా వున్నారా భవనాలలో.

ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు పుణ్యమా అని కరెంటు లేనప్పుడు తప్ప లేకపోతే అన్ని సదుపాయాలతో ఏలోటూ లేకుండా వుంటుంది. దాదాపు ప్రతీపోర్షన్‌కూ ఫోనువుంది.

మరీ దూరాన్నించి చూస్తే తేనెతుట్టెలలానూ, కొంతదూరా న్నుంచి చూస్తే పావురాల గూళ్ళలానూ కనపడుతాయి ఆ భవనాలు. భవనం పై అంతస్తునుంచిచూస్తే కింద మద్రాసు నగరం అందంగా అమర్చిన దసరాబొమ్మల కొలువులా వుంటుంది.

మేం వెళ్లేసరికి రమేష్ వాళ్ళతాతయ్యగారి ఫ్లాట్ డ్రాయింగ్ రూమ్‌లో పేకాట జోరుగా సాగుతోంది. నలుగురు ఆడుతున్నారు. అందులో చెక్కిన గ్రీకు బొమ్మలా దర్పంగావున్న ఓ పండువృద్ధు, తెల్లటి ఖద్దరు బట్టలలో విచ్చిన నందివర్ధనం పూవులా వున్నాడు.

"తాతయ్యా వీడు నా ఫ్రెండ్ కిషోర్" అంటూ పరిచయం చేశాడు రమేష్, అప్పుడు తలెత్తి చూశాడాయన.

బాగా చిరపరచితమయిన ముఖం. జ్ఞాపకం తెచ్చుకోగా స్ఫురణకువచ్చింది. ఆయన ఒకప్పుడు అనగా కంపోజిట్ మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర దేశాన్ని మకుటంలేని మహారాజులా ఏలిన రాజకీయ వేత్త నారాయణరావుగారని.

"కూర్చోవయ్యా ! ఆట ఓ మంచిపట్టులోవుంది" అన్నారు నారాయణరావుగారు.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ లోనూ, కేంద్రంలోనూ మంత్రులు గానూ, ఇతరత్రా పెద్ద పొజిషన్లలో వున్నవారిలో అనేకమంది ఆయన శిష్యులే ! ఒకప్పుడు ఆయనతో ఇంటర్వ్యూ దొరకుతుందో లేదోనని పడిగాపులు కాసినవారిలో చాలామంది మంత్రులూ, కొంతమంది ముఖ్య మంత్రులూ అయ్యారు.

ఆంధ్రరాష్ట్రం వచ్చాక కొద్దిరోజులకే ఆయన రాజకీయాలనుండి విరమించుకొని ప్రజాజీవితంనుండి దాదాపు ఫేడౌట్ అయ్యారు. ఆయన అలా ఎందుకు చేశారో ఆయన చెప్పలేదు, ఇతరులెవరూ వూహించ లేదు. కాని ఆయన ఇంకా జీవించేవున్నాడన్న సంగతి దాదాపు ఆంధ్ర

దేశం మొత్తం మర్చిపోయిందన్న సంగతి మాత్రం యథార్థం! బహుశా మరొక్కసారి ఘనంగా ఆంధ్రదేశం ఆయన్ను గుర్తుచేసుకొంటుందేమో, ఆయన మరణించిన తర్వాత! అంతే! తర్వాత అనేక మంది నాయకులను చరిత్ర మింగేసినట్లు ఆయనకూడా కాలగర్భంలో కలిసిపోయాడు.

బహుకాలం తర్వాత రమేష్‌ను కలసుకొన్నందువలన కొంత, నారాయణరావుగారు రాజకీయసన్యాసం ఎందుకు చేశారో తెలిసికొందామని కొంత అక్కడే వుండిపోయాను.

కొంతసేపయాక ఆట ముగిసింది. మిగిలినవారు వెళ్ళిపోయారు. రమేష్‌వాళ్ళు అంకుల్ టీ కోసం డ్రాయింగ్‌రూమ్‌లోకి పిలచారు మమ్మల్ని. పరిచయవాక్యాలూ కుశల ప్రశ్నలూ అయాయి.

"ఒకప్రశ్న అడుగుతాను, ఏమీ అనుకోరుగదా!" అన్నాను నారాయణరావుగారితో. "భలేవాడివే అడుగు" అన్నారాయన చమత్కారంగా.

"మీరు రాజకీయాలనుండి ఎందుకు విరమించుకొన్నారో తెలుసుకొందామని కుతూహలంగావుంది" అన్నాన్నేను పకాపకానవ్వేరు. "ఈప్రశ్న కనబడ్డ ప్రతివాడూ అడిగాడు మొదట్లో నేను మవునమే సమాధానంగా వూరుకొనేవాణ్ణి. ఇప్పుడు మాత్రం నన్నాప్రశ్న అడిగేవారేలేరు. గుర్తుతెచ్చుకొంటేతప్ప ఒకప్పుడు రాజకీయాల్లో వున్నానన్న సంగతి నేనే మర్చిపోయాను.

రాజకీయాల్లోంచి బయటకు నెట్టబడటమే ఎరుగుదురు మన రాజకీయవేత్తలు. గౌరవప్రదంగా విరమంచుకోవటం అన్నది అసాధారణం. మన దేశంలో మరీను.

బ్రిటీషువాళ్ళ కాలంలో సేవాతత్పరతతో, దేశభక్తితో, పరోపకారార్థం, నిస్వార్థంగా రాజకీయాలలో దిగిన మాతరం వాళ్ళలో కొద్దిమందిమి స్వాతంత్ర్యం వచ్చాక అధికారరీత్యా ముఖ్యపదవులలోకి వచ్చాము.

అధికారం అనేది నాగస్వరం లాంటిదని, దాని కాకర్షితులై నాగుపాములనేకం చుట్టూచేరి పడగవిప్పి ఆడుతుంటాయనీ అధికారాంత మందు, నాగస్వరం మానివేస్తే నాగులు కాటువేయటానికి సిద్ధంగా వుంటాయనుకున్నా, గురువులకు పంగనామాలు పెట్టటానికి వెనకాడని శిష్యులు కొల్లలనీ గ్రహించి ముందుగానే మేల్కొని ఆరొంపిలోనుండి బయటపడ్డాను.

రాజకీయాల్లో నా కుడిభుజం అనుకొన్న వ్యక్తి ఒకరోజు నేనింకా ఆఫీసుకు రాలేదనుకొని పక్కన వాళ్ళతో అంటుండగా విన్నాను.

"ఈముసలాడు రాయిలాగున్నాడు. వీడు చచ్చినప్పుడుకదా మనకేదైనా పదవివచ్చేది" అని.

ఆషాఢభూతికంటే వినయంగా కన్పించి గురువుగారికోసం నా ప్రాణాలైనా యిస్తానని ఉపన్యాసాలుచెప్పే శిష్యుడు అలా మాట్లాడే సరికి నిశ్చేష్టుడనైనాను.

బెల్లంచుట్టూ యీగలు మూగినట్లు అనేక పనులకొరకై జనం నాకోసం వస్తూండేవారు. ఒక్కనిముషంకూడా వూపిరి ఆడనివ్వకుండా కోలాహలం చేస్తుండేవారు. అన్నం తింటున్నా, ఏపని చేస్తున్నా వెంటాడి వేధించే మనుషుల కలవాటుపడిన నన్నుచూసి ఒకప్పు డనుకొనేవాళ్లు జనాన్ని చూడకపోతే నారాయణరావుగారు బతక గలరా అని!

ఎంతమంది కెన్నిరకాలైన సాయాలు చేయగలను!

ఒకడికి సాయంచేస్తే, వందమందికి అసూయ. ఆఖరుకు వ్యక్తి గతమైన సిఫార్సులేవీ ఖాతరుచేయనని నలుగురకు పనికివచ్చే సామూ హికోపయుక్తములైన పనులకుతప్ప నావద్ద కెవరూ రావద్దనీ కట్టడి చేశాను.

నిజంచెప్తే విస్తుపోతావు! ఏదైనా మంచిపని చేద్దామని ప్రయత్నం మొదలెడితే సంతోషించే వారికంటే అడ్డుపడే సైంధవు లెక్కువగా వుంటారు.

మంచి పనులనుచేసికూడా విరోధుల నెక్కువ చేసుకోవాలి.

పైగా మన రాజకీయాలు కులసంకుల సమరాంగణాలు. నీకులం కాని వాళ్ళంతా నీకు విరోధులే !

ప్రతిఫలాపేక్ష లేకుండా ఎవరైనా నమ్మకస్తులయిన అనుయాయులు దొరకుతారేమోనని చూశాను. నాకు కనుచూపుమేరలో కనపడలేదు. గాంధి తదితర మహాజాతి నాయకుల స్ఫూర్తితో రాజకీయాలలో దూకిన మాబోటి రాజకీయనాయకులకు కేవలం కుటిల నీతితోనో, లేకపోతే డబ్బుతోనో, లేక కులంపేరు చెప్పుకొనో లేకపోతే రవుడీయిజంతోనో బ్రతకాలంటే సాధ్యమయేది కాదని గ్రహించాను.

ఇదివరకు నన్ను చూద్దామని నేను చెప్పింది విందామని జనం ఎగబడేవారు. ఇప్పుడు ప్రతిఫలం అపేక్షించకుండా నాదగ్గరకు వచ్చేవాడే కనపడలేదు.

అంతా వెనక గోతులు తవ్వేవారే ! కాళ్ళకిందపట్టా గుంజాలని చూసేవారే !

ఈ పరిస్థితిని చక్కదిద్దాలంటే ఏమైనా మార్గం వుందేమోనని దీర్ఘంగా ఆలోచించాను. నాకేమీ పాలుపోలేదు. ఈ రాజకీయాలలో నిరుగ్మతలకు మందీయగల వైద్యుడు కనబడలేదు.

రాజీపడే ధోరణిలో చెడుకు లొంగిపోవడంకంటే మర్యాదగా అస్త్రసన్యాసంచేస్తే మంచిదనే భావం నాలో ప్రబలింది. నాఉద్దేశం బయటపెట్టగానే నన్ను రాజకీయాలనుండి విరమించవద్దని కొద్దిమంది మొగమాట పెడుతుంటే, అనేకమంది నేనంటే నేనని నావారసునిగా రావటానికి కుమ్ములాట మొదలెట్టారు.

అప్పటినుంచీ అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాను. పదవి దిగిపోయినతర్వాత నేనెవరికీ ఏవిషయమై సిఫారసు చేయలేదు. "వాసనలేని పూవుకోసమెవరువస్తారు ! క్రమంగా జనం నన్ను మర్చిపోయారు !" అంటూ ముగించారు నారాయణరావుగారు.



# త్రివేణి

ఏప్రియల్ నెల ఆఖరిరోజు ఆఖరుసారిగా ఎవరిళ్ళకువాళ్ళు వెళ్ళేముందు సెంట్రల్ కేఫీవద్ద కలసుకున్నాము మిత్రులం ముగ్గురం. ఆరు సంవత్సరాలు గుంటూరు మెడికల్ కాలేజీలో కలసి చదువుకొని, క్రమం తప్పకుండా పరీక్ష పాసవుతు చదువుపూర్తిచేసుకొని భవిష్య జీవితంలో అడుగు పెట్టబోతున్న యువకులం, నేనూ మిత్రులు కృష్ణా రావు, సుధాకర్. కాలిపోతున్న నేల, పైనుంచి మాడ్చిపారేస్తున్న సూర్యుడు, అటూ ఇటూ వాయిస్తున్నట్టున్న వడగాడ్పు బజారులో అడుగుపెట్టగానే పెనంమీదనుండి నిప్పులో దూకినట్లుంది. మేడే తాలూకు సంరంభంతో కాబోలు ఎర్రజెండాలు రెపరెపలాడుతున్నాయి. ఆరు సంవత్సరాలలో ప్రతిరోజూ దాదాపుగా ఇరవయినాలుగుగంటలూ కలసిగడపినమేము జీవితపుబాటలో తలోదారీ పట్టబోతున్నామనే భావన మనసును ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది. ముగ్గురమూ, రాష్ట్రం మూడు మూలలనుండీ వచ్చినా దాదాపు కాలేజీలో చేరిన మొదటిరోజు నుండి ముగ్గురం మనసులుకలసి తిరుగుతూవచ్చాముకదా మరల ఎప్పుడు, ఎక్కడ, ఎలా కలుసుకుంటామో తెలియని దశకు వచ్చాయికదా జీవితాలు అనే ఆలోచన లోపల తొలుస్తూంది. మా ముగ్గురివీ మూడు భిన్నమనస్తత్వాలు, ఏ విషయంలోనూ ఒకరికొకరికీ సామ్యంలేదు. మేం కాలేజీలో చేరినరోజు ఒకేచోట కలుసుకోటంగూడా యాదృచ్ఛికంగా జరిగిందే.

కొత్తగాజేరిన విద్యార్థులను ప్రిన్సిపల్‌గారు ఇంటర్వ్యూ చేస్తున్నారు. ఇంటర్వ్యూకు వెళ్ళబోయేవారినీ, ఇంటర్వ్యూ అయివచ్చిన వారినీ సీనియర్సు పట్టుకొని వారి శక్తికొద్దీ, తోచినవిధంగా రేగింగ్ చేస్తున్నారు. కొంతమంది ముదురుపాకం భరించలేక కళ్ళనీరు తిరుగుతుంటే కొంతమంది తప్పించుకోటం ఎలాగా అని ఆలోచన తెగక

చస్తున్నారు. ఇంటర్వ్యూలో నావంతు వచ్చింది. ప్రిన్సిపాల్ గారు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి బయటకు వచ్చాను. నల్లగా వుండే ఒక సీనియర్ నన్ను ప్రిన్సిపాల్ రూము వెనుకకు పిల్చాడు. ఏదో మూడిందిగాబోలు అనుకొని అటువెళ్ళాను. అతను నన్ను కొంత దూరం తీసుకొనివెళ్ళి "నేను నిన్ను ఏమీ అల్లరిచేయను, రేగింగ్ అంటే నాకు అసహ్యం, పోయిన సంవత్సరం నన్ను రేగింగ్ చేసినప్పుడు నేనెంత బాధపడ్డానో మర్చిపోలేదు. అందువల్ల నేను వీలైనంతమందిని రేగింగ్ బారినుండి రక్షించాలనుకొన్నాను" అన్నాడు. నన్ను తీసుకొని వెళ్ళి స్టోర్సుపక్కవున్న ఖాళీగదిలోకిపంపి, "ఒకగంట ఇక్కడేవుండి బయటకు వెళ్ళావంటే సీనియర్స్ అందరూ వెళ్ళిపోతారు" అని చెప్పాడు.

ఆ రూములో కలిశాం ముగ్గురం మొదటిసారిగా నేనూ, కృష్ణారావూ, సుధాకర్ నెత్తిమీదకు వచ్చిన మహావిపత్తులాంటి రేగింగ్ వలన గంటసేపటిలోనే ఎంతో సన్నిహితులమైనాము. ఆసాన్నిహిత్యం ఆరు సంవత్సరాలుగా ఒకేగదిలోవుంటూ, కష్టం, సుఖం పంచుకొంటూ వైకుంఠపాళీలాంటి మెడిసిన్ కోర్సులో పాములనోట పడకుండా క్రమంగా పైకివచ్చి యీరోజు మెడికల్ గ్రాడ్యుయేట్లుగా పొట్ట చేత పుచ్చుకొని తలోదిక్కూ పట్టటానికి నాందీప్రస్తావన చేయవలసిన దశకు వచ్చాము. ముగ్గురవీ భిన్న ప్రకృతులని చెప్పాకదా! ఒకరు ఉత్తర ధ్రువం! ఇంకొకరు దక్షిణధ్రువం! మరొకరు భూమధ్యరేఖ!

కృష్ణారావు ఏపనీ, ఆఖరకు కొత్తపుస్తకం కొంటానికి కూడా పంచాంగంచూసి మీనం, మేషం లెక్కపెట్టిగాని బయల్దేరేవాడుకాడు. ఊళ్ళో ఏ స్వాములవారు వేంచేసినా ఉదయం సాయంత్రం హాజరు అయ్యేవాడు. ప్రతిపరీక్షకు ఏదో ఒకమొక్కు మొక్కుకొనేవాడు. ఫైనల్ పరీక్ష పాసయ్యాక హవుస్సర్జన్ గా ఉన్నప్పుడు అయ్యప్పదీక్షపూని కేరళ వెళ్ళొచ్చాడు. ఎవరయినా నాస్తికులు తటస్తపడితే విరుచుకు

పడేవాడు కొట్లకుక్కలా. నాస్తికులు మృగాలకన్నా హీనులు అన్న భావనలో వుండేవాడు.

సుధాకర్ పరమనాస్తికుడు, ఏపనిచేయాలన్నా దుర్ముహూర్తంలో మొదలెట్టేవాడు. ఎక్కడెక్కడ నాస్తిక మహాసభలలో వార్తలూ పత్రికల్లో చదివి ఎగురుతుండేవాడు. ఆమధ్య డాక్టరు అబ్రహాం, కోవూరు గుంటూరు వచ్చినపుడు ఆయన మీటింగ్ ఏర్పాట్లలో సగంభాగం నెత్తినవేసుకున్నాడు. మతం మానవుణ్ని మత్తులోవుంచి మానవ పురోభివృద్ధిని కుంటుపరస్తుందని గట్టిగా నమ్మేవాడు. ఆస్తికులు ఎక్కడ ఎదురయినా తీవ్రంగా ఎదుర్కొంటూ వాదించటంలో అమితానందం పొందేవాడు. కృష్ణారావుకు ఏదైనా బాధవచ్చినా, జ్వరంవచ్చినా లేక ఏవిధమయిన కష్టంవచ్చినా వెంటనే అమితోత్సాహంతో వెళ్ళి "ఇంత నిష్ఠగా పూజలుచేసే నిన్ను రక్షించలేని దేవుణ్ణి ఎందుకు నమ్ముతావోయి" అనేవాడు. కాని సుధాకర్ అలా అన్నప్పుడల్లా కృష్ణారావు ఉలికిపడి చెంపలేసుకొంటూ ఇంకా తీవ్రంగా దైవధ్యానంలో పడేవాడు.

సుధాకర్ ఏదైనా కష్టాల్లో వున్నప్పుడు కృష్ణారావు బదులు తీర్చుకొనేవాడు. "నీవు భగవంతుణ్ణి నమ్మకపోవటంవలన నీకు యీ బాధలువచ్చాయి. వెంటనే సత్యసాయిబాబాను తలచుకో అన్నీ చక్కబడతాయి" అనేవాడు. మండిపడుతూ పటపట పండ్లునూరేవాడు సుధాకర్.

ఇద్దరకు మధ్యేమార్గంనాది. భగవంతునిగూర్చి ఆలోచించేవాణ్ణి కాదు. ఉన్నాడన్న వారితోకాని లేడన్న వారితోకాని వాదం పెట్టుకునేవాణ్ణికాదు. అందువలన సుధాకర్, కృష్ణారావు వాదంలోకి దిగి ఘర్షణపడ్డప్పుడు నావద్దకువచ్చి తీర్పుచెప్పమనేవారు. ఎవరివాదాన్నీ పట్టించుకోననీ అసలు ఆవిషయమై వాదోపవాదాలు అనవసరమనీ, మంచిపనులు చేయటానికి ఆస్తికత్వంకాని నాస్తికత్వం

కాని అడ్డురానవసరంలేదనీ చెప్పి సర్దిపంపేవాణ్ణి. మారూమ్‌ని మా క్లాసుమేట్సు త్రివేణీ సంగమం అని పిలచేవారు. కృష్ణారావూ, సుధాకరూ గంగ యమునలయితే కనపడని సరస్వతి నది లాటివాణ్ణి నేనని మాక్లాసుమేట్సు అనేవారు. మారూము కాపేరు రావటానికి మరో కారణం, అసలుకారణం త్రివేణి.

రెండు జడలు వేసికొని నడచివచ్చే నాజూకు గులాబిమొగ్గలా వుండే మా క్లాస్‌మేటు, త్రివేణి అంటే కృష్ణారావూ, సుధాకరూ ఇద్దరూపడిచచ్చేవారు. ఆమె అంటే పడిచచ్చేది వాళ్ళిద్దరేకారు, మా క్లాసులో ఎప్పటూ ఫస్ట్‌మార్కులు తెచ్చికొనే రఘు, ఆటల్లో ఎప్పుడూ ఫస్ట్‌వచ్చే మధు, డిబేట్సులో ఫస్ట్‌వచ్చే రమేష్‌లే కాకుండా దాదాపు మాక్లాస్‌మేట్సంతా ఆమెను లైక్‌చేసేవాళ్ళు. అందము, నాజూకేకాకుండా ఆ అమ్మాయి తండ్రికున్న ఆస్తికూడా దానికి కొంత కారణమేమో! ఎవరితోను ఎక్కువ చనువుగా వుండకుండా అట్లని ఎవరితోనూ ముభావంగానూ వుండకుండా అందరితోనూ ఒకేవిధంగా ప్రవర్తించే త్రివేణి అంటే అందరకూ ఒక విధమయిన Admiration అదే కృష్ణారావు, సుధాకర్‌లలో ఒకపాలు ఎక్కువగా చోటుచేసి కొంది. పొంగులువారే ఆరాధనాభావంతో హృదయం నిండిపోగా, త్రివేణితో భావిజీవితం గడుపుట ధ్యేయమనే కోరిక ఆలంబనగా వారిద్దరూ అనేక కలలు కనేవారు ప్రతిరోజూ. చిత్రమేమిటంటే తెల్లారి లేచి ఇద్దరూ విడివిడిగా తమకలలు గురించి నాకు వచ్చి చెప్పుకొనేవారు. ఒకే బాచ్ అవటంవలన మా ముగ్గురిలోనూ త్రివేణీతో ఎక్కువ సాన్నిహిత్యంవున్న నాకు ప్రత్యేకించి ఆరాటపడేవారి మనసులు వెళ్ళబోసుకునేవారు.

మేము ముగ్గురం ఆ ఏప్రియల్ ఆఖరిరోజున ఆఖరుసారిగా కలసి కొని ఒకనిర్ణయానికి వచ్చాము అదేమిటంటే సరిగా మూడు సంవత్సరాలయినాక ముగ్గురం మరలా అదే ఏప్రియల్ 30వ తారీఖునవచ్చి గుంటూరు మెడికల్ కాలేజీ ఆవరణలో కలుసుకోవాలని ఎవరెవరు

ఏ ఏ స్థితిలోవున్నా తప్పక ఆరోజున కలుసుకోవాలని నిర్ణయించు కొన్నాము. ఈలోపున ఉత్తరప్రత్యుత్తరాలద్వారా ఒకరి విషయాలు ఒకరం తెలుసుకొందామని అనుకొన్నాము.

కొద్దిరోజులకే మాబాబాయిద్వారా States వెళ్ళటానికి అవకాశం వచ్చింది నాకు. న్యూయార్కులోని హాస్పటల్లో మూడు సంవత్సరాలు రెసిడెంటుగా చేశాను. ఊపిరాడని పనివలన ఎక్కువగా కృష్ణారావుకూ, సుధాకర్‌కూ ఉత్తరాలు వ్రాయటానికి వీలయ్యేది కాదు. వాళ్ళిద్దరూమాత్రం క్రమం తప్పకుండా నాకు ఉత్తరాలు రాస్తుండేవారు. ఇద్దరూకూడా గుంటూరు మెడికల్ కాలేజీలోనే Post gradvate seats రాగా మూడుసంవత్సరాలుచదివారు. వారితో పాటు త్రివేణికూడా అక్కడేచేరి చదివింది. ఇద్దరి ఉత్తరాలలోనూ ఎక్కువభాగం త్రివేణి గూర్చినకబుర్లే వుండేయి. ఇద్దరూకూడా తాము త్రివేణిని గాఢంగా ప్రేమిస్తున్నామని, ఆమెకూడా Reciprocate చేస్తుందని భావిస్తున్నామనీ వ్రాసేవారు. నాకు ఏమీ పాలుపోయేది కాదు. ఈ Zig Saw Puzzle ఎలా Solve అవుతుందా అనుకొనేవాడిని. ఇద్దరూకూడా వారి ఉత్తరాలలో త్రివేణి నా యోగక్షేమాలు విచారిస్తూ వుంటుందని వ్రాసేవారు. ఆమె సహృదయ స్నేహభావనకు నేను మనసులోనే సంబరపడేవాణ్ణి.

అనుకున్నట్లు మూడు సంవత్సరాలు గడిచాక నేను ఇండియాకు వెళ్ళగలనా, వెళ్ళినా ఏప్రియల్ 30వ తారీఖున మిత్రులను కలసికోవటానికి సాధ్యమవుతుందో లేదో అని మథనపడేవాణ్ణి. అనుకోకుండా ఏప్రియల్ చివరలో సెలవు దొరకటం ఇండియాకు రావటాని వీలు చిక్కటం జరిగింది. స్నేహితులిద్దర్నీ ఆశ్చర్యపరుద్దామనే వుద్దేశంతో ఎవరికీ నారాకగురించి తెలియచేయలేదు. ఏప్రియల్ 30వ తారీఖు సాయంత్రం 6 గంటలకు ఉద్విగ్నహృదయంతో గుంటూరు మెడికల్ కాలేజీ గార్డెనులో అడుగుపెట్టాను. దీర్ఘకాలం తర్వాత కాలేజీ ఆవరణనీ, చిరపరచితమయిన భవనాలనూ, Statues నూ, గార్డెనునూ,

అపరిచితులయిన Students నూ చూస్తూ మిత్రద్వయంకోసం దృష్టి సారించాను. దక్షిణపు గేటునుండి కృష్ణారావు, Library నుండి సుధాకరూ ఒకేసారి నావైపుగావచ్చారు. ముగ్గురి మనసులలోను పెల్లుబికిన సంతోషం ముఖాలలో ప్రతిబింబించగా గాఢపరిష్వంగంలో మునిగిపోయిన మాకు కాలం స్తంభించి పోయిందా అనిపించే విధంగ, నోటమాట లేకుండా కొన్ని నిముషాలు గడిచాయి.

మిత్రద్వయాన్ని కలుసుకొన్నాననే అమితానందంవలన కలిగిన షాక్ నుండి తేరుకొన్న నాకు అంతకంటే పెద్దషాక్ తగిలింది. సుధాకర్ నల్లపాంటు నల్లషర్టు వేసికొని తిరునామాలు ధరించి అయ్యప్ప లాకెట్ మెడలోవేసికొనివున్నాడు. కృష్ణారావు చేతిలో డాక్టర్ కోవూరి పుస్తకాలు, నాస్తిక మాగజైన్లూ కనపడ్డాయి. ఉత్తర దక్షిణధ్రువాలు తమతమ నెలవులు మార్చుకొన్నా యన్ని భ్రాంతి కల్గిస్తున్నారేమి టన్నాను. ఇద్దరూ మవునంగా తలలువంచుకొన్నారు. ఎంత ప్రశ్నించినా కారణం చెప్పలేదువారు.

ఇద్దరనూ విడివిడిగా త్రివేణి విషయమై ప్రశ్నించాను. నిర్లిప్తతే సమాధానమై వచ్చింది. బహుశా వారి వింతప్రవర్తనకు కారణం తెలుస్తుందేమోనని త్రివేణి వద్దకు వెళ్ళను.

నా మిత్రద్వయం పడుతున్న పాట్లకు కారకురాలు అన్నభావం బలంగా మనసులో నిండివుండటంవలన త్రివేణి నాయెడల చూపే స్నేహభావం, ఆప్యాయతలను అర్థంచేసికొనే స్థితిలో లేకపోయాను. మామూలు మర్యాదలైనాక ఆమెను సూటిగా అడిగాను, కృష్ణారావునూ, సుధాకర్ కూ ఆశలు కల్గించి ఎందుకు ఒక్కసారి అధఃపాతాళానికి తొక్కావని. ఆమె చెప్పిన సమాధానంతో అప్రతిభుడ నయ్యాను. తాను వారితో స్నేహంగా వుండటానికి కారణం నా విషయాలు తెలిసికోవటానికే నని చెప్పిన ఆమె మాటలు నాచెవి కెక్కలేదు. నాకండ్లు గదిలో మూలగా నావైపున దృష్టిసారించి చూస్తున్న నాఫోటోవైపు పడ్డాయిగనుక.

# వడ్డించేవాడు మనవాడైతే

మెడిసిన్ చదవటం పరమపదసోపానపటం ఆడటం ఒకటే అని మా ప్రొఫెసర్ గారు ఎప్పుడూ అంటూండేవారు.

ఇక యం. యస్. పరీక్ష ఒక పెద్ద త్రాచుపాము నోరు తెరిచి చూస్తున్నట్లు అనిపిస్తుండేది పరీక్షకు వెళ్ళేవారికి

గట్టెక్కేది బహుకొద్దిమంది !

మొదటిఛాన్సులో పాసవాలంటే సామాన్యులకు వీలుకాదు.

ఎవరు పాసవుతారనేది ఎవరూ తెలుసుకోలేరు.

అసలాపరీక్షలే ఒక ఎనిగ్మా ! ఒక ప్రశ్నార్థకం !

ఎన్నో చిన్నచిన్న పాములను తప్పించుకొని గమ్యంచేరబోతూ పెద్దత్రాచు నోటిలోపడి సోపానపదం అడుగుకుచేరినట్లు ఎంత తెలివిగలవాడూ, చదవినవాడూ, అనుభవంవున్నవాడూకూడా ఇట్లే బోర్లపడేవాడు.

ఎవరైనా గట్టిగా పాసవుతారని ముందుగా వూహించగల్గేది కొన్ని సమయాలలో మాత్రమే !

ప్రొఫెసర్ గారి కొడుకో, అల్లుడో అయితేనో, ఏమినిష్టరు బంధువో అయితేనో వాడు తప్పక మొదటి ఛాన్సులో పాసవుతాడని అందరూ గ్రహించటానికి వీలుకలిగేది.

అదృష్టవశాత్తు మాబాచ్‌లో ఎవరూ V I P కాండిడేట్స్‌లేరు.

మాలో ఎవరు అర్హులయితే వారు ఉత్తీర్ణులవుతామని అందరకూ తెలిసిపోయింది.

సర్వశక్తులూ కేంద్రీకరించుకొని చదువుమీద విజృంభించాం అందరం.

ఒకరు చదివినది ఒకరితో చర్చించుకొనేవారం.

చదివిన దానికన్నా చర్చలలో ఎక్కువగా నేర్చుకొనేవాళ్ళం!

M. B. B. S. విద్యార్థులకు క్లాసులలోనూ వార్డులలోనూ పాఠాలు బోధించేవారం.

మాలోమేము చర్చించుకొన్న దానికన్నా ఎక్కువపాయింట్లు విద్యార్థులకు బోధించేటప్పుడు తెలిసేవి.

లైబ్రరీలో సర్జరీపుస్తకాలన్నీ తిరగేసి క్షుణ్ణంగా చదివేవాళ్ళం.

వెనకటి ప్రశ్నాపత్రాలకు జవాబులు తయారుచేసుకొని సిద్ధంగా వుంచుకొన్నాం.

మాలో మేమే ట్రయల్ ప్రాక్టికల్ పరీక్షలు జరపుకొనేవాళ్ళం!

ఒక్కొక్కసారి ఒక్కొక్కరం ప్రొఫెసర్ వేషంవేసుకొని మిగిలిన వారిని ప్రశ్నలువేస్తూ బోల్తాకొట్టించాలని చూసేవాళ్ళం.

ఇం తెందుకు! పరీక్షలకు ఎంతక్షుణ్ణంగా తయారయినామంటే అందరం దాదాపు Walkover చేస్తామనుకొన్నాము పరీక్షలలో.

మా ప్రొఫెసరూ, అసిస్టెంట్లూ, రిజిస్ట్రారుకూడా మాబాచ్‌లోని విద్యార్థులు సమర్థులు అని అనుకొనేట్లు చేశాము.

కాని మా ప్రొఫెసర్ ఇష్టం చెల్లదు పబ్లిక్ పరీక్షలలో.

ఇతర యూనివర్సిటీలనుండి ప్రొఫెసర్లు వస్తారు.

వారి చేతులలో మా భవిష్యత్తు నిర్ణయింపబడుతుంది.

వ్రాతపరీక్షలు వచ్చాయి.

బకాసురుడు భోజనం మీదికి లంఘించినట్లు కాయితాలమీద కసితీర్చుకొన్నాం! మాకువచ్చిందంతా తావులు తావులు నింపేశాం!

వ్రాత పరీక్షలో ఎవరమూ తప్పమనీ దాదాపుగా మాజవాబు పత్రాలను దిద్దటానికి తీరికలేని ఎగ్జామినర్సు చాలాసార్లు వాటిముఖం కూడా చూడరనీ విన్నాం.

అయినా రన్నింగ్ రేస్‌లో గెలవమని తెలిసినా అందరూ శాయశక్తులా పరిగెత్తినట్లు అందరం వ్రాతపరీక్ష బాగా వ్రాశాం.

ముసళ్ళపండుగ ప్రాక్టికల్సు వచ్చాయి.

పీకలు తెగేది అందులోనే.

అదృష్టం అందలం ఎక్కించేది అందులోనే.

ఉత్తీర్ణులయితే పేరుచివర రెండక్షరాలు జేరతాయి !

సఫలం కాకపోతే వున్న నాలుగక్షరాలు తగిలించుకొని ఏడవాల్సిందే !

పరీక్షకు వెళ్లేవారిలో కురువృద్ధులులాంటి వారిద్దరు ముగ్గురు వున్నారు. వారు తొమ్మిదోసారో ఎన్నోసారో ఆ పరీక్షకు రావటం. ఎన్నోసారో వారూ మర్చిపోయారు, ఇతరులూ మర్చిపోయారు.

ఇక రెండుమూడుసార్లుతప్పి పరీక్షకు వచ్చిన కురుయోధులు, ధర్మజుని, దుర్యోధనుని సోదరులలాంటివారు,

ఇక మొదటిసారి పరీక్షకువెళ్లే నాబోటి వీరాభిమన్యులూ వున్నారు.

కురువృద్ధులు నిర్లిప్తంగా వేదాంత ధోరణిలోవుంటే వీరాభిమన్యుల మయిన మేము హాలులోకి రాగానే ఉత్తరకుమారులమయి పోయాము.

మధ్యగా అటు పూర్తిగా వేదాంత ధోరణి అలవడక ఇటు పూర్తిగా బెదిరిపోకుండా కురుయోధులు.

మామూలుగా అయితే మొదటిఛాన్సు వీరాభిమన్యులలో ఏ ఒకరినో పాసుచేసి, ఎక్కువ ఛాన్సులుతీసికొన్నవారిలో కొద్దిమందిని పాసుచేసి మొత్తంమీద నూటికి ఏపదిమందినో పాస్ చేశామనేవారు.

మొదటి ఛాన్సులో పాసయే క్రెడిట్ ఎవరికి వస్తుందో ?

మొదటిఛాన్సులో పాసయినవాడు కాలరెత్తుకొని తిరుగుతాడు కొంతకాలం !

ఫెయిలయిన వాళ్ళమీద తెగసానుభూతి వొలికిస్తాడు !

నాడు పాసయినదానికంటే వాడుచూపించే సానుభూతికి ఎక్కువ ఏడ్వాలి మిగిలినవారు !

కొద్దిరోజులపాటు సినిమాలో హీరో వేషం దొరకినంత పోజుగా వుంటాడు.

లాటరీలో ప్రైజువచ్చినంత ఖుషీగా వుంటాడు.

ఒక్కసారిగా స్పేస్‌షిప్‌లో చంద్రమండలానికి వెళ్ళివచ్చినంత రిసెప్షను వస్తుంది.

జూనియర్సందరూ అతన్ని దాపుగా నెత్తినుంచుకు మోస్తారు.

చెప్పిన మాటను పదేపదే చెప్పిస్తారు.

అతను చెప్పినమాటను ఒకటికి పదిసార్లు చెప్పుకొంటారు.

ప్రొఫెసరుకూడా అతను ఇలా సమాధానం చెప్పాడు అందువలన పాసయ్యాడు అని పదేపదే గుర్తుకు తెస్తుంటాడు.

ఇక తప్పినవారి మాటో ?

అది అడగొద్దు.

విడిచేసిన పాతచెప్పుకన్నా అన్యాయం అయిపోతాడు.

వారిని తలచుకొనేవా డుండడు. ఓదార్చేవా రుండరు.

గానుగెద్దులా పాసయినంతవరకూ పరీక్షలకు కూర్చోవలసినదే అనే ఆలోచన అంతులేని నిర్వేదాన్ని కల్గిస్తుంది.

పైకిమాత్రం బెట్టుగా కనపడాలిగదా ! మేకపోతు గాంభీర్యం ఒలకపోయాలి !

ఇక పరీక్షహాలుదగ్గరకువచ్చి వోరల్సుకు వెళ్ళబోయేముందు పడిగాపులు కాయాలే; ఆ సమయంలోమటుకు జన్మాంతం గుర్తుండే నరకం అనుభవించాలి.

సిగిరెట్ తాగనివాడు తాగుతాడు. తాగే అలవాటున్నవాడు మరీమరీ తాగుతాడు.

కూర్చున్నవాడు నిల్చుంటాడు.

నిల్చున్నవాడు పచార్లు చేస్తాడు.

మనసు నిలుపుకోటానికి పుస్తకాలు తీస్తారుకాని అందులోవేవి బుర్రలోకిపోవు.

టెన్షన్ పోవటానికి కొంతమంది జోక్సువేస్తారు. కాని వాటికి ఎవరూ రియాక్టు అవరు.

కురువృద్ధులు ధైర్యం చెప్పటానికి ఏదోమాటలు చెప్తారు. కాని అవి మొదటిసారి పరీక్షకువెళ్లే మాబోంట్ల చెవుల్లో దూరవు.

ఎంతటి ధైర్యవంతులూ పిల్లులయి పోతారు.

ఎంత సమయస్ఫూర్తిగలవారికీ బుర్రపనిచేయదు,

ఎంత చలాకీ అయినవారూ మన్నుతిన్న పాములయిపోతారు.

గిలటిన్ ముందుకు వెళ్తున్న ప్రిజనర్సులా వుంటారు.

మునిగిపోయే నావలో కూర్చున్న ప్రయాణీకులలా వుంటారు.

మంటలు చుట్టూరా రేగిన భవనంలో కూర్చున్నట్టు కుతకుత లాడిపోతారు.

మొదటిసారిగా ఆసీకు ఎనమండుగురం పరీక్షకు వెళ్తున్నాం.

అంతా ఒకేవిధంగా చదివాం ఒకేవిధంగా పరీక్షవ్రాశాం !

అందరం మలేరియాగోగుల్లా వణకుతున్నాం !

కాని సిద్ధవీరప్ప అలా నింపాదిగా వున్నాడేంటి ?

మామూలుగా ఎంతో పిరికివాడే. చదువులోకూడా మా అందరికంటే ఏమీ మిన్నకాదే !

ఒకవిధంగా చెప్పాలంటే మాలో నాసిసరుకు అతనే !

తప్పకుండా తప్పేవారెవరంటే గబక్కున అతనిపేరు చెప్పవచ్చు.

అతను నింపాదిగా వుండగలగటం ఆశ్చర్యం కల్గించింది కాని అది గమనించేస్థితిలో ఎంతోమందిమిలేము.

బలిపశువుల్లా ఒక్కొక్కరం ముందుకు వెళ్తున్నాం !

తలలు తెంచి పడేసినట్లు మమ్మల్ని ఫెయిల్ చేస్తున్నారు.

అందరం ప్రాక్టికల్సు అయ్యాక గుమిగూడాం.

ఎవరికివారికే దింపుడుకల్లాం ఆశ పాసయ్యానేమో నని !

రిజిస్ట్రారువచ్చి చెప్పాడు సిద్ధవీరప్ప పాసయ్యాడనీ, అతను జూనియర్సందరలోనూ బాగాచేసి యూనివర్శిటీలోకే మొదటివాడుగా వచ్చాడనీ, మిగిలిన వారందరము చిన్నచిన్న ప్రశ్నలకే తబ్బిబ్బయి చెడగొట్టుకున్నామనిన్నూ !

కాని చివరలో తెలిసింది. మైసూరునుండి వచ్చిన ఎగ్జామినరు సిద్ధవీరప్ప మేనమామ అనీ.

మేనమామ వున్నాడుగనుక ధైర్యంగా సమాధానాలు చెప్పి మా అందరినీ టాప్ చేశాడనీ రిజిస్ట్రార్ అన్నాడు.

ఆమాటలో నిజం పాలెంతో ?

# పిట్టపోరు

దూరంగా కచేరీసావిడిలో పదిగంటలు ఖంగు, ఖంగుమని మోగాయి. ఆఖరిసారి వార్డులో రోగులను చూచుకొని స్టాఫ్‌రూమ్‌కి బయల్దేరాను. మార్ఫియామత్తులో ఆపరేషన్ చేయించుకొన్నరోగులు కూడా నిద్రపోతున్నారు. పగలంతా విజిటర్లతో కిటకిటలాడుతున్న వార్డు ఉత్సవం మరుసటిరోజున దేవాలయంలా వెలవెల పోతుంది. అక్కడక్కడా మంచాలపక్కన విజిటర్సు నిద్రపోతున్నారు.

స్టాఫ్ రూముకు జేరి డ్రాయరుముందు కుర్చీవేసుకొని, గౌను సర్దుకుని కూర్చొన్నాను, టెంపరేచరు ఛార్టులు తయారు చేద్దామని.

"అక్కా ఏమిటి రౌండ్సు ఇంతసేపుచేశావు" అంటూవచ్చాడు కొత్తగా కొద్దిరోజుల కిందటే వార్డుబాయ్‌గా చేరిన రంగడు.

ఎందుకనో వాడికి నేనంటే అభిమానం.

అస్తమానం నేనున్నంతసేపూ నాదగ్గరే వుంటాడు. నన్నెవరైనా పల్లెత్తుమాటంటే సహించడు.

రోజూ డ్యూటీకివస్తూ తింటానికి వేరుసెనగకాయలో, బజ్జీలో పట్టుకొస్తాడు.

ఇద్దరం అవి తిన్నాక నేను ఇంటివద్దనుండి ఫ్లాస్కులో తెచ్చిన టీ ఇద్దరం తాగుతాము.

మేలుకొని వున్నంతసేపు ఇద్దరం పిచ్చాపాటీ మాట్లాడుకొంటాము.

కొత్తగా చేరాడుగదా వాడికింకా పాపం పుణ్యాం తెలియదు.

తెల్లనివన్నీ పాలనీ, నల్లనివన్నీ నీళ్ళని అనుకొనేరకం.

వయసుకూడా ఎక్కువుండదు.

"అక్కా షణ్ముగం డా॥ సుదర్శనం ఆపరేషన్ థియేటర్ బయట మాట్లాడుకోరటగడా ఎందువలన?" అని అడిగాడు.

మంథరపర్వతంలాంటి మహాకాయాన్ని మోయలేక మోస్తూ పాము చెవులతో కలియుగమంధరలాంటి రాఘవమ్మ, వరండాలోంచి నడుస్తూ వెళ్ళడం గమనించినట్లు లేదువాడు. లేకపోతే అలా అడుగ గూడదు. రాఘవమ్మ వున్నప్పుడు అని నేను చెప్పిన మాటలు మర్చిపోయివుంటాడు.

రాఘవమ్మ కారిడర్ దాటిపోయాక చెప్పాను "అరే రంగా గోడలకు చెవులుంటాయిరా అని చెప్పలేదట్రా" అని.

"సారీ అక్కా మందర రావటం చూడలేదు" అన్నాడు.

ఆరోజు ఎందుకనో ఏ ఎమర్జన్సీ కేసూ రాలేదు. వార్డు ప్రశాంతంగావుంది. చార్టు తయారుచేస్తూ చెప్పటం మొదలెట్టాను.

షణ్ముగం ఉద్యోగంలో చేరినరోజునే యీ హాస్పటల్ ప్రారంభించారు. అప్పుడు ఉమ్మడి మద్రాసురాష్ట్రం వుండేది. షణ్ముగం తనవూరివాడే అయిన హెల్తుమినిష్టరును పట్టుకొని ఏ చదువూలేకపోయినా వార్డుబోయిగా హాస్పటల్‌లోచేరాడు. అసలువాడికి ఉద్యోగం ఇవ్వటానికే యీ హాస్పటల్ పెట్టారని ఓవాదుక !

ఏద్దైతేనేం ఏచదువూ రాకపోయినా తన తెలివితేటలవలన కొద్దిరోజులలోనే హాస్పటల్‌లో చక్రం తిప్పటం మొదలెట్టాడు షణ్ముగం. అవసరమయితే మత్తిచ్చేవాడు, ఎముకలు విరిగినవారికి ప్లాస్టరువేసేవాడు, ఆపరేషను సామాన్లు అందించేవాడు. ఆపరేషన్లో డాక్టరుగారి కవసరమయినపుడు అసిస్ట్‌చేసేవాడు.

వార్డులో కట్టుకట్టేవాడు. సెలైన్ పెట్టేవాడు. భయపడుతున్న వారికి ధైర్యం చెప్పేవాడు. కేసుఫెయిలయితే బంధువులను ఓదార్చి పంపేవాడు. ఏపనిచేసినా ఇంతకంటే ఎవరూ బాగ చేయలేరేమో అన్నట్లు చేసేవాడు.

చిత్రమేమంటే ఎమర్జన్సీలో అందరూ ఆఖరుకు సర్జనుతోసహా కంగారుగాపడి హడావుడి చేసినకొద్దీ, నింపాదిగా, సమయస్ఫూర్తితో,

చాకచక్యంగా ప్రవర్తించేవాడు. ఎక్కడ, ఎప్పుడు ఏఅవసరం వస్తుందో ముందుగానే గ్రహించివేసేవాడు. వాడికేదో సిక్స్తుసెన్సు వున్నట్లు ప్రవర్తించేవాడు. ఆపరేషన్‌లో ఏసామాను అవసరం అవుతుందో థియేటర్‌లో సిస్టరుకంటే ముందుగా ఊహించేవాడు.

రోగికి ఏకాంప్లికేషన్ వస్తుందో డాక్టరుకంటే ముందుగ తెలుసుకొనేవాడు.

అన్నీ తెలుసుకొని తొందరపడకుండా సమయం వచ్చినప్పుడు సహాయం చేసేవాడు.

పైగా ప్రజల నాడి గమనించటంలో సిద్ధహస్తుడు. పబ్లిక్ రిలేషన్సులో వాడిని మించిన వెయ్యిలేదు.

పొద్దున్నే లేచి శుభ్రంగా స్నానంచేసి తిరుచూర్ణం ముఖానుంచుకొని ఇస్త్రీతలపాగా నెత్తిన పెట్టుకొని హాస్పటల్‌కు వచ్చేవాడు, ఎంత పొద్దుపోయినాకూడా, ఎంతమంది వచ్చినా విసుక్కోకుండా అన్నపానాలు లేకుండా పనిచేసేవాడు.

కొద్దిరోజులలోనే అతను ఇటు డాక్టర్లకూ, స్టాఫ్ మెంబర్లకే కాక అటు ప్రజలకుకూడా తలలోనాలుక అయిపోయాడు.

అతను అరవదేశంనుండి వచ్చాడన్న సంగతి కొద్ది నెలలలోనే అంతా మర్చిపోయేంత చక్కగా తెలుగు మాట్లాడ్డం నేర్చుకొన్నాడు.

అతను చదువుకోలేదన్న సంగతి అందరూ మర్చిపోయేంత చాకచక్యంగా ఏపనైనా చేసేవాడు.

చురుకైన బుర్రఅవటంతో ఒకసారిచూస్తే నేచాలు ఏ ఇంజక్షన్ ఏమిటో గుర్తుపెట్టుకొనేవాడు.

బాగా ఆరోగ్యంగా వుంటాడు. ఒకరోజుకూడా సెలవుపెట్టలేదు నలభై సంవత్సరాల సర్వీసులో.

కొద్దినెలలకే అతని ఇల్లు చిన్న హాస్పటల్‌లా మారిపోయింది.

హాస్పటల్‌లో డాక్టర్లమీదకంటే ప్రజలకు అతనిమీద విశ్వాసం పెరిగిపోయింది. మొదట చిన్నచిన్న రోగాలకు మందులిచ్చేవాడు. కొంతకాలం అయ్యేసరికి ఇంటివద్ద చిన్న ఆపరేషన్లు చేయటంవరకు వచ్చాడు.

క్రమంగా ఇల్లు పెద్దదయింది.

ఇంటివద్దకు వచ్చేజనం ఎక్కువయ్యారు.

జనం తెచ్చుకొన్న మందులూ తాను హాస్పటల్‌నుండి తెచ్చిన మందులూకలిపి సర్దివాడేవాడు ఇంటికొచ్చిన జనానికి.

ఇంట్లో వీలుకాని కేసులను హాస్పటల్‌కు రమ్మనేవాడు.

కొంతకాలానికి దాన్ని గవర్నమెంట్ హాస్పటల్ అనటం మానేసి, షణ్ముగం హాస్పటల్ అనేవారు కొంతమంది జనం.

కొంతమంది డాక్టర్ల కడి కంటుగా వుండేది !

కాని ఏంచేస్తారు ?

షణ్ముగానికి ప్రజలలో విస్తారంగా పలుకుబడి పెరిగిపోయింది.

పైగా హాస్పటల్‌లో అతను చేసినంతపని ఎవరూ చేయలేరాయెను. ఎమర్జన్సీలో అతనులేకపోతే క్షణంగడవదు !

పంతానికిపోయి ఒకరిద్దరు డాక్టర్లు అతన్ని బదిలీ చేయించాలని ప్రయత్నించారు. ప్రజల్లో తనకున్న పలుకుబడితోనూ, అవసరమయినపుడు డబ్బు గుప్పించీ బదిలీకాకుండా ఆపుకొన్నాడు.

తర్వాత ఏ డాక్టరూ మళ్ళీ అంతసాహసం చేయలేకపోయాడు.

ఇదుగో డా॥ సుదర్శనంగా రొచ్చారు, గొర్రెల్ని తినేవాడికి బర్రెల్ని తినేవాడెదురైనట్లు.

సుదర్శనంగారు షణ్ముగంలాటివాడే !

రోగులతో లాలనగా మాట్లాడేవాడు. ఓర్పుగా సమాధానాలు చెప్పేవాడు. త్వరలోనే మంచి పేరులోకి వచ్చాడు.

ఒకఒరలో రెండుకత్తు లిమడవనీ డా॥ సుదర్శనానికి, షణ్ముగానికీ తెలుసు. కాని సమవుజ్జీలయిపోయా రిద్దరూ.

సుదర్శనంగారు ఎలాగైనా ఓర్చుకోనేవారేకాని ఒకరోజున మంచి ఇన్సల్టు జరిగింది.

సుదర్శనంగారు ఆపరేషన్ గదిలోకి వెళ్ళబోతుండగా ఫోను మోగింది.

"డా॥ సుదర్శనం స్పీకింగ్ ఎవరుకావాలి" అన్నారు.

"నేను వైస్‌ఛైర్మన్‌ని మాట్లాడుతున్నాను. డా॥ షణ్ముగం గారు కావాలి" అన్నదిగొంతు,

"ఇక్కడ డాక్టరు షణ్ముగంగా రెవరూలేరు"అంటూ టఫీమని ఫోనుపెట్టేరు సుదర్శనంగారు.

అదుగో అప్పటినుండి మొదలయింది గజకచ్ఛపయుద్ధం.

ఒకరిమీాద ఒకరికి పీకలవరకు వచ్చింది కోపం.

ఎవరు ఎవరిని మింగేస్తారో అర్థంకాలేదు.

మొత్తానికి ఏదోప్రళయం రాబోతున్నదని అంతా ఉత్కంఠతో ఎదురుచూడ్డం మొదలెట్టాము,

ఆపరేషన్ చేసినరోగి గోలచేస్తుంటే వెళ్ళి మార్ఫిన్ ఇంజక్షన్ చేసి వచ్చాను.

ఇంతలో రాఘవమ్మవచ్చి కూర్చొంది "ఏమిటమ్మా కబుర్లల్లో పడ్డారు" అంటూ.

"ఏమీాలేదు. చందమామలో కథ చెబుతున్నా రంగడికి" అన్నాను.

'అలాగా' అంటూ కొండచిలువ పాకినట్లూ ఆయాసపడుతూ వొర్లుకుంటూ వెళ్ళింది.

"అమ్మయ్య పీడ విరగడైంది" అంటూ మరలా అసలువిషయం లోకి వచ్చాను.

షణ్ముగం ఎలా హాస్పటల్‌లో మందులూ, పాలూ, బ్రెడ్, బొగ్గులూ కట్టెలతోసహా రాఘవమ్మద్వారా ఇంటికి జేర్పించు కొంటు న్నాడో సవివరంగా రిపోర్టురాసి పంపాడు డా॥ సుదర్శనం డి.యం.ఓ కి.

షణ్ముగం తక్కువ తిన్నాడా, డా॥ సుదర్శనం ఎలా హాస్పటల్ దగ్గరకు వచ్చిన రోగులనుండి డబ్బు గుంజుతున్నాడో, ఎలా మందులు ఏషాపుకు పంపి డబ్బు చేసుకొంటున్నాడో ఓ పురప్రముఖునితో డి. యం. ఓ గారికి పిటీషన్ పెట్టించాడు.

కిసుక్కున నవ్వాడు రంగడు.

'ఏమిటిరా' అంటే

"అక్కా మాబాబాయి ఓ జడ్జిగారి భార్య గురించి చెప్పినకథ గుర్తొస్తుంది" అన్నాడు.

"ఏమిటది" అన్నాను.

మా బాబాయి జడ్జీగారి ఆఫీసులో ప్యూను, జడ్జీగారి ఇంట్లో కూడా చిన్నా పెద్దాపని అందుకొంటూ వుంటాడు.

వెనుకటికో జడ్జీగారి భార్య మొగుడిదగ్గర తీర్పుకొచ్చిన కేసు తాలూకు రెండు పార్టీలకూ కబురెట్టేది విడివిడిగా.

ఇద్దరివద్ద డబుల్ ఫీజు వసూలు చేసేది. మొగుడితో ఏమీ చెప్పేదికాదు. చెప్పినా వినేవాడూకాదు !

తీర్పుచెప్పటంఅయ్యాక ఓడిపోయిన పార్టీకి కబురంపేది.

"నా శాయశక్తులా చెప్పిచూశాను. జడ్జీగారు వినలేదు. ఇదిగో మీడబ్బుమీరు తీసుకోండి" అని ఇచ్చి పంపేది.

ఆమె నిజాయితీకి విస్తుపోయి వెళ్ళేవారు పార్టీలు.

నిజం మా బాబాయికితప్ప ఎవరికీ తెలియకుండా వుండటానికి కొంతడబ్బు బాబాయికి యిచ్చేది.

అలావుంది. మన డి. యం. ఓ గారు కూడా అలా చేశారా అన్నాడు రంగడు.

లేదు అంతకంటే రెండాకులు ఎక్కువ చదివారు డి.యం.ఓ.గారు.

పిట్టపోరు పిట్టపోరు పిల్లితీర్చిందని ఇద్దరినీ విడివిడిగా పిలిచి చీవాట్లువేశారు. వారిమీద రిపోర్టులున్నయ్యంటూ పై దాకాపాక్కింది కనుక పెద్దమొత్తాలు వుంటేకాని పని జరగదంటూ ఒకరిముక్కుపిండీ రెండవవాడి చెవులుమెలేసీ వసూలు చేశారు.

తన జేబులు నిండాక రెండు రిపోర్టులూ బుట్టదాఖలు చేశారు.

అదుగో అప్పట్నించీ యిద్దరు మాట్లాడుకోరు.

ఆపరేషన్ థియేటర్‌లో పణ్మగం అవసరంకనుక సుదర్శనంగా రతనిని ఏమీఅనరు థియేటర్‌లోపల, ఇద్దరూ ఆప్తమిత్రులలా వుంటారు.

బయటమాత్రం ఏమీఎరగనివారులా ఎడమొగం పెడమొగంగా వుంటారు.

ఒకరినొకరు ఏమీ చేయలేం అని ఇద్దరకూ తెలుసు.

మింగలేక కక్కలేక ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు.

ఈ డి. యం. ఓ. గారున్నన్నాళ్ళు ఇలానే వుంటారు.

"తర్వాత మళ్ళీ ఎవరిప్రయత్నాలువారు చేస్తారు" అన్నాను.



# కప్పలం

శేషశయనరావుగారు వివాహంచేసికొన్నారన్నవార్త సంచలనాన్ని కల్గించింది మా బజారులో! వినోదంకన్న విషాదంపాలు ఎక్కువయిన ఆయన జీవితంలో పాలుపంచుకోటానికో జీవి వచ్చిందంటే సంతోషించనివారు లేరు.

మావి పక్కపక్క ఇండ్లు. నాకు ఊహవచ్చేసరికే శేషుగారు బి. యల్. పట్టా తీసికొని తండ్రి రామకోటయ్యగారి వద్ద జూనియర్‌గా పనిచేస్తూ వుండేవారు.

రామకోటయ్యగారు పెద్ద పేరుప్రఖ్యాతులున్న క్రిమినల్‌లాయర్ అయినా గ్రంధసాంగుడు. ఇంటినిండా గంపెడు పిల్లలున్నారనయినా లేకుండా పూలరంగడిలా జల్సాజీవితం గడిపేవాడు. డ్రామాలలో వేషంవేసేవాడు! అనేకమంది నటీమణులతో ఆంతరంగిక పరిచయం ఉండేది. రామకోటయ్యగారి భార్య సీతమ్మగారు వెనకటికాలం మనిషి. ఆమె ఏమాత్రం గడుసుదైనా ఆయనను సరాసరి ఇంటికి, పడకటింటికి ప్రియురాండ్రను తీసుకొని రానిచ్చేదికాదు. వెర్రిబాగులది కనుకనే కడిపెడు పిల్లలను కన్నాకకూడా భర్తఇంట్లోనే పరకీయ శృంగార రసాస్వాదన చేస్తూవుంటే చూస్తూ వూరుకోటమేకాక, భర్తకూ ఆయన తీసికొచ్చినవారికి సకలసేవలూ. రాచమర్యాదలూ చేసేది.

నాకు బాగాగుర్తు. ఓసారి ఇద్దరు అక్కచెళ్ళెళ్ళను ఒకేసారి ఇంటికి తెచ్చికొని చెరోపక్కన కూర్చోబెట్టుకొని భార్యచేత సకల పరిచర్యలూ చేయించుకొన్నాడు. ఊరంతా విడ్డూరంగా చెప్పుకొన్నా సీతమ్మగారు "ఆయన తీసుకొస్తే నేనేంచేసేది? ఇంటికి వచ్చిన వాళ్ళకు భోజనం పెట్టకుండా వుండటం నాకు చేతకాదమ్మా!" అనేది.

అసలు వండటం, పెట్టటం, వంటయింటికి అంకిత మవడానికే ఆమె పెట్టిపుట్టినట్లుండేది. ఏ తెల్లారుజామునో లేచి వంటయింట్లో జొర

బడిందంటే మళ్ళీ అర్ధరాత్రవుతుందనగా బయటపడేది. సొంత పిల్లలేకాకుండా భర్త అప్పచెల్లెళ్ళపిల్లలూ, ఇతర బంధువులతో ఎప్పుడూ సత్రంలావుండేది ఇల్లు. అందరకూ ఏలోటూ రాకుండా అన్ని రకాలవంటలూచేసి అమర్చటం, ప్రతివారిని కొసరికొసరి బతిమిలాడి, చేసిన వంటకాలు తినిపించటానికి ఆమెకు పొద్దు సరిపోయేది కాదు. ఈ బంధుబలగం చాలక భర్తగారి ఆత్మబంధువు లెందరో ఆమె చేతివంటలరుచి చూశారు.

నెలకు రెండుబస్తాల మినపప్పు, రెండుబస్తాల కందిపప్పూకూడా ఆమె చేతిలో ఖర్చుకు సర్దుకువాడినా సరిపోయేవి కావంటే నమ్మండి !

శేషశయనరావు పట్టాపుచ్చుకోగానే వచ్చి తండ్రి ఆఫీసులో చేరాడు.

కొద్దిరోజులకే మేనత్తకూతురు సరోజినిని ఇచ్చి పెండ్లి జరిపించారు రామకోటయ్యగారు.

సరోజిని కాపురానికి వచ్చిందేకాని ఆ యింట్లో యిమడలేక పోయింది.

వెర్రిబాగుల అత్త, గ్రంథసాంగుడైన మామలతోనూ, గంపెడు మరదులు, ఆడబిడ్డలతోనూ నిర్లిప్తంగా మరమనిషిలా పనిచేసికొని పోయే భర్తతోనూ సర్దుకుపోలేనని వెంటనే గ్రహించింది !

వేరేకాపురం పెడితేకాని బ్రతకలేనని భర్తకు చెప్పుకుంది. నడిసముద్రంలో చిల్లిపడవలో ప్రయాణం చేయటం వంటిదో [illegible] తమ సంసారభారం మోయటంకంటే అని గ్రహించింది.

కష్టమైనా, సుఖమైనా నడిసముద్రంలో [illegible] తానొక్కడూ తీరాన్ని చేరలేడు అని నిర్ణయించుకొన్నాడు శేషు.

కాళ్ళపారాణి ఆరకముందే ప్రత్యేకించి [illegible].

అదేమని అడుగలేదు, వెళ్ళొద్దని బాధపడలేదు శేషు !

అదుగో అప్పట్నించీ మొదలయినాయి. చిల్లినావను ఒడ్డుకు చేర్చటానికి ఆతను చేసిన ప్రయత్నాలూ, పడినభంగపాట్లూ !

శేషు చేతికక్కరకువచ్చాక కోటయ్యగారికి ముదిమికి ముచ్చ ట్లెక్కువని హుషారెక్కువయింది. ఇదివరకు కోర్టుకువెళ్ళి వాదించ టానికి, పార్టీలు చెప్పేది వింటానికి కొంతసమయం గడచిపోయేది.

ఇప్పుడు ఆయన పార్టీలసొద వినేది తక్కువ, కోర్టుకు హాజ రవటం యింకా తక్కువ.

ఏమాత్రం తర్ఫీదు లేకుండానే శేషు కోర్టులోకివెళ్ళి వాదించ వలసివచ్చింది. అవసరంకొద్దీ శక్తివచ్చినట్లుగా, పెద్దలాయర్లను ఎదిరించి నిలచి తానుకూడా అచిరకాలంలోనే సత్తా నిరూపించుకొన్నాడు శేషు.

ఏం చెయ్యాలి మరి ? తాను వృత్తిలో నిలిచి రాణించకపోతే మహాసముద్రంలాంటి సంసారం, తామరతంపరలా తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ, మూపులుబట్టుకు వేలాడే అనంతకోటి బంధుసముదాయమూ, వెర్రి బాగులతల్లి, వేశ్యాలోలుడైన తండ్రి ఏమయిపోవాలి !

అవసరమే గురువు, అవసరమే శక్తీఅయి దారి చూపింది.

ఎంత సంపాదనవుంటే యీ అవసరాలన్నీ గడచిగట్టెక్కుతాయి!

తామందరికోసం ఇంత చేస్తున్నా శేషుకాపురం నిలబెట్టుదామని అందులో ఏ ఒక్కరకూ తోచలేదు. అసలు పట్టించుకొన్నవారు లేరు.

తండ్రి రామకోటయ్యను అడేమి అనగలవారులేరు. తల్లికి ఎవరేం చెప్పినా ప్రయోజనంలేదు.

తనకుతాను భార్యకోసం తన సంసారాన్ని గాలికి వదలివేయ టానికి సిద్ధంగాలేడు శేషు !

అసలు తనగురించి తానాలోచించుకోటానికి తీరిక ఎక్కడిది ?

నిరంతరం బాధ్యతలలో మునిగితేలుతూ నిత్యం సంసారంలో వచ్చే ఎన్నో ఒడుదుడుకులను సమర్థించుకు రావటానికి ఎక్కడలేని ఓపిక చాలేదికాదు.

తమ్ముళ్ళ చదువులూ, చెల్లెళ్ళ పెండ్లిండ్లూ ఒకదానివెనుక ఒకటి తరుముకువచ్చాయి. చెల్లెళ్ళందరకూ మంచి సంబంధాలుచూసి పెండ్లి చేయించాడు.

మొత్తం శాస్త్రీలు తమ్ముళ్ళుగాని, చెల్లెళ్ళుగాని పదకొండు, అయిదుగురు చెల్లెళ్ళు, ఆరుగురు తమ్ముళ్ళు.

మూడో తమ్ముడు రాము, రెండో చెల్లెలు శకుంతల తప్ప బాధ్యతఎరిగినవారుకాని, అన్న కష్టం సుఖం ఆలోచించేవారుకానిలేరు.

చీరెలుసారెలు, పెట్టుపోతలూ తక్కువయ్యాయని చెప్పటానికి తప్ప అన్నఅనేవాడున్నాడని గుర్తుండేదికాదు చెల్లెళ్ళకు.

సరదాలకూ, షికార్లకూ డబ్బులేన్పుడుతప్ప అన్నదాపులకు వచ్చేవారుకాదు తమ్ముళ్ళు.

తండ్రికోసం బ్రహ్మచర్యదీక్ష పూనిన భీష్ముడూ, యవ్వనం ధారపోసిన పూరుడూ గుర్తుకొచ్చేవారు శేషునిచూస్తే !

శేషు ఊళ్ళో లీడింగ్ లాయరా, కేసులతో తీరికవుండేదికాదు.

అంత తీరికలేని ప్రాక్టీసుచేస్తూకూడా తమ్ముళ్ళ, చెల్లెళ్ళ అవసరాలు తీరుస్తూ మరమనిషిలా, ఓ ప్రాణంలేని యంత్రంలా వుండేవాడు.

వీటన్నిటికితోడు చెల్లెళ్ళూ తముళ్ళూ తెచ్చిపెట్టే వింతసమస్యలు పరిష్కరించవలసి వచ్చేది.

మూడోచెల్లెలు రాజలక్ష్మి చెప్పాచెయ్యకుండా క్లాస్ మేట్ రమేష్‌తో ఉడాయించింది.

ఆమెను వెదకి తీసుకొచ్చి, రమేష్‌వాళ్ళ తల్లీ తండ్రిని ఒప్పించి పెండ్లిచేసి ఓయింటివారిని చేయించి అవతలకు పంపించేటప్పటికీ తలప్రాణం తోకకొచ్చింది.

నాలుగో తమ్ముడు శేఖర్ ఇంటర్ చదువుతూనే మిలటరీలో చేరిపోయాడు. ఏడాదికో రెండేళ్ళకో గుబులుదొర్లినపుడువచ్చి రెండు

రోజు లింట్లోవుండి వెళ్లి పోయేవాడు. ఓసారి వేసంగి సెలవలకు నెల రోజులు సెలవుపెట్టి వచ్చాడు. నాపెళ్లి చేయండంటూ నసపెట్టాడు. "పెద్దవాళ్లు అన్నలు ముగ్గురి పెండ్లి కానప్పుడు నీపెళ్లి ఎలాతలపెట్టాలి" అని అంటే "నేను వాళ్లను పెండ్లి చేసుకోవద్దన్నానా ? నాపెండ్లి చేయమంటున్నానుకాని" అని మొండిగా వాదించేడు.

చేసేదిలేక నెతకి ఓ తెలిసినవారి అమ్మాయిని ముడిపెట్టాడు శేషు.

భార్య రూపకొంగు పట్టుకుతిరుగుతూ గడిపాడు సెలవురోజులు శేఖర్.

ఇంతలో ఆషాఢమాసం వచ్చింది. రూప అత్తగారింట్లోకి రాకూడదు, శేఖర్ అత్తగారింటికి వెళ్ళకూడదు. ఆచారం అలావుంది!

ఇద్దరూ కలసి తెలిసిన బంధువులందరి ఇండ్లకు వెళ్ళేరు.

ఈ వ్యామోహంలోపడి శేఖర్ సెలవు అయినాక 10 రోజులకు గాని మళ్ళీ ఉద్యోగం సంగతి గుర్తు తెచ్చుకోలేదు.

మిలటరీరూల్సు బహు కఠినం !

పీకలమీదికి వచ్చింది. అప్పుడు కావల్సివచ్చింది అన్న సహాయం.

శేషు వెళ్ళి పై అధికారులను బతిమిలాడి, బామాలి, చివరకు డాక్టరు సర్టిఫికేట్ చూపించి మళ్ళీ సర్వీసులో జాయిన్ చేయించాడు

మళ్ళీ తమ్ముడేం పిచ్చిపనులు చేస్తాడోనని, ఉద్యోగం వున్న వూళ్లోనే ఇల్లు అద్దెకు తీసుకొని మరదలుతో కాపురం పెట్టించాడు.

రెండో తమ్ముడు సూర్యం అంతకంటే రెండాకులు ఎక్కువ చదివాడు.

రిసెర్చి చేయటానికి ఉత్కళ యూనివర్సిటీలో చేరినవాడు, రిసెర్చికంటె ముందుగానే సర్దార్జీ ప్రొఫెసర్‌గారి అమ్మాయి ప్రేమ ప్రేమాయణంలోపడ్డాడు. స్నేహానికి ఎంతో ప్రాణంయిచ్చే సర్దార్‌జీలు కోపంవస్తే రుద్రులవుతారని అందరకూ తెలిసిన విషయమేకదా !

ప్రేమకు కట్టుబాట్లు లేవుగాని ప్రకృతికి సహజంగా కొన్ని కట్టుబాట్లు టాయికదా !

అర్జంటుగా తమ పెండ్లి జరగాలనీ, కాని యీ విషయం సర్దార్ ఖత్రామ్ సింగ్‌కు తెలిస్తే తమ నిద్దరనూ ఖతమ్ చేస్తాడనీ, పైగా సింగ్‌గారి బావమరిది ఐ. ఎ. యస్. ఆఫీసర్ అయినందువలన ఆరాష్ట్రం లోనే తాము బతకలేమనీ అందువలన అన్నవచ్చి ఎలాగయినా తా మిద్దరనీ స్వరాష్ట్రానికి తీసుకొచ్చి పెండ్లి చేయించాలనీ, మరీ మరీ బతిమిలాడుతూ ఉత్తరం రాశాడు అన్నకు.

సరే తప్పేదేముంది. వ్యవహారం గొంతుమీదకొచ్చే !

వెళ్లి సూర్యాన్ని, ప్రేమనూ తీసికొని అనేక రైళ్లు మారి కొంత దూరం రోడ్డుమీద ఎక్కినటాక్సీ ఎక్కకుండా ప్రయాణంచేసి, హోటళ్ళలో మారుపేర్లతో రిజిస్టరు చేయించుకొని ఎట్లాఅయితేనేం తిరుపతిచేర్చి అక్కడ పెండ్లితంతు ముగిసింది అనిపించాడు.

పాముబుసతో వెంటబడ్డ ఖత్రామ్‌సింగ్ కూతురు ఉనికి తెలుసు కొంటూ పరిగెత్తుతూ వచ్చేసరికే పెండ్లి అయిపోయింది !

ఆయనకు సర్ది చెప్పటానికి సకల శక్తియుక్తులూ ధారపోయవలసి వచ్చింది.

ఒకసారి మనసు కుదుర్చుకొన్నాక ఆయనంత కలుపుగోలుమనిషీ, సహృదయుడూ మరోడులేడు అన్నంతగా యిమిడిపోయాడు కొత్త బంధువులతో సింగ్ ! అక్కడికి సూర్యం, ప్రేమల వ్యవహారం అలా సుఖాంతం అయింది.

అయిదో తమ్ముడు చంద్రం, నాలుగో చెల్లెలు కళ యం. బి. బి. యస్. పూర్తికాగానే అమెరికా వెళ్ళిపోయారు. అక్కడే వివాహాలు చేసుకొని స్థిరపడిపోయినట్లూ ఇంటికి తెలియచేశారు.

ఆఖరిచెల్లెలు కళావతికి తండ్రి అంశ ఏదో లీలగా వచ్చినట్లుంది. చదువుకంటే నాటకాలనీ, డాన్సులనీ, తిరుగుతూ నాటనాలలో తన

భాగస్వామిగా నటించే కిషోర్‌ని జీవిత భాగస్వామిగా వరించింది. నాటకాలు కూడుగుడ్డా పెట్టేరోజులగావు గనుక భర్తతోసహా పుట్టింటనే ఉండిపోయింది, శాయశక్తులా నాటకరంగ సేవచేస్తూ.

చిన్నతమ్ముడు అఖండమయిన తెలివితేటలుగలవాడు. గ్రాడ్యుయేటు కాగానే ఐ.ఎ. యస్. పరీక్ష పాసయి కర్ణాటక రాష్ట్రంలో సబ్ కలెక్టరుగా చేరాడు. అక్కడే తన పై అధికారిచెల్లెలును వివాహం చేసుకొన్నాడు. ఇంటిసంగతి మర్చిపోయాడు !

తాను చేయనీ, వారే చేసుకోనీ మొత్తానికి చెల్లెళ్లు తమ్ముళ్లూ అందరూ వివాహితులయ్యారు. ఎవరిమానాన వారు బతుకుతున్నారు అని ఊపిరి పీల్చుకొనబోతుండగానే కాలంచేశారు ముందు తండ్రీ తరువాత తల్లీనూ.

పెళ్లిళ్లు అయిపోతే శ్రాద్ధాలు వెంటవచ్చాయి ! అవీ ఏలోటు లేకుండా జరిపించాడు.

అప్పుడు మొదలయ్యాయి అసలు పాట్లు.

ఉమ్మడి కుటుంబాలు క్రమంగా తగ్గిపోటం న్యాయశాస్త్రం రూల్సు సరళం కావించబడటంతో లిటిగేషన్‌లు తగ్గిపోయి ప్లీడర్లకు చాలావరకూ కేసులు తగ్గిపోయాయి. కొత్తగా అనేకమంది పనిలేని కుర్రప్లీడర్లు తయారవటంతో వచ్చేఫీజులు పడిపోయాయి !

ఇంట్లో ఖర్చుచూద్దామా నానాటికి పెరుగుతుందేకాని తగ్గటం లేదు.

తల్లి వుండగా అన్నపూర్ణలా ఎంతమందికయినా వండివార్చి పెట్టేది. ఆమె పోయాక ఎంతడబ్బిచ్చినా ఆయింట్లో వంటపని చేయటానికి ధైర్యంచేసి ముందుకువచ్చేవారుకాదు ఎవరూ. హోటలుకంటె అధ్వాన్నంగాను, సత్రంకంటె అన్యాయంగాను వున్న ఆయింట్లో పనిఅంటే సామాన్యమా !

ఎలాగో తిప్పలుపడి వంటవాడిని పట్టుకువస్తే నాలుగురోజులలో పారిపోయేవాడు.

ఇంతకంటె ఎక్కువబాధ ఆర్థికపరమయినది ! తోడగాతోడగా బావిలో నీరింకిపోయినట్లూ, త్రవ్వగా త్రవ్వగా కొండలు తరిగిపోయి నట్లూ ఎంతఆస్తి, సంపాదనా కూడా చాలనిస్థితి వచ్చింది.

ఏమి చేస్తాడు శేషు ?

తమ్ముళ్లందరూ మంచి పొజిషన్లలో వున్నారు. ఒక్క రాము తప్ప. అందరూ చక్కటి ఉద్యోగాల్లోనో, విశేషలాభం వచ్చే వ్యాపారాల్లోనో బాగా డబ్బు సంపాదించుతున్నవారే.

సిగ్గువిడిచి ఒకొక్కరికీ ఉత్తరాలు రాశాడు ఆర్థికంగా తాను పడుతున్న యిబ్బందుల గురించి.

ఎవరి దగ్గరనుండి ప్రోత్సాహాకరమయిన సమాధానం రాలేదు.

పైగా వచ్చి తమవద్ద వుండమనీ అస్తమానం చెల్లెళ్లను బాగు చేయాలని ప్రయత్నించవద్దనీ అన్నసత్రంలాటి తమ యింటిని ఇంకా మెయిన్‌టెయిన్ చేయాలని చూడటం తెలివితక్కువ అనీ, ఉచిత సలహాలిచ్చారు.

అమెరికాలో స్థిరపడ్డ తమ్ముడసలు జవాబే రాయలేదు.

తనలో తాను కుమిలిపోవటంతప్ప చేయగలిగిందేమీ లేదు.

రాము తప్ప సానుభూతి చూపించేవారుకూడా కరువయ్యారు.

సానుభూతి తప్ప ఆర్థికసాయం చేయగలశక్తి లేదు రాముకి.

కష్టకాలంలో అదయినా కొండంతబలం యిస్తుంది.

పెట్టుపోతల విషయంలో వెనుక అలవాటుపడ్డ పోకడకు స మాత్రం లోటుజరిగినా మండిపోతున్నారు తోబుట్టువులు.

దర్జీవాడు ఏనుగు కథలా అయింది శేషుపని.

వెనుకటికో దర్జీవాడు చెరువుకు నీరు తాగటానికి వెళ్లే కోవెల ఏనుగుకు రోజూ ఓ అరటిపండు ఇస్తూండేవాడు. ప్రతిరోజూ అరటిపండు కోసం అతని షాపువద్ద ఆగేది ఏనుగు. ఒకరోజు పని తొందరలో అరటికాయ ఇవ్వలేకపోతాడు దర్జీ, చెరువుకు వెళ్లి పుక్కిటినిండా నీరు నింపుకొనివచ్చి తొండంతో షాపంతా ఖరాబుచేసి వెళ్లుతుంది ఏనుగు.

అలా అయింది !

ఆర్థిక ఇబ్బందులవలన కొంత, మనశ్శాంతికోసం కొంత ఇల్లు తాళంపెట్టి ఏదైనా ఆశ్రమంలో కొంతకాలం వుండివద్దామని ఆలోచించసాగాడు శేషు.

దాదాపుగా దయాల్బాగువారితో ఉత్తరప్రత్యుత్తరాలద్వారా ఉండటానికి ఏర్పాటుకూడా చేసుకొన్నాడు.

కాని కష్టాలు ఎప్పుడూ వంటరిగా రావుగదా !

ఉన్న బాదరబందీని ఎటువారినటు సర్ది ఇల్లు మూసివేయబోయే సమయానికి రెండో చెల్లెలు శకుంతల భర్త చనిపోయి అరడజనుమంది పిల్లలతో పుట్టింటికి రావలసివచ్చింది. ఉన్న కొద్దిఆస్తికూడా మామగారు చేతినుండి వదలుకోటానికి సిద్ధపడకపోవడంతో నిరాధారంగా వచ్చిపడింది.

చెల్లెల్లందరిలోనూ కష్టం సుఖం విచారించేది శకుంతల వక్కతే! చూస్తూ చూస్తూ ఆమెను వదలి ఎలా వెళ్ళగలడు ?

కలో, గంజో కలసే తాగుదామని ఉండిపోయాడు ప్రయాణాన్ని రద్దుచేసికొని.

శకుంతలది మంచిమనసు. అన్న చెప్పినా వినకుండా బిడ్డలందరినీ చిన్న చిన్న ఉద్యోగాలలో కుదిర్చి, ఇంట్లో పనిమనిషినీ వంటమనిషినీ మానిపించీ, పెరట్లో కూరగాయలు పెంచి, కొంతభాగం ఇల్లు అద్దెకు యిచ్చీ ఆర్థికంగాను మానసికంగాను అన్నకు వెసులుబాటు కల్గించింది.

చెల్లెలు చెడి పుట్టిల్లు చేరినదని దిగులుపడకుండా అన్న బాగోగులు చూస్తూ చేదోడువాదోడుగా వుంటూవుంది. శకుంతలకోసం లేని ఓపిక తెచ్చుకొని మరలా ప్రాక్టీసు మొదలెట్టాడు శేషు !

శేషు తండ్రికాలంనుండికూడా క్రిమినల్ కేసులు ఎక్కువగా వచ్చేయి.

ఓరోజు అర్ధరాత్రి ఒక ముప్పయి సంవత్సరాల విధవరాలు హడావిడిగా తలుపుకొట్టింది. తలుపుతీయగానే బెదిరిపోతూ లోనికి వచ్చి తలుపుగడియవేసిన ఆమె దీనగాధవిని చలించిపోతారు శేషు, శకుంతల.

కమల, శేషమ్మ సవతులు. పక్కవూరిలో పీనాసి సుబ్బయ్య గారని పిలవబడే షావుకారు ధర్మపత్నులు. ఏ విషయంలోనూ ఖర్చు చేయలేని సుబ్బయ్య సంతానం కలుగుతుందనే ఆశతో మొదటి భార్య శేషమ్మ బతికివుండగానే ఆమె అనుమతితో కమలను వివాహం చేసుకొంటాడు.

వివాహం అయిన చాలాకాలానికి కమల మగపిల్లవాడిని కంటుంది. వంశాంకురం జనించాడని సంతోషపడే సుబ్బయ్య సంతోషాన్ని త్వరలోనే హరించి వేస్తుంది శేషమ్మ పిల్లవాడినోట్లో వడ్లగింజ వేసి !

సుబ్బయ్య ఆస్తి తనదేనని ఎంతో కాలంగా కనిపెట్టుకొని నిరాశ చెందిన శేషమ్మ తమ్ముడు ఒకడు ముందుకు వెళ్ళి దాహంలో మునిగి వున్న బావగారి గొంతునులిమి చంపిస్తాడు పొలంలోనే !

బలగం లేని కమలను భర్త, బిడ్డపోయి విచారిస్తున్నదనయినా లేకుండా ఇంట్లోంచి వెళ్ళగొట్టివేస్తారు శేషమ్మ బంధువులు.

అంతటితో వూరుకోక ఓరోజు శేషమ్మ తమ్ముడు శత్రుశేషం వుంచగూడదని కమలను హతమార్చబోగా సమయానికి పక్కవాళ్ళు అడ్డుపడుతారు.

ఎలాగో తప్పించుకొనివచ్చి శేషుపంచన జేరింది. ఆయనయితే తనకు న్యాయం చేకూర్చిపెడతాడనే ధైర్యంతో !

న్యాయప్రకారం ఆస్తిలో సగంవాటా రావాలని నోటీసు పంపుతాడు శేషమ్మకు.

తన భర్త అసలు కమలను వివాహం చేసుకోలేదని, అందువలన ఆస్తిపంచియిచ్చే ప్రశ్న లేదనీ సమాధానం పంపుతుంది శేషమ్మ.

డబ్బుతోనూ బంధుబలగంతోనూ తిమ్మిని బమ్మిని చేసి సాక్ష్యాలను రూపుమాపి వివాహం జరుగలేదని ఋజువు చేయించచూస్తారు.

చాకచక్యంగా కేసు వాదించి, ఓర్పుగా సాక్ష్యాధారాలను సేకరించి, కోర్టులో విజయం పొందుతాడు శేషు.

సుబ్బయ్యగారి ఆస్తిలో సగం వస్తుంది కమలకు !

పరువు, మర్యాద, డబ్బు, ఆస్తి అన్నీ పోగొట్టుకొని కట్టుబట్టలతో అర్థరాత్రి యింటికిచేరిన తనను ఆదరించి ఆస్తి అంతస్తూ అప్ప చెప్పిన శేషుని వదిలి వెళ్ళనంటుంది కమల.

జీవితంలో మొదటిసారి ప్రేమ అంటే ఏమిటో చవిచూస్తాడు శేషు దాదాపు యాభయ్యోపడిలోపడ్డాక !

ఎండిపోయిన చెట్టు మళ్ళీ చిగురించినట్లూ, మోడువారిన శేషు జీవితంలో వసంతం ప్రవేశించింది.

శకుంతల ప్రోద్బలంతో త్వరలోనే వివాహం చేసికొంటారు శేషు, కమల.

చీకటితప్ప వెలుతురే ఎరుగని కష్టజీవి శేషు జీవితంలో చరమాంకంలో నయినా సుఖానికి నోచుకొన్నాడని సంతోషించనివాడు లేడు మావీధిలోనూ వాడలోనూ !

విశేష సంపదతో వచ్చిన వదినను చూడటానికి వచ్చిన శేషు తమ్ముళ్లు చెల్లెళ్ళు ఇంకోరకంగా సంతోషపడ్డారనుకోండి !

తెప్పలుగ చెరువునిండిన కప్పలు పదియారువేలు గదరా సుమతీ!



# స్వయంకృతం

రాహుల్, రంజిత తమ తాతయ్యల ఐశ్వర్య వైభవాలగురించి గొప్పలు చెప్పుకోటం మానలేదు కాలేజీలో తమ స్నేహితులకు.

కాని వారిద్దరూకూడా ఇంటిదగ్గర అమ్మ శైలజ నాన్న పురుషోత్తమ్ తమతమ వంశీకుల గొప్పతనంగురించి వెనకటివలె ఏమీ మాట్లాడకపోవటం గమనించలేదు.

చిన్నప్పటినుండి మాతామహుడు రాఘవగారి జాగీర్దారీ వైభవాలు తల్లివద్ద పితామహుడు సుందర్‌లాల్ జమీ గురించి తండ్రి పురుషోత్తమ్ వద్ద తరచూ వినటాని కలవాటుపడ్డారు పిల్లలిద్దరూ.

మాతామహుడు జాగీర్దార్ !

పితామహుడు జమీందార్ !

తల్లీ తండ్రీ విదేశాంగశాఖలో సాధారణమైన ఉద్యోగాలు చేస్తున్నారన్న సంగతి తేలికగా మర్చిపోయేవారు పిల్లలిద్దరూ.

రాహుల్ కెందుకో మాతామహుని వైభవాలు చెప్పుకోటం ఇష్టం !

రంజితకు పితామహుని హోదా గుర్తుచేసుకోటం ఇష్టం !

ఇద్దరకూ, తమ తల్లిదండ్రుల ప్రస్తుత స్థితిగతులగూర్చి గుర్తు చేసుకోవటం ఇష్టంలేదు.

మాతామహుని రాహుల్ చూడలేదు !

పితామహుని రంజిత చూడలేదు !

పూర్వీకుల గొప్పతనం స్మరించుకొంటూ అంతులేని ఆనందాన్ని, అనంతమైన సంతృప్తిని పొందుతుండే వారిద్దరూ !

పురుషోత్తం దేశవిభజన టైమ్‌లో పాకిస్తాన్ నుండి భారతదేశం వలసవచ్చిన కాందిశీకులతో వచ్చాడు. నాలనేవాళ్ళను పోగొట్టుకొని

కాందిశీకులకోసం ఏర్పాటు చేయబడ్డ అనాధశరణాలయంలో చేరి క్రమంగా బి. ఏ. పాసయి, విదేశాంగశాఖ ఆఫీసులో గుమాస్తాగా చేరాడు.

శైలజ స్వతంత్రం వచ్చినాక రజాకార్ మూవ్‌మెంటులో హైదరాబాదు సంస్థానంనుండి చిన్నతనంలోనే ఢిల్లీ చేరి అయినవారిని పోగొట్టుకొన్నందువలన స్త్రీ సంక్షేమశాఖ ఆధ్వర్యంలో నెలకొల్పబడిన సంక్షేమహాస్టలులోచేరి క్రమంగా మెట్రిక్ పాసయి టైపు షార్టుహాండు నేర్చుకొని విదేశాంగశాఖలో టైపిస్టుగా చేరింది.

పురుషోత్తం పాకిస్తాన్ వదలివచ్చి సంవత్సరాలయినా సింధు రాష్ట్రంలో హైదరాబాదు వద్దగల గ్రామం, అందు తన తండ్రి తాలూకు జమీందారీ, తను నివాసభవనం, తన పూర్వీకుల వైభవ ప్రాభవాలూ ఏదీ మర్చిపోలేదు.

సందర్భం వచ్చినప్పుడల్లా తమ ఆస్తిపాస్తుల వివరాలూ, తమ విశాల నివాసభవనం గురించిన కబుర్లూ, గుర్రాలూ, గుర్రపుబగ్గీలూ, కార్లూ వేన్లూ, నౌకర్లూ చాకర్లూ అట్టహాసం గురించి స్నేహితులకు వినిపిస్తుండేవాడు.

అనాధశరణాలయంలోని ఎసెంబ్లీ హాలుకంటె పెద్ద పూజగది తమకుండేదని పురుషోత్తం అన్నప్పుడు "అమ్మయ్యో" అనేవారు స్నేహితులు.

రిపబ్లిక్‌డే పెరేడ్ అప్పుడు రాష్ట్రపతివెళ్ళే గుర్రపుసారటు అంతసారటు తమకుండేదని అన్నప్పుడు "బాప్‌రే" అనేవారు సహాధ్యాయులు.

పెరేడ్ గ్రౌండ్‌లో గాలప్‌చేస్తున్న ఆశ్వికదళం గుర్రాలవంటివి లెక్కలేనన్ని తమకుండేవని పురుషోత్తం అన్నప్పుడు గుడ్లు పెద్దవి చేసికొని చూసేవారందరూ.

ఫలహారం పెట్టినప్పుడు చిన్నలడ్డు యిస్తే "మాయింట్లో క్రికెట్ బాల్ అంతలడ్లు డజను తినేవాడిని చిన్నప్పుడు" అంటేలొట్టలువేసేవారు.

అంతులేని సిరిసంపదలతో జమీందారీ వైభోగం అనుభవిస్తున్న తను మతావేశమనే కరకురక్కసి పాదాలక్రిందనలిగి అందరనూ పోగొట్టుకొని, ఆస్తినంతనూ నష్టపోయి ఎలాకాందిశీకుల తండాతో భారత దేశం వచ్చిందీ చెప్పేవాడు పురుషోత్తం.

పిషు (పురుషోత్తం ముద్దుపేరు) పిల్లజమీందార్ అంటూ పిలచేవారు స్నేహితులంతా.

ఏమీ పనిలేనపుడు అంతా చుట్టూచేరి పిషు పూర్వీకుల వైభవ ప్రాభవాలు వర్ణించమని వేధించేవారు.

విసుగువిరామం లేకుండా తమ జమీందారీ వైభవం వర్ణించటం పిషు కలవాటైపోయింది,

శైలజ రజాకార్ మూవ్‌మెంటులో నాఅన్న వారి నందరనూ పోగొట్టుకొని ఎలాగో సంక్షేమ హాస్టలులోచేరినా, పూర్వపు హైద్రాబాదు సంస్థానంలో తన తండ్రి జాగీరూ, తమ గత వైభవం మర్చిపోలేక పోయేది.

చుట్టూ స్నేహితురాండ్రను చేరదీసితమ జాగీరు విశేషాలు, తమ భవనం ఎంత విశాలమైనదో.

భవనంచుట్టూరా వున్న కాంపౌండు ఎంత పెద్దదో.

తమ ఆస్తిపాస్తుల వివరాలూ !

పెట్టుకోటానికేకాదు, గుర్తుపెట్టుకోటానికే వీలులేని తమ జవ్హారీ !

వాహనాలూ,

గురించి విసుగులేకుండా చెపుతుండేది !

వినేవాళ్ళ కెవరికైనా విసుగనిపించేదేమో కాని రోజు కెన్నిమార్లు ఎవరు చెప్పమన్నా విరామంలేకుండా చెప్పేది.

జాగీర్దారి శైలజ అని అందరూ పిలచేవారు.

అలా పిలిపించుకోంటున్నందుకు ఎంతో గర్వపడేదికూడానూ

కడుపులో ఎత్తులేక నకనకలాడుతుండే సమయంలో శైలజ తమ భవనంలో జరిగిన విందుతాలూకూ విశేషాలు చెప్పటంతో స్నేహితురాండ్రంతా ఆకలిదప్పులు మర్చిపోయేవారు.

చలికి మునగదీసుకుపోయి, వేళ్లు కొంకర్లుపోయి నరాలు జివ్వుమని లాగేకాలంలో శైలజ జాగీర్దారీ కబుర్లు స్నేహితురాండ్రకు వేడినిచ్చి, చలిబాధ మర్చిపోయేలా చేసేయి.

స్నేహితురాండ్రు వానలోతడిసి, ముద్దయిపోయి గడగడ వణకుతుండే సమయంలో శైలజ తనవార్డు రోబ్ గురించి చెప్పిన కబుర్లతో వూరట కలిగించేది.

ఢిల్లీలో, పెనంలోవేసి మాడ్చినట్లుండే వేసవిరోజున శైలజ చెప్పే చల్లని తమ జాగీరులోని తోటలయొక్క వర్ణనలు వింటూంటే తాపోపశమనంకల్గేది స్నేహితురాండ్రకు.

మంచికీ, చెడుకూ, సంతోషసమయంలోనూ విచారంలోనూ,

శైలజకబుర్లే కాలక్షేపాలయిపోయేవి హాస్టలులో !

అలాగే మెట్రిక్ పాసయి పైపు పార్టుహాండు పాసయి విదేశాంగశాఖలో స్టెనోగా చేరింది శైలజ !

అక్కడ తారసపడ్డారు పురుషోత్తమ్ శైలజ. ఉద్యోగరీత్యా ఏర్పడ్డ సాన్నిహిత్యం కొద్దిరోజుల్లోనే ప్రేమగా మారింది.

నలుగురు స్నేహితులనూ పిలుచుకొని రిజిష్ట్రార్ ఆఫీసులో వివాహం చేసికొని ఓయింటివారయ్యారు.

శైలజ స్నేహితురాండ్రు ఆమె పుట్టింటి జాగీరువైభవాలు చెపితే, పురుషోత్తం స్నేహితులు పురుషోత్తం వంశంయొక్క గొప్పతనం వారి జమీందారీ విశేషాలు చెప్పేరు పెండ్లి పార్టీలో.

దురదృష్టవశాత్తు ఆస్తిఅంతస్తూ కోల్పోయినా, అదృష్టవశాత్తు

హోదాకు తగిన దాంపత్యం దొరకిందని శైలజ స్నేహితురాండ్రూ, పురుషోత్తం స్నేహితులూ అనుకొన్నారు.

కాలక్రమేణా కవలలు రాహుల్ రంజిత కలిగారు శైలజకు.

రాహుల్‌కు మాతామహుని పోలికలు అన్నది శైలజ.

అందుకు తగినట్లే ఊహవచ్చి మాటనేర్చిన దగ్గరనుండి రాహుల్ మాతామహుని జాగీరు గురించి చెప్పటం మొదలెట్టాడు !

రంజిత అచ్చు పితామహునిపోలిక అని చెప్పేవాడు పురుషోత్తం.

దానికి తగ్గట్లే రంజిత బడిలోకి వెళ్ళటం మొదలైన దగ్గరనుండీ స్నేహితులకు తన పితామహుని జమీవైభవాలు వర్ణించటం మొదలెట్టింది !

పిల్లలకు దాదాపు పదిహేను, పదహారు సంవత్సరాల వయసు వచ్చి కాలేజీకి వెళ్ళివస్తున్నారు.

ఒకసారి శైలజకు టైఫాయిడ్ జ్వరంవచ్చి సఫ్దర్‌జంగ్ హాస్పటలులో జేరింది.

పురుషోత్తంకూడా ఆఫీసుకు సెలవుపెట్టి ఇల్లు చూచుకొంటూ, హాస్పటలులో భార్యనుచూసూ హైరానాపడుతుండే సమయాన వయోవృద్ధుడైన వ్యక్తి "జేటీశైలూ" అంటూ తలుపుతీసికొని ఇంటిలోనికి వచ్చాడు.

అపరిచితుడైన పురుషోత్తంకు తనపేరు రాఘవ అనీ, తనకు వెనక హైదరాబాదు సంస్థానంలో జాగీరు వుండేదనీ, రజాకార్ మూవ్‌మెంటులో తానూ తనకుటుంబమూ ఢిల్లీకి పారిపోయి వచ్చామనీ, అందరినీపోగొట్టుకొన్న తమ నౌకరు కొమార్తె శైలజను అప్పుడు సంతోషముగా హాస్టలులో చేర్పించామనీ,

కాలక్రమేణా మళ్ళీ హైదరాబాదు వెళ్ళిపోయి పోయిన ఆస్తి పోగా కాలక్షేపం చేస్తున్నాననీ చెప్పాడు.

శరీరంలో రక్తంబదులు మంచు ప్రవహిస్తున్నట్లు కొయ్యబారి పోయాడు పురుషోత్తం.

కుశలప్రశ్నలు అయి, యోగక్షేమాలు విచారించాక ఆరోజే స్వగ్రామానికి వెళ్ళిపోతున్నందువలన శైలజను చూడలేకపోతున్నాననీ, శైలజతండ్రి తనకెంతో నమ్మకమైన నౌకరని, రజాకార్లు అతడినీ భార్యనూ చంపటంతో శైలజను తాను తీసికొనివచ్చి హాస్టల్‌లో జేర్పించాననీ, ఇన్నిరోజులకు పనివుండి ఢిల్లీవచ్చి హాస్టలులో విచారించి అడ్రసు కనుక్కొని వచ్చాననీ, వ్యవధిలేదుకనుక హాస్పటలుకు రాలేననీ, యీసారివచ్చినపుడు కలుసుకుంటాననీ మరీమరీ చెప్పి వెళ్ళాడు రాఘవ.

అయితే శైలజ జాగీరు కబుర్లన్నీ అబద్ధాలన్నమాట !

కాని తనకు ఆమె రహస్యం తెలిసిందనిమాత్రం ఆమెకు చెప్ప లేకపోతాడు పురుషోత్తం !

వెనకటిలా తన పూర్వుల వైభవాలను వర్ణించలేకపోతున్నాడు పురుషోత్తం !

ఈ సంఘటనజరిగిన కొద్దిరోజులకే దేశవిభజన తర్వాత దాదాపు ముప్పై సంవత్సరాలయినాక పెద్దబృందం ఒకటి భారతదేశంనుంచీ పాకిస్తాను వెళ్ళింది.

అందులో తాను సెలక్టు అయినపుడు ఎంతో పొంగిపోతుంది శైలజ తన మామగారి జమీందారీ వైభవాలు స్వయంగాచూడొచ్చు గదా అని !

కాని ఎప్పుడూ తన పూర్వీకుల వైభవాలు వర్ణించే పిషూ నిర్లిప్తంగా ఉంటున్నాడేమిటి ?

ఏమిటో ?

భారతదేశ ప్రతినిధి బృందంతో పాకిస్తాన్ అంతా పర్యటించు తున్నప్పుడు, లీడరు అనుమతిపొంది శైలజ హైదరాబాదు దగ్గరలో ఘాజియాబాద్ సంస్థానాన్ని చూడటానికి వెళుతుంది,

మాసిపోయినకోటలో మసీదుగా మార్చబడ్డ దేవాలయం మాత్రం కొట్టొచ్చినట్లు కనబడుతుంది !

జమీందార్ సుందర్‌లాల్‌గారి విషయాలేమైనా తెలుస్తా యేమోనని మసీదులోని ముసలి మౌల్వీని అడుగుతుంది.

"సుందర్‌లాల్ హమారాదోస్త్‌థా పార్టిషన్ కైమ్‌మే ఖతమ్ హువా" అంటాడాయన.

"ఆయనకొడుకు ఏమయ్యా" డంటుంది కుతూహలం ఆపుకోలేక శైలజ.

సుందర్‌లాల్‌కు పిల్లలే లేరు అని ముసలి మౌల్వీ చెప్పిన సమాధానంతో వెయ్యివోల్టుల కరెంటు ప్రవహించి మనిషిని నిర్జీవంగా చేసినట్లుండిపోతుంది.

అయితే పిషూ చెప్పే వైభోగాలన్నీ అబద్ధాలన్నమాట !

కాని ఎందుకనో భారతదేశం తిరిగివచ్చాక భర్తయింటివి గాని పుట్టింటి వైభవాలు వెనకటిలా వర్ణించలేకపోతూన్నది శైలజ !

తల్లీ తండ్రీ చెప్పటం మానినా, పితామహ, మాతామహుల వైభవాలగురించి రాహుల్, రంజిత చెప్పటం మానలేదు తమ స్నేహితులకు.



# కర్మయోగి

"రామకృష్ణ మాస్టారు ఎలావున్నారే?" అన్నాను నేను కాలేజీ సహాధ్యాయిని రమణిని.

రమణి నేను పి. యు. సి. లో సహాధ్యాయినులం.

పి. యు. సి. తర్వాత నేను చదువు ఆపి గృహిణిగా మారాను.

రమణి చదువు అంతుచూస్తూ ఎం. ఏ. చదువుతుంది పాట్నా యూనివర్శిటీలో.

ఏదో పనివుండి ఇంటికివస్తే నేను కుతూహలం ఆపుకోలేక అడిగాను మాస్టారిగురించి.

"అంతా మామూలే! ఎవరకూ అర్థంకారు అక్కడకూడా, హిస్టరీలో ఎంతో రిసెర్చిచేసి ఎన్నో పేపర్లు ప్రచురిస్తున్నారు, ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడరు. అట్లని ఎవరినీ కించపరచరు.

ఇక్కడ ఉన్నప్పుడు ఎలాఉండేవారో అక్కడకు వెళ్ళాకకూడా అలానే ఉన్నారు.

మనిషి స్వభావంలోనూ, రూపంలోనూ, గుణంలోనూ ఏమీ మార్పులేదు.

వ్యక్తిగతంగా మనిషి ఇక్కడ ఎలా వుండేవారో అక్కడ అలానే వుంటారు.

చొక్కా గుండీలు సరిగా పెట్టుకోరు.

తల సరిగా దువ్వుకోరు. ఎప్పుడూ జుత్తువచ్చి నుదురుమీద కాపురం చేస్తుంటుంది

వేసుకొన్న చొక్కా, పాంటు చిరిగిపోయినవో లేదో గమనించుకోరు.

బెల్టు షూస్ బెల్టు ఎప్పుడూ పెట్టుకోరు సరిగా.

లెక్చర్ క్లాసు కెప్పుడూ ప్రిపేర్ అయి రారు.

క్లాసుకువచ్చాక ఇవాళ ఏంపాఠం చెప్పాలి అని అడుగుతారు.

ఎవరో ఒక విద్యార్థి చెపుతాడు.

ఇక మొదలవుతుంది పరవళ్ళుత్రొక్కే గంగాప్రవాహం లాంటి వాగ్ఝరి.

మంత్రముగ్ధులైనట్లు వింటారు విద్యార్థులు.

టైమెంతయిందో ఆయనుకూ గమనం ఉండదు! విద్యార్థులకూ తెలియదు!

ఒకోక్కసారి తర్వాత పిరీడు లెక్చెరర్‌వచ్చి క్లాసురూమ్ వాకిలి వద్ద అలాగే నిలబడిపోయుంటాడు కొద్దినిముషాలు.

ఎప్పుడో ఎలానో బ్రేకుపడుతుంది వాక్ప్రవాహానికి.

మాట్లాడకుండా వెళ్ళిపోతారు.

తనవల్ల క్లాసుబయటనుంచోని ఉండిపోయిన సాటి లెక్చెరర్‌కు సారీ అయినా చెప్పకుండా!

ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడరు.

మొదట్లో అందరూ గర్విష్ఠి అనుకొనేవారు ఇక్కడలానే!

ఆయన వాలకం చూసి బాగా ఏడిపించాలని ప్రయత్నంచేయక పోలేదు విద్యార్థులు.

ఆయన అనర్గళోపన్యాసం విన్నాక అలాంటి ప్రయత్నం చేయటానికి ఎవరూ సాహసించలేక పోయారు.

ఎంతటి దగుల్బాజీ రౌడీ స్టూడెంటుకూడా అయన్ను చూడగానే గౌరవభావంతో నమస్కరించుతాడు.

ఆయన ఎవరు నమస్కరించారో సరకుగానే స్థితిలోఉండరు.

మొత్తానికి ఇక్కడ వున్నప్పుడు మన కాలేజీలో అందరూ నెత్తిన పెట్టుకొన్నట్లే అక్కడానూ.

బహుశా ఇక్కడకంటే ఎక్కువగా అక్కడ యూనివర్సిటీలో అంతా గౌరవిస్తారు.

చరిత్రకు సంబంధించిన విషయాలలో మనదేశంలోని "అత్యుత్త మాధ్యాపకులలో ఆయనొకరని చెప్పుకొంటున్నారు" అంది రమణి.

"కమలా ఇక్కడ మాస్టారి కుటుంబం, ఆయన భార్య స్వరూప వాళ్ళు ఏంచేస్తున్నారు? ఎలావున్నారు?" అని అడిగింది నన్ను.

"మాస్టారుతల్లి స్వరాజ్యంగారు ఆయనను తలచుకొని కంటతడి పెట్టనిరోజులేదు. తండ్రి ప్రసాద్‌గారు అసలాయనను గుర్తుతెచ్చుకో టానికి ప్రయత్నమే చేయరు ఎప్పుడూకూడా !

భార్య స్వరూప అత్తరాజేశ్వరీగార్లు మాత్రం ఎప్పుడూ తిట్టిన తిట్టు తిట్టకుండా నోటిదూల తీర్చుకుంటున్నారు.

"ఇక్కడ అంతా మామూలే" అన్నాను నేను.

మాయిద్దరి ఆలోచనలూ గడియారం ముల్లును వెనక్కు తిప్పి నట్లుగా కొద్ది సంవత్సరాల వెనక్కు మళ్ళించాము అప్రయత్నంగా !

రామకృష్ణగారి తండ్రి ప్రసాద్‌గారిది మాఊను పక్కనేవున్న చిన్నవూరు.

ఆస్తి తగుమాత్రంగాఉన్నా, కాలేజీచదువు పూర్తిచేయకుండా మధ్యలోనే ఆపివేశాడు ప్రసాద్.

స్వరాజ్యంగారిని వివాహం చేసుకొన్నాక కొద్ది సంవత్సరాలకు రామకృష్ణ పుట్టాడు.

ఉన్నకొద్దిఆస్తి అమ్ముకొనివచ్చి డబ్బు బ్యాంకిలోవేసి కొద్దిగా డబ్బుచేతపుచ్చుకొని బళ్ళారివెళ్ళి ఇరవైఎకరాల మాగాణీభూమికొని వచ్చాడు.

బ్యాంకులో డబ్బు అయిపోయే సమయానికి ఆయనకొన్న భూములధర పెరిగింది.

పొలం అమ్మితే వచ్చిన డబ్బులో ఎక్కువభాగం బ్యాంకులో వేసి కొద్ది డబ్బుతో నాగపూర్‌వద్ద పొలం కొన్నాడు.

చరిత్ర పునరావృతం అయేది కొద్ది సంవత్సరాలలో !

ఇలా గడుపుకొచ్చేవాడు సంసారాన్ని ప్రసాద్‌గారు.

స్వతహాగా ఏపనీ చెయ్యరు.

ఏమీా కష్టపడలేరూ పడగుకూడాను.

స్వరాజ్యంగారు ఏమిచెప్పినా వినిపించుకోరు.

రామకృష్ణగారొక్కరే అవటంవలన పెద్దగా ఆర్థిక ఇబ్బందులకు లోనుకాకుండానూ, పెద్దగా భోగాలనుభవించకుండాను మధ్యే మార్గం లో దొర్లిపోయేది సంసారం.

కొంతకాలం అయ్యేసరికి స్వరాజ్యంగారిలోకూడా ఓవిధమయిన నిర్లిప్తత, బేపర్వా ఏర్పడ్డది.

రామకృష్ణ మొదటినుండి శ్రద్ధగా చదువుకొనేవాడు.

ప్రాపంచిక విషయాలేమీా పెద్దగా పట్టించుకునేవాడుకాడు.

చరిత్ర అంటే ఆయనకు మొదటినుండి అభిమానం.

అందరకూ సామాన్యంగా గుర్తుండని సంవత్సరాలతో సహా చరిత్రపుటలు తిరగేసినట్లుంటుంది ఆయన నోరువిప్పితే !

పైగా ఇంగ్లీషు భాషలో అనర్గళంగా సాగిపోయే ఆయన ఉపన్యాసధోరణి ఎవరినైనా ఇట్టే ఇంప్రెస్ చేసేది.

కాని ఆయన బి. యే. యూనివర్శిటీ ఫస్టు తెచ్చుకొని పాసయే నాటికి తండ్రి ఆస్తి పూర్తిగా ఖర్చుపెట్టేశాడు.

పైచదువు చదువుకోటానికి ఇంట్లో చిల్లిగవ్వలేదు.

తల్లి మెడలో నగలు ఎప్పుడో ఖర్చయి పోయాయి.

రామకృష్ణ చదువుఖర్చు, ప్రసాద్‌గారి వ్యసనాలకయే ఖర్చూ, ఇంటిఖర్చూ కలసి ఆస్తినీ హరించివేశాయి.

నలుగురు నడిచేచోట గడ్డిమొలవదన్నట్లు నాలుగురకాలుగా ఖర్చయ్యేచోట డబ్బు నిలవదుగదా !

పైగా ప్రసాదుగారు సాగర్ ఆయకట్టులో కొన్నపొలం ధర ఎక్కరాలేదు. ఆదాయం ఏమీారావటంలేదు పొలాలనుండి.

తప్పని పరిస్థితులలో మావూరి కాలేజీలో ట్యూటర్‌గా చేరారు పేరుకు ట్యూటరేగాని సగం లెక్చరుక్లాసులు ఆయనే తీసుకొనేవారు.

ఏ క్లాసుకూ తయారయి వచ్చేవారుకారు.

ఆయన చదివింది అప్పటికి బి. ఏ. నే అయినా బి. ఏ. క్లాసులకుకూడా ప్రిపేర్ అవకుండానే చక్కగా పాఠం బోధించేవారు.

యం. ఏ. చదివిన లెక్చరర్ల క్లాసులకు వెళ్ళని విద్యార్థినీ విద్యార్థులుకూడా రామకృష్ణగారు క్లాసు తీస్తున్నారంటే పరిగెత్తుకొచ్చేవారు.

రామకృష్ణగారికి జ్ఞానతృష్ణ అధికం. ఎప్పుడూ చరిత్రకు సంబంధించిన అనేక విషయాలనుగూర్చి పరిశీలనగా చదవటం, ఆలోచించటం తప్ప బయట ప్రపంచంతో ఏమీ సంబంధం పెట్టుకొనేవారుకాదు.

ఆయన ఏ స్టూడెంటుతోనూ ఎక్కువగా మాట్లాడకపోయినా, పాప్యులాటరిటీకన్ టెస్టుపెడితే అధ్యాపకులందరిలోకి ఆయనకే ఫస్టు మార్కు వస్తుంది.

విద్యార్థినీ విద్యార్థు లందరకూ ఓవిధమైన హీరోవర్షిప్ ఆయన అంటే !

ఆయనమాత్రం ఎంతసేపటికి పై చదువు ఎలాచదవాలా అని ఎప్పుడూ మథన పడుతూండేవాడు.

ఎలాగైనా స్కాలర్ షిప్‌తో సీటుదొరికితే యం. ఏ. చదవాలని చాలా యూనివర్సిటీలకు దరఖాస్తులు పెట్టారు.

కాని ఆ సంవత్సరం ఎందువల్లో ఆయనకు స్కాలర్ షిప్‌తో చదువుకోటానికి ఎక్కడా సీటు రాలేదు.

దరఖాస్తుపెట్టిన ప్రతి యూనివర్సిటీలోనూ సీటు మాత్రం వచ్చేది.

ఆర్థికపరిస్థితి అనుకూలంగా లేదుకనుక సీటువచ్చినా ఎక్కడా చేరలేదు రామకృష్ణమాస్టారు.

ఇలా ఓ సంవత్సరం జరిగింది. ప్రసాద్‌గారు ఓ సంబంధం మాట్లాడేరు రామకృష్ణ మాస్టారుకి.

రాజేశ్వరికి స్వరూప అనే ఓ కురూపి కూతురు వుండేది.

ఆ అమ్మాయిని వివాహం చేసికొంటే ఇరవై వేలు డబ్బు ఇస్తానని కబురంపింది ప్రసాద్ గారికి.

రామకృష్ణగారు చదువుకోటానికి ఆడబ్బు ఉపయోగపడుతుందని నచ్చచెప్పి ప్రసాద్ గారు రామకృష్ణగారు స్వరూపను వివాహం చేసుకోటానికి ఒప్పించారు.

వివాహానికి కాలేజీవిద్యార్థినీ విద్యార్థులం, అధ్యాపకబృందం, ఇతరసిబ్బందీ వెళ్ళాము. అందరినోటా ఒకేమాట "కాకి ముక్కుకు దొండపండు" అని మాస్టారిమీద అందరూ సానుభూతివర్షం కురిపించారు.

వివాహమయిన కొద్దిరోజులలోనే రాజేశ్వరిగారు పెద్ద దుమారం మొదలెట్టారు.

అల్లుడు తన కూతురు ముఖం చూడటంలేదని వియ్యంకుడు డబ్బుకక్కుర్తికి కోడలుగొంతు కోశాడనీ!

తలోమాటా అనుకున్నారు

రామకృష్ణగారికి పిల్లనిద్దామని అదివరకు అనుకొని ధైర్యం చేయలేనివారు స్వరూపకు తగిన శాస్తి జరిగిందన్నారు.

ఇతరులలో కొంతమంది కురూపి స్వరూపతో ఏమగాడైనా ఎలా సంసారం చేస్తాడులే అన్నారు.

కొంతమంది రామకృష్ణ మాస్టారుకు ఇదివరకే చరిత్ర పుస్తకాలతో పెండ్లయిపోయిందనీ అందువలన ఆయన ప్రవర్తనలో వింత లేదనీ అన్నారు.

ఇలా అందరూ అనుకొంటూండగానే పాట్నాయూనివర్సిటీలో స్కాలర్ షిప్ తో యం. ఏ. లో సీటునోరికి వెళ్ళిపోయారు ఫూరినుండి మాస్టారు.

ఎం. ఏ. లో చేరిన తర్వాత రామకృష్ణగారు తల్లినీ తండ్రినీ, భార్యనూ అందరనూ మర్చిపోయారు; ఫూరినే మర్చిపోయారు.

రాజేశ్వరిగారు, స్వరూపగారూ, ప్రసాద్ గారు రాసిన ఉత్తరాలకు ఏమీ సమాధానం రాసేవారుకాదు రామకృష్ణగారు.

చదువుమీద ఉండే ఆసక్తితో డబ్బుకోసం స్వరూపను వివాహం చేసుకొన్నా, ఆమె ముఖంచూశాక కలిగిన జుగుప్సతో అలా అందరనూ వదలివెళ్ళి చదువులో మునిగిపోయారేమో అనుకొనే వాళ్ళం ఆయన శిష్యులలో కొంతమందిం.

స్వరూపముఖం పగలుచూస్తే రాత్రి కలలోకి వచ్చేంత ఘోరంగా వుండేది.

ఆయనకు తన సబ్జక్టు గురించితప్ప ఇతర ప్రాపంచిక విషయాలు గురించి ఏమీ ఎప్పుడూ పట్టించుకోని ఋషితుల్యుడని కొందరూ.

అసలాయనకు భార్య అవసరం లేదని కొందరూ అన్నారు.

ఎన్ని ఉత్తరాలకూ సమాధానాలు రాకపోయేసరికి మొదట రాజేశ్వరిగారూ, తర్వాత స్వరూపా రామకృష్ణమాస్టారిని దుమ్మెత్తి పోసేవారు.

"బిడ్డగొంతుకోశా"డనేది రాజేశ్వరి,

"మాడబ్బు కాశపడి నన్ను చేసుకొన్నాడు. ఇంతకన్నా జోలె పట్టుకువస్తే ఇరవై పేలూ వేసేవాళ్ళంగాదా" అనేది స్వరూప.

కొంతకాలంఅయాక మాడబ్బు మాకివ్వమని ప్రసాద్‌గారిమీద వత్తిడి తెచ్చారు రాజేశ్వరీ, స్వరూప.

డబ్బు ఎప్పుడో అప్పులు తీర్చటానికి, పెండ్లిఖర్చులకు అయి పోయింది. అందువలన కిమ్మనకుండా ఉండిపోయాడు ప్రసాద్‌గారు.

రామకృష్ణమాస్టారి జ్ఞానతృష్ణ తీరటానికి తగిన అవకాశం వచ్చింది.

ఎం. ఏ. చదువుతూనే తాను పరిశోధించి తెలుసుకున్న విషయాలను అనేక జాతీయ, అంతర్జాతీయ పత్రికలలో ప్రచురణకు పంపేవారు.

పరిశోధనకు డబ్బుకావలసినప్పుడు ఏపనైనా చేసేవారు. కాయ కష్టంతోకూడిన దైనాసరే.

కొన్నిసార్లు షాపుల్లో లెక్కలురాసి పెట్టేవాళ్ళు, చిల్లరమల్లర పనులు చేసేవారు.

ఈ విషయాలు మాపూరిలో తెలిసి రాజేశ్వరిగారు మండి పడ్డారు.

"అనవసరంగా ఆ లేనివాడికి పిల్లనిచ్చా" నంటూ.

ఎం. ఏ. పూర్తయ్యేదాకా కూడా రామకృష్ణగారు ఇంటికి రాలేదు.

కూతురుమీదకల్లాం ఆశకూడా తీరిపోయింది రాజేశ్వరిగారికి.

ఇక కోపమంతా దాడి మొదలెట్టింది ప్రసాద్‌గారిమీద.

మాష్టారి క్షేమసుఖాలు కొద్దినెలలు మాకెవరికీ తెలియదు.

సావిత్రి గమణి పాట్నా యూనివర్సిటీలో ఎం. ఏ. లో చేరిన తర్వాత ఉత్తరం రాసింది, రామకృష్ణమాష్టారు అక్కడే రిసర్చి చేస్తున్నారని.

అందుకనే గమణి మాపూరికి వచ్చినపుడు మాష్టారి విషయం వివరంగా అన్నీ చెప్పడాన వచ్చింది ఆయన విషయాలు.

ఎం. ఏ. పాసయినవాటికి రామకృష్ణమాష్టారికి ఆర్థికంగా ఇబ్బందులు తొలగిపోయాయి.

మాష్టారిని అభిమానించే పార్శీవారి అమ్మాయి ఇందిర మాష్టారి పెళ్ళాడిందట.

ఇందిర, ఆమె తల్లితండ్రీ రామకృష్ణమాష్టారికి అన్నపానాదులకేకాదు ఆర్థికంగాకూడా ఏలోటూరాకుండా చూసుకొనేవారు.

ద్వారకాక్షేత్రంలో "త్రవ్వకాల" చారిత్రక పరిశోధనలో మునిగిన మాష్టారికి ఇల్లూ, పూర్వం తల్లితండ్రీ, భార్యా అందరనూ మర్చిపోయి వుంటారు.

"గాంధీజీ కొండను చెప్పినట్లు నిరంతర చరిత్ర పరిశోధనాసక్తి గల మాష్టారికి స్త్రీ అవసరంలేదేమో" అన్నాను నేను.

"నేనుకూడా అలాగే అనుకొన్నాను. ఒకే పూరినుండి వచ్చినదాన్నవటంతో మాష్టారితో కొంతచనువు తీసుకునేదాన్ని.

ఒకరోజు మాష్టారిగది కెళ్ళాను ఏదో విషయం అడిగితెలుసుకుందామని.

దగ్గరకు వేసికొనివున్న తలుపు తెరిచికొని లోనికిపోయిన నేను షాక్ తిన్నట్లు నిలబడిపోయాను !

మంచంమీద మాస్టారు కూర్చొని చదువు కొంటున్నారు.

అలసి అస్తవ్యస్తంగా నిద్రపోతోంది ఇందిర మాస్టారితొడమీద తలపెట్టుకుని !

ఆమె ఉనికిని గమనించకుండానే చదువు కుంటున్నారు మాస్టారు

మాస్టారికి ఆకలి, నిద్ర ఇతర శరీరావసరాలపట్ల ఎంతనిర్లిప్తతో కామంపట్లకూడా అంతే అని అర్థం అయింది.

మెల్లగా చడీచప్పుడూ కాకుండా గదినుండి యీవలకు వచ్చాను

ఇందిర తల్లీ తండ్రీకూడా యీవిషయం తెలిసి ఊరుకుంటున్నారని అర్థమయింది.

లేకపోతే గదితలుపులుకూడా వేసికోకుండా వుండరు మాస్టారు ఇందిర !

ఇలాటి విషయానికి మనవూళ్లో జరిగినంత ప్రచారం పట్నాలలో జరుగదు.

బహుశ మాస్టారు ఇందిర సన్నిహితంగా ఉంటున్నారన్న సంగతి ఎవరికీ తెలియదేమోకూడా.

గది బయట దాదాపు ముభావంగా వుంటూవుండేవారిద్దరిమధ్యా అంత సాన్నిహిత్యం వున్నదని ఎవరూ వూహించలేరు.

"తెలిసినవాళ్లు ప్రచారమూ చేయరు. ఇక్కడ మాదిరిగా ! అన్నది.

రమణి చెప్పిన విషయం విన్నాక ఆలోచనలో పడ్డాను.

చరిత్ర సబ్జక్టు కంకితమయిపోయిన రోబర్ట్ రామకృష్ణమాస్టారు

మానవజన్మ ఎత్తారుకాబట్టి అన్నపానాలు, ఎట్సెట్రా, యితర శరీరావసరాలు నిర్లిప్తంగా తీర్చుకుంటున్న ఒక కర్మయోగిగా కనపడ్డారు.

జీవించటానికే తింటంకాని, తింటానికి జీవించటం లేదాయన !

ఇతర విషయాలూ అంతే !